318వ సంచిక

# చతుర

జులై 2004 రూ. 7/-



## ఇది జీవితం

కె. ప్రవీణారెడ్డి

3.07.04 (శని)

# సచిత్ర విచిత్రం

# 23 వసంతాలు నిండిన టెస్ట్‌ట్యూబ్ బేబీ



అమెరికాలో పుట్టిన తొలి టెస్ట్ ట్యూబ్ బేబీ ఎలిజబెత్‌కేర్ ఇటీవల 23వ పుట్టిన రోజు జరుపుకుంది. ఎలిజబెత్ 1981 డిసెంబర్ 28న వర్జీనియా రాష్ట్రంలోని నార్‌ఫోక్‌లో జూడీ అనే మహిళకు పుట్టింది. 1982లో లైఫ్ పత్రిక అట్టమీద ఎలిజబెత్ కేర్ ఫొటో వేశారు. ఆమె 17వ ఏట ఎలా వుందో 23వ ఏట కూడా అలాగే వుంది. అదే ఎత్తు అదే బరువు.



# ఏరినముత్యాలు

* అజ్ఞానం మార్పుకి బద్ధ విరోధి.

– నెహ్రూ

* ఆకలితో బాధపడేవాడికి అన్నం కావాలి. అతనికి దేవునితో పనిలేదు

– నెహ్రూ

* పేదల కన్నీరు రాజుల సింహాసనాలను ముంచివేస్తుంది

– అనిబిసెంట్

* పెద్దవాళ్ళతో చిన్నవాళ్ళతో సభ్యతగా మెలిగి అందరి మన్ననలను పొందగలవాడే గొప్ప విద్యార్థి

– గాంధీ

* భయం ఎప్పుడూ అజ్ఞానంనుంచే పుట్టుకొస్తుంది

– ఎమర్సన్

* ప్రజలను ప్రేమించనివాడు దేశభక్తుడుకాలేడు

– టంగుటూరి ప్రకాశం

* వ్యక్తిగా ప్రతీవారిని గౌరవించుగానీ పూజింపకు

– ఐన్‌స్టీన్

* నిత్యము పోరాడి గెలుచుకునేవాడే స్వేచ్ఛను నిలుపుకొనగలడు.

– గోథె

* మన ఎదుట భయపడేవారు, మన వెనుక మనల్ని అసహ్యించుకుంటారు

– థామస్ ఫుల్లర్

* ఉన్నతమైన ఆలోచనలు, ఉదారమైన ఆశయాలు కలబోసుకుంటే చక్కటి నడవడిక అదే తయారవుతుంది

– స్వామీశివానంద

* మనిషికి నమ్మకం అనేది ఆత్మలాంటిది. ఒకసారి అదిపోతే, ఎంత ప్రయత్నించినా తిరిగిరాదు.

– పబ్లియస్ సైరస్

* మగవాడికి సమానమయిన మగువ, అచిరకాలంలోనే అతడికి అందనంత ఎత్తుకు ఎదిగిపోతుంది.

– సోక్రటీస్

* తనకి సొంతం అంటూ ఏమీలేనివాడే, ఈ ప్రపంచంలో అందరికన్నా ధనవంతుడు

– బెంజిమన్ ఫ్రాంక్లిన్

సేకరణ: టి. మహి

# ఎవరికి నీవు కావాలి?

ఫీచర్

"క్రూయల్టీ టు యానిమల్స్ ఈజ్ అఫెన్స్, పనిషబుల్ అండర్ ద ప్రివెన్షన్ ఆఫ్ క్రూయల్టీ టు యానిమల్స్ యాక్ట్, 1960"

మన ఇండియన్ పీనల్ కోడ్‌లో అసలి లాంటి చట్టం వుందని ఎంతమందికి తెలుసు?

పద్దెనిమిది వందల అరవై ఆరులో 'ద ఫస్ట్ అమెరికన్ సొసైటీ ఫర్ ద ప్రివెన్షన్ ఆఫ్ క్రూయల్టీ టు యానిమల్స్'ను స్థాపించిన హెన్రీబెర్గ్... దేశవిదేశాలలో ఈ చట్టం పుట్టుకకు ఓ రకంగా మార్గదర్శకుడనవచ్చు. అమెరికాలోని ప్రముఖ షిప్ బిల్డింగ్ ఫ్యామిలీకి చెందిన హెన్రీబెర్గ్ ఇంగ్లాండ్‌లోని సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో యునైటెడ్ స్టేట్స్ ఎంబసీ సెక్రటరీగా పని చేస్తుండేవాడు.

ఒకరోజు జార్స్‌కేపిటల్‌లో లెగేషన్ కేరేజ్‌లో వెళుతుండగా గుర్రపు బగ్గీని లాగలేక కూలబడి పోతున్న ఒక గుర్రాన్ని కొరడాతో కొడుతున్న రష్యన్ కేబీ కనిపించాడు. అతని చేతిలోని కొరడానీ గడగడ వణికిపో





తున్న గుర్రాన్ని చూడగానే బెర్గ్ కేరేజ్‌లోంచి ఒక్క ఉదుటున కిందకు దూకి కొరడాని ఒడిసి పట్టుకున్నాడు. ఆ క్షణమే ఆయన 'ఐ యామ్ బార్న్ ఫర్ యాని

కవర్ ఫొటోగ్రాఫర్: మధు
మోడల్: దేవకి





ప్రస్తుతం... న్యూయార్క్ సిటీలో ఆయనచే స్థాపించబడిన ఎ.ఎస్.పి.సి.ఎ సంస్థ సంవత్సరానికి దాదాపు పన్నెండు వేల కేసుల్ని యాంటీక్రూయల్టీ చట్టం కింద ఇన్‌వెస్టిగేట్ చేస్తోంది. ఆ సంస్థకు చెందిన అయిదు షెల్టర్స్‌లో ఏడాదికి రెండు వందలా యాభైవేల జంతువులు ఆశ్రయం పొందుతున్నాయి.

మల్స్' అన్న నిర్ణయానికొచ్చేశాడు.

అంతే తన డిప్లొమేటిక్ సర్వీస్‌కి రాజీనామా చేసి జీవితాన్ని మూగజీవుల సేవకు అంకితం చేశాడు. జీవహింసను నిరసిస్తూ వీధుల వెంట ఒంటరిగా పెట్రోలింగ్ చేస్తున్న ఆ మహనీయుడికి తొలిరోజుల్లో ఎదురైంది కేట్‌కాల్స్. ఆయన ముందు నడుస్తుంటే వెనక ఈలవేసి గోల చేసిన వారే అంతా. క్రేంక్ అనీ మెడ్లర్ అనీ ఎగతాళిగా పిలిచినవారే. అయినా ఆయన వెనుదీయలేదు. అమెరికాలో యాంటీ క్రూయల్టీ చట్టాన్ని అమలులోకి తెచ్చేవరకూ నిద్రపోలేదు.

ఇప్పుడు మన దేశంలోనే కాదు ఎన్నో అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆ చట్టం వుంది.

ఇంతకీ ఆ చట్టం ఏమంటుంది?

మూగజీవుల్ని హింసించడ నేరం. వాటిని కొట్టడం, తన్నడం లాంటి చర్యలు శిక్షార్హమైనవి.

వీధికుక్క పొరపాటున మన గుమ్మంలో కొస్తే ఇంతలావు రాయో, అంత పొడవు కర్రో సూటిగా దానికేసి విసిరే మనకి ఈ చట్టం నవ్వు తెప్పిస్తోంది కదూ!

ఇకపోతే ఓవర్‌లోడింగ్ ఓవర్‌రైడింగ్ చెయ్యకూడని పనులు.

ఎద్దుల మెడలు విరిగిపోయేంత లోడుతో



వున్న ఇటుక బండ్లనో, ఇసుక బండ్లనో మనం నిత్యం చూస్తుంటాం. సో ఈ చట్టం మనకు విడ్డూరమే.

గాయాలతోగానీ శారీరక రుగ్మతలతోగానీ బాధపడే జంతువులతో పని చేయించకూడదు.

పనిచేయకపోతే వాటికి మనమే గాయాలు చేస్తాం. ముల్లుగర్రతో పొడుస్తాం. చెర్నాకోలతో వాయిస్తాం.

హానికరమైన డ్రగ్స్‌ని జంతువుల శరీరంలోకి ప్రవేశపెట్టకూడదు.

ఇది మరీ చోద్యం. హార్మోన్ ఇంజెక్షన్ వెయ్యకపోతే పాల ఉత్పత్తి పెరుగుతుందా! వేలుపోసి కొన్నాం గేదెని. రోజుకు పది లీటర్ల పాలైనా పిండుకోకపోతే ఎలా?

జంతువుల్నీ పక్షుల్నీ, ట్రాన్స్‌పోర్ట్ చేసేట





ప్పుడు వాటిని అనవసర బాధకు గురిచెయ్యటం చట్టరీత్యా నేరం.

బాగుంది వరస... శనివారం సాయంత్రాలు అట్లా మార్కెట్ దగ్గర నిలబడి అబ్జర్వ్ చెయ్యండి. సైకిళ్ల హేండిల్స్‌కు తల్లకిందులుగా వేళ్లాడుతూ ఎన్ని కోళ్లు దర్శనమిస్తాయో!

లారీల్లో గూడ్సు బళ్లలో ట్రాన్స్‌పోర్ట్ అయ్యే గేదెల పరిస్థితీ, ఆవులూ ఎద్దుల స్థితిగతులూ మనకు తెలియనివా?

పెంపుడు జంతువుల్ని కట్టి వుంచడానికి ఉపయోగించే తాడు కనీసపు పొడవు కలిగి వుండకుండా పొట్టిగా వున్నా నేరమేనట. కనీసపు వైశాల్యం లేని పంజరాల్లో పక్షుల్ని బంధించకూడదట.

ఎంత ప్రొటెక్షన్! దీన్నే కదూ పేపర్ ప్రొటెక్షన్ అంటారు.

అసలివి నేరాలా? మనం ప్రతిచోటా మామూలుగా చూసే విషయాలుకదూ!

ఒక పందిని కాళ్లూచేతులూ గుదికట్టి గోనెసంచిలో వేసి మూతి బిగించటం, కామన్‌సీన్.

రేబీస్ మిషతో వీధికుక్కలకు సయనైడ్ ఇంజెక్ట్ చెయ్యటం, ఎలక్ట్రిక్ షాక్ ఇచ్చి చంపడం, హెల్త్‌కేర్ మేటర్.

సాటి మనిషికి చిన్న కష్టం వచ్చినా తల్లడిల్లే మన హృదయం మనలాగే రక్తమాంసాలతో సృష్టించబడిన ఒక మూగ జీవి మన కళ్లముందే తన్నుకుని తన్నుకుని ప్రాణాలు విడుస్తున్నా, రక్తసిక్తమై ఆర్తనాదాలు చేస్తున్నా ఎందుకనీ చలించదు?

ఏం? కుక్కల జనరేషన్ని అరికట్టాలంటే మరో మార్గమేలేదా! ఎయిడ్స్ వచ్చిన మనుషుల్ని మనం సయనైడ్ ఇచ్చి చంపుతున్నామా? రేబీస్ లేని కుక్కల్ని కూడా చంపడానికి ఎవరిచ్చారు అధికారం మనకు?

ఏటా మునిసిపాలిటీలూ కార్పొరేషన్లూ లక్షల రూపాయలు వెచ్చించి కుక్కల్ని వధించేబదులు వాటికి యాంటిరేబీస్ ఇంజక్షన్స్ ఇవ్వచ్చు. బర్త్‌కంట్రోల్ ఆపరేషన్లు చెయ్యొచ్చు. కనీసం అట్లా చెయ్యగల స్వచ్ఛంద సంస్థలతో చేతులు కలపొచ్చు.

మనకు ఎన్నో భాషలు తెలుసు. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, ఉర్దూ, హిందీ, పార్సీ, ఇంగ్లిష్, జపనీస్ ఓహ్!

ఒకటేమిటి వందలాది భాషలు.

కానీ తెలియనిదొక్కటే మూగభాష.

పెదవులు ఉచ్చరించలేని, హృదయం మాత్రమే పలకగల ఈ భాషను నువ్వు నేర్చుకోగలిగిన నాడు...

జంతువుల మూగవేదన నీకిట్టే అర్థమవుతుంది. అర్థమైన మరుక్షణం నీ హృదయం గాయపడుతుంది. నీ చెంపలు కన్నీటితో తడుస్తాయి.

ప్రయోగశాలల్లో నీకోసం, నీ ఆరోగ్యం కోసం ప్రాణాల్ని పణంగా పెట్టే త్యాగమూర్తులూ, సౌందర్యసాధనాల టెస్టింగ్‌లో నీ ఒంటి నిగారింపుకోసం తమ ఒంటిని హూనం చేసుకునే నిర్భాగ్యజీవులూ నీ కళ్ల ముందు సాక్షాత్కరిస్తాయి.

అప్పుడు నీ చెయ్యి ఖచ్చితంగా మూగజీవి తలను ఆర్తిగా తడుముతుంది. ఆ స్పర్శ నీ మనసు మూలాలను ఆర్ద్రతతో తడుపుతుంది.

నీకు షుగరా! అయ్యోపాపం! డోంట్ వర్రీ. పందులున్నాయిగా వాటిని తెగనరికి ఇన్సులిన్ ఇంజెక్షన్లు తయారుచేస్తాంగా. (ఒకప్పుడు ఇన్సులిన్ తయారీ విధానం ఇది. ప్రస్తుతం దాని తయారీకి బాక్టీరియా కల్చర్ చేస్తున్నారు)

నీ బాడీలో రోగనిరోధకశక్తి కొరవడిందా? నో ప్రాబ్లమ్. ఏ గుర్రాన్నో వధించి దాని శరీరంలోని యాంటిబాడీస్‌తో నిండిన సీరమ్‌ని నీ శరీరంలోకి ప్రవేశపెడ్తాంగా.

నువ్వు చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం కావాలా... మేకపోతునో దున్నపోతునో అమ్మోరికి బలిస్తేసరి...

వర్షాలు కురవాలా? పైరుపచ్చలతో ఊరు కళకళలాడాలా? జాతర్లు చేసుకో... నెత్తుర్లు పూసుకో...

డోంట్ హెజిటేట్... అనాథ జీవులవి, వాటికెవరూలేరు. వాటికోసం ఎవరూ రారు. బ్లూక్రాస్ అమలలూ, పీపుల్ ఫర్ యానిమల్సూ గొంతు చించుకున్నా మెజారిటీ వర్గం నీది. నిన్నెవరూ ఏమీ చెయ్యలేరు.

ప్రకృతి సంపదల్ని దోచుకున్నా నువ్వు దొంగవి కావు, దొరవే. ఎందుకో తెలుసా! నిన్ను బోనులో పెట్టి ప్రాసిక్యూట్ చెయ్యటానికి దానికి నోరులేదుగా! ఒకవేళ యానిమల్ ఆర్గనైజేషన్స్ గగ్గోలు పెట్టినా నువ్వూ పర్యావరణ పరిరక్షణా వన్యమృగసంరక్షణా అంటూ గట్టిగా గొంతు కలుపు, గుట్టుగా నవ్వుకో.

క్రిష్ణజింక మాంసంతో రాజకీయ నాయ





కులు విందుచేసుకున్నారనో, పులుల్ని చంపి చర్మాలు ఒలిచి స్మగ్లర్లు ఎగుమతి చేస్తున్నారనో వచ్చే వార్తల్ని కాలక్షేపానికి విను, ఫ్యాషనబుల్‌గా నిట్టూర్చు దట్సాల్.

ఏనుగుల శరీరాన్ని ఛిద్రం చేసి వెలికి తీసిన ఎముకలతో చేసిన ఆభరణాలు నీకో అద్భుతంకదూ! నెమళ్ల రెక్కలు విరిచి మలిచిన వింజామరలు విడిచే ఊపిర్లు నిన్ను సేదతీర్చే చిరుగాలులు.. అవునా!

జంతు చర్మాలమీద కూర్చుని తపస్సు చేసి మోక్షం పొందుతావ్. వాటిని వెంటాడి వేటాడి చంపి ఇది మృగయా వినోదం అంటావ్.

'ఓహ్! ఇదంతా పూర్వకాలపు మాట. ఇప్పుడు మనది కొత్త బాట. అట్లా జరక్కుండా చూడ్డానికి చట్టం వుంది. యానిమల్ ఆర్గనైజేషన్స్ వున్నాయి. నౌఎడేస్ జంతువులకు బోలెడు ప్రొటెక్షన్ వుంది' అంటావేమో! అది ఆత్మ వంచనే అవుతుంది. దానికి సాక్ష్యం?

ఇంటర్నేషనల్ యానిమల్ ఫర్ ద కన్సర్వేషన్ ఆఫ్ నేచర్ ప్రొడ్యూస్ చేసిన రెండు 'రెడ్ డేటా బుక్స్'

ఒకటి అతి త్వరలో అస్థిత్వం కోల్పోబోతున్న మేమల్స్ (క్షీరదాలు) దయనీయ స్థితిని తేటతెల్లం చేస్తే... ఇంకోటి... అద్భుత విహంగాల అదృశ్య కావ్యాన్ని ఆవిష్కరిస్తుంది.

ఎక్స్‌టింక్షన్!

ఇదెంత దారుణమైన పదం!

1869 ప్రాంతాల్లో... ప్రపంచ పక్షిజాతుల్లోనే... అత్యధిక సంఖ్యలో వున్న ప్యాసెంజర్ పిజియన్... ఇప్పుడు మచ్చుకైనా లేదు. ఒక్కొక్క ఫ్లోక్‌లో దాదాపు రెండు బిలియన్ల పక్షులుండేవని అంచనా. ఆ పక్షి గుంపు ఒక్కసారిగా పైకి ఎగిరిందంటే... ఆకాశంలో చీకట్లు కమ్మేవి. కొమ్మలపై వాలితే... కొమ్మలు పెళపెళమని విరిగి నేలకొరిగేవి. అంత అసంఖ్యాకంగా వున్న ప్యాసెంజర్ పిజియన్స్... మానవుల జిహ్వకు ఆహుతి అయిపోయి పూర్తిగా అంతరించిపోయాయి. నౌ... ఇటీజ్ యాన్ ఎక్స్‌టింక్ట్ బర్డ్. చిట్టచివరి ప్యాసెంజర్ పిజియన్ సిన్‌సినాటీ జూలో...



1914వ సంవత్సరంలో మరణించినట్టు ఆర్ని థాలజిస్టులు ధృవీకరించారు.

మనందరికీ తెలిసిన మరో ఎక్స్‌టింక్ట్ యానిమల్ డైనోసార్. ఇది కేవలం... కంప్యూటర్ గ్రాఫిక్స్ సృష్టించిన జురాసిక్ పార్క్‌లో తప్ప కనిపించదు.

ఈవిధంగా కనుమరుగైన పక్షి... జంతు జాతులు ఒకటా రెండా... అసంఖ్యాకంగా వున్నాయి. ఈ నిజం మనలో చాలామందిని బాధపెట్టకపోవచ్చు. కొందరు సోకాల్డ్, జులాజికల్ పండిట్స్ ఈ 'ఎక్స్‌టింక్షన్' అనేది ప్రకృతి పరిణామక్రమంలో ఒక భాగమని కూడా తేల్చేయవచ్చు. కానీ హృదయంతో ఆలోచిస్తే ఓ ప్రశ్న మనల్ని నిలదియ్యక మానదు.

దీనికి బాధ్యులెవరు? మనిషి కదూ!

పులులూ... సింహాలా క్రూరజంతువులు?

"ఆఫ్ ఆల్ ద యానిమల్స్... ద మోస్ట్ రెపేషియస్... థాట్‌లెస్ అండ్ బ్లడ్ థర్‌స్టీ యానిమల్ ఈజ్ మేన్" అంటాడు ద గ్రేట్ యానిమల్ కన్సర్వేషనిస్ట్ గెరాల్డ్ డ్యురెల్.

"మనం నివసించే ప్రపంచాన్ని మనమే నాశనం చేసుకుంటున్నాం. షాట్‌గన్నూ... రైఫిల్సూ... పాయిజనూ, రంపాలూ... కొడవళ్ళూ పట్టుకుని నందనవనాల్లోకి దూరి... అక్కడ హాయిగా సంచరించే జంతువుల్నీ... మహోపకారులైన వృక్షాల్నీ సర్వనాశనం చేసి ఆనందించే పోకిరీ కుర్రాళ్ళ గుంపు మనం... యస్... వి ఆర్ ఎ సెట్ ఆఫ్ ఇడియట్ చిల్డ్రన్" అంటున్న ఆయన మాటల్ని కాదనే నైతిక అర్హత... మనలో ఏ ఒక్కరికైనా వుందా?

ఒక డేనిష్ సైంటిస్ట్ శ్టాటిస్టిక్స్ ప్రకారం... ఒక చిన్న ఏరియాలో... ఒక్క సంవత్సరంలో కేవలం రోడ్ యాక్సిడెంట్స్‌లో చనిపోయే కుందేళ్ల సంఖ్య... 3,014, అడవి పందుల సంఖ్య 5,377, ఎలుకల సంఖ్య 11,557 అని తెలుసుకుంటే... నీకు అయ్యో అన్పించటం లేదూ!

కుక్కలు, పిల్లులు జింకలులాంటి మేమల్స్ సంఖ్య 27,834, పక్షులైతే దాదాపు 111,728, యాంఫిబియన్స్ రోడ్ డెత్ రేట్ 37,820 అని లెక్కలు తేల్తుంటే, నీ కళ్లు చమర్చడం లేదూ!

ఇదే రేట్‌లో రోడ్ యాక్సిడెంట్స్‌లో మనుషులు మరణిస్తే మనం వూరుకుంటామా!

గగ్గోలుపెట్టి... తీవ్ర ఆందోళన చేపట్టి, అధికార పీఠాన్ని వణికించమూ! మోటార్ కార్ యుగాన్నించి ఒక్కసారిగా వెనక్కి వెళ్ళిపోయి అలనాటి ఎద్దులబళ్లూ, గుర్రబ్బగ్గీలు

ప్రయాణ సాధనాలుగా ఖరారుచేస్తూ పార్ల మెంట్‌లో బిల్ పాసయ్యేలా చెయ్యమూ!

మన ప్రాణాలేనా అంత విలువైనవి? అవునని పెదవులు పలికినా ఒక్కసారి అంతర్ముఖులమైతే కాదని మన హృదయం చెప్పి తీరుతుంది.

ఆకు గిల్లినప్పుడో... కొమ్మ విరిచినప్పుడో అల్లాడిపోతూ విలవిలలాడే మొక్కల యాతన సెస్మోగ్రాఫ్‌లో చూసి చలించిపో యేంత గొప్ప మనసు మనది కానక్కర లేదు.

అందమైన ఏ ఫెదర్ కేప్‌ను చూసో... నాణ్యమైన మరే లెదర్ బెల్ట్‌ను చూసో, ముచ్చటపడుతున్న వేళ, వాటి తయారీ వెనుకవున్న దారుణ మారణ కాండ స్ఫుర ణకు వచ్చి కదిలిపోయేంత సున్నిత హృదయం లేకపోయినా ఫరవాలేదు.

ఆకలి కళ్లతో... ఆశగా చూస్తూ మన గుమ్మంలో నిలబడ్డ వీధికుక్కమీదకు కనిక రాయి విసిరి గాయపరిచే కఠినత్వం మాత్రం మనకొద్దు.

జీవితకాలమంతా మనల్ని సేవించి... ముసలితనంలో కదలలేక కన్నీరుకారుస్తున్న కాడెద్దుల్ని కాసుకోసం కబేళాకు అమ్మే క్రూరత్వం అసలేవద్దు.

ఒక్కసారి కళ్లు తెరిచి మనచుట్టూ వున్న ప్రపంచాన్ని చూడగలగాలి. ప్రపంచమంటే కేవలం మనుషులే కాదు, మూగ జీవులు కూడా అన్న అవేర్‌నెస్ మనలో కలగాలి.

జంతువుల సంరక్షణ బాధ్యత ఏ బ్లూక్రా స్‌లాంటి స్వచ్ఛంద సంస్థలదో అనుకుని సరి పెట్టుకోవడం, మన బాధ్యతారాహిత్యం అని అర్థంచేసుకోవాలి.

బ్లూక్రాస్‌లూ... పేటాలూ చేస్తున్న పని చెయ్యనివ్వండి. బట్... ఆ పనికి చేయూత నిచ్చే బాధ్యత మాత్రం మనది.

ప్రతి మనిషి హృదయం ఓ బ్లూక్రాస్ కావాలి. ప్రతి పెదవీ 'వి ఆర్ పీపుల్ ఫర్ యానిమల్స్' అని పలికి తీరాలి.

కనీసం మనం ఒక్క వీధికుక్కపిల్లను పెంచుకున్నా మనవంతు బాధ్యత నెరవేరి నట్టే.

మీకు తెలుసా?

మన వీధికుక్కలకు ఆల్సేషియన్‌కున్న తెలివీ, అమెరికన్ బుల్ టెరియర్‌కి వున్న వదలని గుణమూ, లాబ్రడార్‌కు వున్న రాజ భక్తీ, గ్రేహౌండ్‌కు గల వేగమూ వున్నాయి.

యాభైమంది కలిసి ఒక కుక్కపిల్లను పెంచుకున్నా, మనదేశంలో వీధులలో ఒక్క కుక్కకూడా వుండదని పరిశీలకులు అంటు న్నారు.

సో...

హోమ్‌లెస్ యానిమల్స్‌కి షెల్టర్ ఇచ్చావా... నువ్వు 'మనిషి'వి.

ఈ భూగోళం నాదే కాదు, నీది కూడా అని వాటికి బాసచేసి భరోసా ఇవ్వగలిగిన నాడు నువ్వు 'మనీషి'వి.

– సరోజాసింధూరి

# ఏరినముత్యాలు

✣ నిన్నటి గురించి మథన పడకుండా, రేపటి గురించి భయపడకుండా ఆలోచించగలిగిన మనిషికి విజయ సోపానాలు అందుతాయి.

– హోవర్డ్ ఫైల్

✣ కొందరు వ్యక్తులు ఇంటి కప్పుమీది గడియారంలాంటివారు. వాళ్ళు ఎదురింటి వాళ్ళకి, పక్కింటివాళ్ళకి ఉపయోగపడతారు. కానీ ఇంట్లోవాళ్ళకు పనికిరారు.

– ఆస్టెన్ ఓ మాలీ

✣ సాహసం అనేది మనిషి జీవితంలో అన్నింటికన్నా అతిముఖ్యమైన, అవసరమైన లక్షణం.

– విన్‌స్టన్ చర్చిల్

✣ ప్రపంచంలో కొద్దిమంది ఆగర్భ శ్రీమంతులవడానికి కారణం తక్కిన ఎంతో మందిలాగా వారు కొన్ని సూక్ష్మ విషయాలను నిర్లక్ష్యం చేయకపోవడమే.

– హెన్రీఫోర్డ్

✣ మనకు అవసరమైన క్రమశిక్షణని మనంతటమనం నేర్చుకుంటేనే మంచిది. లేకపోతే ప్రపంచమే మనకి నేర్పితీరుతుంది. కానీ ఆ క్రమశిక్షణవల్ల మనకు లభించేది తక్కువ.

– విలియం ఫెదర్

✣ మొండివారు తమ అభిప్రాయాలను కట్టుదిట్టం చేసుకోలేరు. నిజానికి ఆ అభిప్రాయాలే ఎల్లప్పుడూ వారిని తమ కట్టడిలో ఉంచుకుంటాయి.

– గ్రీకు సామెత

✣ సంభాషణ ఓ చక్కని కళ. అది తక్కిన కళల్లాగానే అనుభవంతోనూ, అభ్యాసంతోనూ రాణింపు పొందుతుంది.

– శాలీ చ్యూ

✣ ఓ అందమైన చిరునవ్వు ముఖానికి చక్కటి అలంకారమై వన్నె తేవడమే కాదు, హృదయానికి సైతం ఆహ్లాదాన్ని అందిస్తుంది.

– ఫ్రెంచి సామెత

✣ అవతలివారిని అనుమానించడం తప్పనిసరైతే తప్పు కాదేమోగాని, సామర్థ్యం విషయంలో మనలని మనం అనుమానించుకోవడం ఆత్మహత్యకన్నా ఘోరం.

– సి. బోవీ

✣ మనపట్ల మనకి ప్రగాఢమైన నమ్మకం ఉండాలేగాని, ప్రపంచంలో ఎవరు ఏమనుకుంటున్నా, మనకి ఇబ్బంది ఉండనక్కర్లేదు.

– ఆర్.డబ్ల్యూ. ఎమర్సన్

సేకరణ: టి. మహి

# చతుర

318 సంచిక

సంపుటి: 27 ✤ సంచిక: 6 ✤ జూలై 2004

ఒక బిజినెస్ టైకూన్ కూతురుగా ఆమెకు జీవితంలో ఏలోటూ లేదు.

తండ్రి ఆమెకు నౌకర్లని, కారుని, ప్రత్యేక డ్రైవర్ని, సెల్‌ఫోన్‌ని అమర్చినట్టే కాబోయే భర్తని కూడా తనకు నచ్చిన రీతిలో అమర్చబోయాడు. కానీ ఆ అమ్మాయి నుంచి వచ్చిన వ్యతిరేక ప్రభంజనం అతడికి షాక్‌నిచ్చింది. దానినుంచి తట్టుకుని నిలదొక్కుకునే లోపే ఎదురయిన మరో షాక్ అతని జీవితానికే సవాల్‌గా నిలిచింది.

స్టేటస్‌కి, కీర్తికి... అధిక ప్రాధాన్యతనిచ్చే పులిలాంటి ఆ వ్యాపారవేత్త చివరగా జీవితంలో ఎదుర్కొన్న అనుభవం ఎలాంటిది? భార్యని, బిడ్డని తన కనుసన్నలలో నిలబెట్టగలిగిన అతడికి చివరికి మిగిలిందేమిటి?

విభిన్న మనస్తత్వాల విపుల విశ్లేషణ **కె.ప్రవీణారెడ్డి** రచన **'ఇది జీవితం'** ఈ నెల సమగ్ర నవల.



ది వైజాగ్ రైల్వేస్టేషన్. అప్పుడు సమయం సాయంత్రం నాలుగూ ముప్పై నిమిషాలవుతుంది. ఇంతలో అక్కడికి ఒక సిల్వర్ కలర్ లాన్సర్ కారు ఫాస్ట్‌గా వచ్చి ఆగింది. కారు ఆపి డ్రైవరు వెనక సీట్లో ఉన్నవాళ్లు దిగేందుకు డోర్ తీసి పట్టుకొని వినయంగా నిలుచున్నాడు. అప్పుడు అందులోంచి దిగింది అపూర్వ.

కారు ముందు సీట్లో డ్రైవరు పక్కన కూర్చున్నతను కూడా త్వరగా దిగి కారు డిక్కీలోంచి సామాను తీయిస్తున్నాడు. అపూర్వ తన ఎడం చేతికి ఉన్న వాచ్‌లో టైమ్ చూసుకొని ట్రైను డిపార్చరు టైము 5 గం.15ని. గమనించి 'హమ్మయ్య ఇంకా 40 నిమిషాల టైముంది. టెన్షన్ లేదు' అనుకుంది. ఇంతలో అపూర్వ సెల్ రింగయ్యింది. ఆమె వెంటనే రిసీవింగ్ బటన్ నొక్కి కాల్‌రిసీవ్ చేసుకొని సన్నని నాజూకైన గొంతుతో 'హలో' అంది.

అవతలివైపు గొంతు వినగానే ఆమె ముఖంలో ఆనందం వ్యక్తమయింది. "హలో ఆదీ నేను ఇప్పుడు వైజాగ్ రైల్వే స్టేషన్‌లో ఉన్నాను. ఈరోజు ఇక్కడి నుండి హైదరాబాద్‌కి వచ్చే ఫ్లయిట్ కాన్సిలయింది. మళ్లీ రేపు మధ్యాహ్నం 3.30 వరకు ఫ్లయిట్ లేదు. ఇక్కడ నా వర్క్ నిన్న సాయంత్రానికే పూర్తయింది. మళ్లీ నాకు రేపు సాయంత్రం వరకు ఫ్లయిట్ కొరకు వెయిట్‌చేస్తూ ఇక్కడ ఉండాలన్పించడంలేదు. ఇప్పుడు ట్రైన్ ఎక్కితే రేపు మార్నింగ్ 6.30కు అక్కడ అంటాను. రేపు మార్నింగ్ సికింద్రాబాద్ స్టేషన్‌కి కారు పంపించు. ఉంటాను ఆదీ బై" అని ఫోన్ పెట్టేసింది.

అపూర్వ ఫోన్ మాట్లాడి ఇటు తిరిగేసరికి కారు ముందు సీట్లోంచి దిగినతను కూలీతో సామాను పట్టించి లోపలికి వెళ్లడానికి సిద్ధంగా నిలబడి ఉన్నాడు. వీళ్లు లోపలికి వెళ్లేసరికి ప్లాట్‌ఫామ్ పైకి ట్రైన్ వచ్చి ఆగి ఉంది. వీళ్లు ఫస్ట్‌క్లాస్ ఏసీ కంపార్ట్‌మెంట్ వరకు వెళ్లి అక్కడ కంపార్ట్‌మెంట్‌పై అంటించిన లిస్ట్‌లో పేరు చూసుకొని లోపలికి ఎక్కారు. అపూర్వ వెంట వచ్చినతను కూలీతో సామాను సర్దించి "మేడమ్ 14వ నంబరు ఇదే మీ సీటు" అని చూపించి "మీకింకేమైనా కావాలంటే చెప్పండి మినరల్ వాటర్ గానీ ఏవైనా బుక్స్‌గానీ తెమ్మంటే తెస్తాను మేడమ్" అన్నాడు వినయంగా.

"ఇక నాకేమీ వద్దు సాగర్! ఫ్లయిట్ కాన్సిలయ్యిందని కంగారు పడుతున్న నాకు ఆఖరికి ఇలా ట్రైన్‌లోనన్నా హైదరాబాద్ చేరే ఏర్పాటు చేసిన నీకూ, మీ బాస్‌కీ మెనీమెనీ థాంక్స్. ఇంక నువ్వెళ్లు సాగర్ నాకేం పర్వాలేదు" అంది.

"అయితే సరే మేడం ఇక ఉంటాను" అని అతడు వెళ్లబోయాడు.

"ఒక్క నిమిషం సాగర్" అని అపూర్వ తన బాగ్ ఓపెన్ చేసి రెండు చాక్లెట్ డబ్బాలు తీసి "ఆంటీ ఇచ్చిందని నీ పిల్లలకివ్వు సాగర్" అంటూ అతనికిచ్చింది.

"థాంక్స్ మేడమ్" అంటూ అతడు అవి తీసుకొని వెళ్లిపోయాడు. అపూర్వ ఒకసారి కంపార్ట్‌మెంటంతా కలియజూసింది. ఇంకా వచ్చేవాళ్లు వస్తున్నారు. వాచ్‌లో మళ్లీ టైం చూసింది. ట్రైన్ కదలడానికి ఇంకా 20 నిమిషాలుంది.

అపూర్వ మెల్లిగా లేచి కిందికి దిగింది. కంపార్ట్‌మెంట్ ముందు అన్నిరకాల మ్యాగజైన్స్ ఉన్న తోపుడు బండి వచ్చి ఆగింది. అపూర్వ తనకు కావల్సినవి సెలెక్ట్ చేసుకుంటోంది. ఇంతలో తన పక్కనుండి "ఇండియా టుడే ఉంటే ఇవ్వు బాబూ" అన్న గొంతు విని అనాలోచితంగానే అతని వైపు చూసింది. ఆమె అతన్ని చూస్తూనే ఒక్క క్షణం ఉలిక్కిపడ్డట్టుగా అయ్యింది. నో డౌట్ అతను ఖచ్చితంగా మయూర్. ఇన్నేళ్ల తరవాత అతన్ని చూసినా తను

16 జూలై 2004

గుర్తుపట్టగల్గింది. అతనికిదేమీ పట్టినట్లు లేదు. మ్యాగజైన్లు అమ్మే కుర్రాడికి డబ్బులి వ్వడంలో మునిగిపోయాడు.

అపూర్వ తననుతాను సంభాళించుకొని అతని దృష్టి ఇటు మరల్చేందుకు ఎక్స్క్యూజ్ మీ అని అంది. అతను తననేనా అన్నట్లు ఆమెవైపు తిరిగాడు. అతడు అపూర్వవైపు అనాసక్తిగా చూస్తూ "ఎస్ మేడమ్ పిలిచారా" అని అడుగుతున్న అతని కళ్లలో ఎటువంటి భావమూ కనిపించలేదు. అపూర్వకర్థమయింది. అతడు తనవైపు సరిగ్గా చూడటమైనా లేదనీ తనను గుర్తుపట్టనూ లేదని.

"నువ్వు సారీ మీరు మయూర్ కదూ" అంది అపూర్వ.

"యస్ కానీ మీకెలా తెలు...సు" అని అతడంటూనే ఆమెను నిశితంగా చూసి ఏదో గుర్తుకు వచ్చినట్లుగా ఆశ్చర్యంతో "అప్పూ ఆర్‌యూ అపూర్వా" అన్నాడు సంభ్రమంగా.

కొన్ని క్షణాలు ఇద్దరూ మౌనంగా ఒకర్నొకరు చూసుకుంటూ నిలబడ్డారు. ముందుగా అతడే తేరుకొని "అప్పూ సారీ అపూర్వా మీరు వైజాగ్‌కి ఎందుకు వచ్చా.." ఆ ప్రశ్న పూర్తికాకమునుపే

"మా కంపెనీ బోర్డ్ మీటింగ్ ఇక్కడ వైజాగ్ తాజ్‌లో ఉంది. దాని కొరకే వచ్చాను. మరి మీరెందుకు వైజాగ్ వచ్చారు? " అనడిగింది అపూర్వ.

"నా ఫ్రెండ్ మనోజ్‌సింగ్ ఇక్కడ నేవీలో పని చేస్తున్నాడు అతనింట్లో ఫంక్షన్ జరిగితే వచ్చాను" అన్నాడు.

"ఓ ఐసీ" అంది కాస్త కనుబొమలు పైకి లేపుతూ.

"ఫ్యామిలీతో వచ్చారా? " అనడిగింది. ఇంతలో ట్రైన్ కదిలేందుకు సిద్ధంగా ఉందని అనౌన్స్‌మెంట్ రావడంతో కంగారుగా అతనికి బై చెప్పి తన కంపార్టుమెంట్‌లోకి ఎక్కింది. ఆమె ఎక్కేవరకూ ఆమెనే చూస్తూ నిలబడ్డ మయూర్ ఆమె కనుమరుగవగానే తన కంపార్ట్‌మెంట్ వైపు పరిగెత్తినట్లుగా వెళ్లిపోయాడు. అపూర్వ తన సీట్లో కూర్చున్న తరువాత ఐదు నిమిషాలకు ట్రైన్ కదిలింది.

మయూర్‌ని చూసిన ఎగ్జైట్‌మెంట్‌తో కాసేపు అపూర్వ మెదడు పని చెయ్యకుండా అయింది. అలా ఏదైనా టెన్షన్ ఉన్నప్పుడు అపూర్వ తన మనసులో కౌంట్‌డౌన్ అంటే 100 నుండి 1 వరకు లెక్కపెట్టడం స్టార్ట్ చేస్తుంది. ఇప్పుడూ అలాగే చేయసాగింది. ఆమె ఒకటి సంఖ్య వరకు వచ్చేసరికి కంపార్ట్‌మెంట్‌లోకి మినరల్ వాటర్ అమ్మే అబ్బాయి వచ్చాడు. అపూర్వ అతన్ని పిలిచి ఒక చల్లని బాటిల్‌కొని కొంచెం మంచినీళ్లు తాగుతూ తననుతాను పూర్తిగా కంట్రోల్ చేసుకోసాగింది. మళ్లీ ఆమె మెదడు పూర్వపు వేగంతో పనిచేస్తున్నట్లుగా ఫీలయ్యింది.

తను మయూర్‌ని ఎన్నేళ్ల తరువాత దాదాపు పదేళ్ల తరువాత చూసిందేమో. అప్పటి మయూర్‌కీ ఇప్పటి మయూర్‌కీ ఎంత తేడా. పదేళ్ల కిందటి మయూర్ రూపం అపూర్వ కళ్లముందు కదలాడింది. అతడు మరీ ఆరడుగుల వాడు కాదు సుమారు ఐదడుగుల పదంగుళాలుండే వాడేమో. కానీ మెరిసే అతని గులాబీరంగు చర్మం, నల్లటి ఒత్తయిన అందమైన తల కట్టు, స్టిఫ్‌గా ఉండే శరీరం, అందమైన తెల్లని పలువరస, అన్నిటికంటే ముఖ్యంగా ఆ మెరిసే నీలిరంగు కళ్లు. వీటన్నిటితో పాటు మంచి మాటకారి తనంతో ఆడపిల్లల మనసు ఇట్టే దోచుకోగలిగేటట్లుగా ఉండే వాడు.

కానీ కొద్ది నిమిషాల క్రితం తను చూసిన మయూర్ రూపంలో పెద్ద తేడా లేదుకానీ అప్పటి చురుకుదనం బదులుగా ఆ స్థానంలో గాంభీర్యం చోటుచేసుకుంది. కానీ ముఖ్యంగా ఆ నీలి కళ్లల్లో అప్పటి కాంతి

## సచిత్ర విచిత్రం



# ఫ్రీజింగ్ థెరపీ

రష్యాకి చెందిన కార్డియాలజిస్టు అనటో లీషన్‌కిన్, ప్రొఫెసర్ యూరీవాల్‌సోవ్ కలిసి 10 నెలల క్రిస్టీనాకి గుండెలో గల రంధ్రానికి కొత్తరకంగా ఆపరేషన్ చేశారు. మత్తుమందు ఇచ్చాక క్రిస్టీనా శరీరాన్ని మంచుతో పూర్తిగా గడ్డ కట్టించారు. దాంతో రక్తప్రసరణ ఆగిపోయింది. 40 నిమిషాల్లో గుండెకి ఆపరేషన్ చేసి ఆ రంధ్రాన్ని మూసేసి తిరిగి ఆ పాప శరీరం వేడెక్కేలా చేశారు. దాంతో రక్తప్రసరణ పునఃప్రారంభమయింది. డాక్టర్ స్వెయిన్ ఈ డీప్‌ఫ్రీజ్‌డ్ ఆపరేషన్ పద్ధతిని కనిపెట్టాడు. ఇంత దాకా ఇలాంటి ఆపరేషన్లను సైబీరియాలో ఈ టీమ్ నిర్వహించింది. వెన్నెముక, తలకి చేయాల్సిన ఆపరేషన్లలో, విషం శరీరంలో కెక్కినప్పుడు చేసే చికిత్స సమయంలో ఈ ఫ్రీజ్‌డ్ మెథడ్ ద్వారా ఫలితం బావుంటోందిట.

ఎక్కడ మాయమయిందో మచ్చుకు కూడా లేదు. ఏమిటీ మనిషిలో ఇంత మార్పు. అపూర్వ ఇలా ఆలోచనలో ఉంది. ట్రైన్ వేగం పుంజుకొని ముందుకు దూసుకు పోసాగింది. అపూర్వ మనసు మాత్రం పదేళ్ల వెనక్కు వెళ్లిపోయింది.

అప్పుడు అపూర్వ బి.కాం. ఫస్టియర్లో ఉంది. అపూర్వ ఇంటర్లో ఉండగానే ఫ్యాషన్ టెక్నాలజీ కోర్సుకి ఎంట్రెన్స్ రాసింది. కానీ తనకి సీటు రాలేదు. అపూర్వకెలాగైనా ఆ కోర్సులో జాయినవ్వాలని కోరిక. అందుకే మళ్లీ ఎంట్రెన్సు రాయాలనుకుంది. అంతవరకు ఊరికే ఉండటం ఎందుకని భవన్స్ కాలేజీలో బి.కాంలో జాయిన్ అయ్యింది.

వాళ్ల కాలేజీ దగ్గర్లో ఆర్చీస్‌గ్రీటింగ్ కార్డ్స్, గిఫ్ట్ ఐటమ్స్ అన్నీ లభించేటట్లుగా ఒక షాపుండేది. ఆ షాపు చుట్టుపక్కల ఇంకా చాలా కాలేజీలు ఉన్నాయి. ఆ షాపు ఎప్పుడూ స్టూడెంట్స్‌తో కిటకిటలాడేది. ఫ్రెండ్స్ బర్త్‌డేలకనీ, కజిన్స్ బర్త్‌డేలకనీ, వాలెంటైన్స్‌డే, న్యూఇయర్‌లకనీ గ్రీటింగ్స్, గిఫ్ట్స్ కొనే స్టూడెంట్స్ అందరూ కాలేజీ అవర్స్ అయింతర్వాతనో లేక క్లాసెస్ లేని ఫ్రీటైంలోనో వచ్చి ఆ షాప్‌లో ఆగి వెళ్లేవాళ్లు.

ఇకపోతే ఆ షాపు ఓనర్ కొడుకు ఆ షాపుకే హైలైట్. అతడే మయూర్. ఆ అబ్బాయి నిజాం కాలేజీలో ఫైనల్ ఇయర్ బి.కాం చదువుతున్నాడు. మధ్యాహ్నం కాలేజీ అవగానే అతడు షాపులోకొచ్చి కూర్చుంటాడు. అతడు చాలా చలాకీగా ఉంటాడు. ఆ షాపు రెండతస్థులుగా ఉంటుంది. కింద అన్నీ గ్రీటింగ్ కార్డ్స్ డిస్‌ప్లే చేసి ఉంటాయి. పై అంతస్థులో గిఫ్ట్ అయిటమ్స్ ఉంటాయి. అందులోనే పక్కకు లంచ్ చేయడానికీ ఒక మనిషి కాసేపు విశ్రాంతిగా పడుకోవడానికి సరిపడా ఫర్నిష్ చేసిన చిన్న రూమ్ ఉంది. ఆ అబ్బాయి కాలేజీ నుండి రాగానే తండ్రి పైకి వెళ్లి విశ్రాంతి తీసుకుంటాడు. మయూర్ ఇంగ్లిషు, హిందీ, తెలుగు మూడు భాషలూ అనర్గళంగా మాట్లాడుతాడు. షాపుకొచ్చిన వాళ్లను తన మాటకారి తనంతో ఆకట్టుకుంటాడు. గర్ల్‌ఫ్రెండ్‌కి ఎలాంటి కార్డ్స్ ఇస్తే బాగుంటుందో, ఏ అకేషన్‌కి ఎలాంటి గిఫ్ట్ ఇస్తే బాగుంటుందో ఇలా అందరికీ సూచనలిస్తుంటాడు. నిజానికి అతని సెలెక్షన్ చాలా బాగుంటుంది. కష్టమర్స్‌లో చాలామంది అతని సలహా మేరకే షాపింగ్ చేస్తారు. మయూర్ ఆ షాపును చూసుకుంటున్నప్పటినుండి ఆ షాపులో సేల్స్ విపరీతంగా పెరిగాయి. అందరూ మయూర్‌ని మెచ్చుకునే వాళ్లు. ఆ ఓవర్ కాన్ఫిడెన్స్ వల్లనో ఏమో మయూర్ నీలికళ్లు అంతలా మెరుపునూ, తీక్షణత్వాన్ని సంతరించుకున్నాయనిపిస్తుంది.

సరిగ్గా ఆ పీక్ టైంలోనే అపూర్వ ఫ్రెండ్‌షిప్ డే కొరకు ఫ్రెండ్‌షిప్ బ్యాండ్లు కొనాలని ఆ షాపులోకి వెళ్లింది. అపూర్వ షాప్‌కి వెళ్లేసరికి ఆ టైంలో అక్కడ ఎక్కువమంది కష్టమర్స్‌లేరు. కాష్ కౌంటర్ ముందు కూర్చున్న మయూర్ లేచి పెద్ద కేన్ బుట్టలో వేసి ఉన్న బాండ్స్ సెలెక్ట్ చేసుకుం

టున్న అపూర్వ దగ్గరగా వచ్చి "మే ఐ హెల్ప్‌యూ మేడమ్" అన్నాడు.

సడన్‌గా అంత దగ్గరగా వచ్చి అలా అడుగుతున్న మయూర్‌ని చూసి కాస్త తడబడుతూనే సరే అని తల ఊపింది అపూర్వ.

అపూర్వ అంతకంటే ముందే ఎన్నోసార్లు తన ఫ్రెండ్స్ ఆ అబ్బాయి చలాకీతనం గురించి అతని అందం గురించీ మాట్లాడుకుంటుంటే వినే ఉంది. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తోంది.

అతడు కేన్ బుట్టలోకి చెయ్యిపెట్టి అడుగు నుండి పైకి కలగలిపినట్లుగా అని ఇరవైకి పైగా బ్యాండ్లు తీసి కేన్ బుట్ట కమర్చిన రాడ్ పైన వరసగా వేసి చూపించి అందులోంచి ఏడెనిమిది బాండ్లు సెలక్ట్ చేసి చూపించాడు. అపూర్వకి నిజంగా అవి చాలా బాగున్నాయన్పించింది. అవి తీసుకొని ఆమె బిల్ కౌంటర్ దగ్గరకు వచ్చింది. తను చూపించిన వన్నీ ఒక్క మాట కూడా మాట్లాడకుండా తీసుకొని మౌనంగా కౌంటర్ దగ్గరకు వెళ్తున్న ఆమెని విచిత్రంగా చూస్తూ తను వెళ్లి బిల్ వేసి ఇచ్చాడు.

ఆమె అమౌంట్ పే చేస్తుండగా ఇక ఉండబట్టలేక "మేడమ్ మిమ్మల్ని ఒక చిన్న డౌట్ అడగవచ్చా" అన్నాడు.

ఏమిటన్నట్లుగా చూసింది అతని వైపు.

మయూర్ అనుకున్నాడు డౌట్ ఏమిటి ఖచ్చితంగా ఈ పిల్లకు మాటలు రావు అనుకున్నాడు. అదే డౌటు ధైర్యం చేసి పైకి అడిగాడు. మీరు మాట్లాడ గలరా అని.

అతడు అలా అడగగానే అపూర్వ కోపం వచ్చినట్లుగా సీరియస్‌గా ఒక లుక్ ఇచ్చి మళ్లీ ఏమనుకుందో సన్నగా పెదవులు విడీ విడవకుండా చిరునవ్వు నవ్వి వెళ్లిపోయింది. మయూర్ ఆమె వెళ్లిన వంకే నోరు తెరుచుకొని చూస్తుండి పోయాడు. ఏమిటీ అమ్మాయి విచిత్ర ప్రవర్తన. ఈమెకు నిజంగా మాటలు రావా? అనుకున్నాడతను.



షాపు బయటికి వచ్చిన అపూర్వ తనని తను తిట్టుకుంది. తనెందుకంత మూగగా ప్రవర్తించింది. అతని ముందు తన గొంతెందుకు పెగలలేదు. అసలే తను ఎవ్వరితోనూ ఎక్కువ మాట్లాడలేదు. అంతకు ముందే అతని గురించి విని ఉన్నా కూడా అకస్మాత్తుగా సినిమా స్టార్‌లా ఉన్న అతన్ని అంత దగ్గరగా చూడడంతో మాధుర్యమూ, గంభీరతా కలిసి ఉన్న అతని స్వరాన్ని వినడంతో తన గుండె లయ తప్పినట్లుగా అయింది. అతని స్వరం తన నెంత డామినేట్ చేసిందంటే తన నోట మాట పెగ ల్లేదు. ఇంటికి వచ్చేసింతర్వాత కూడా,

"మే ఐ హెల్ప్‌యూ మేడమ్" అన్న అతని కంఠం, చురుకైన అతని నీలికళ్లూ తనని వెంటాడుతున్నట్లే అన్పించాయి. ఒక వ్యక్తిని మొదటిసారి చూడగానే అపూర్వ హృదయం అంతలా స్పందించడానికి కారణం ఉంది.

అపూర్వ హైదరాబాద్ సిటీలో ఉన్న పేరు మోసిన మల్టీమిలియనీర్స్‌లో ఒకరైన రాంభూపాల్ చౌదరిగారి ఏకైక కుమార్తె. వారి ఆస్తిపాస్తులన్నిటికీ ఏకైక వారసురాలు, తల్లితండ్రుల గారాలపట్టి. చూసే వాళ్లందరికీ ఇంతే తెలుసు. కానీ అపూర్వ తన పద్ధెనిమిదేళ్ల జీవితంలోనే ఎన్నో ఒడిదుడుకుల ననుభవించింది.

అపూర్వ తండ్రి రాంభూపాల్ చౌదరి గారి మేనమామ పశ్చిమ గోదావరిజిల్లాలో పెద్ద పేరున్న భూస్వామి. అతని ఏకైక కుమార్తె వైజయంతి తల్లితండ్రులతోపాటు పల్లెటూళ్లోనే ఉండి పెరిగి పెద్దదయింది. ఆ అమ్మాయి పెద్దగా చదువుకోలేదు. కానీ బోలెడంత ఆస్తికి వారసురాలు. రాంభూపాల్ చౌదరి అప్పటికే సిటీలో పేరుమోసిన బిజినెస్ మాన్‌గా ఎదిగి ఉన్నాడు. తన మేనమామ కూతురు వైజయంతిని, తన యావదాస్తినీ పరులపాలు కాకుండా రక్తసంబంధం ఉన్న తనను కట్టుకొమ్మని కోరినప్పుడు మొదట ఒప్పుకోలేదు. కానీ

తన తల్లీ, మేనమామ మరీ బలవంత పెట్టే సరికి వీల్లేక ఒప్పుకున్నాడు. బాగా చదువు కొని ఫాషనబుల్‌గా ఉన్న అమ్మాయిని చేసుకోవాలన్న కోర్కెను బలవంతంగా చంపుకున్నాడు. అలా అతను వైజయంతిని భార్యగా చేసుకోవాల్సి వచ్చింది. ఒక ఏడాది రెండేళ్లు వరకు వాళ్ల కాపురం ఓ మాదిరిగా సాగింది. పెళ్లయిన ఏడాదికే వైజయంతికి అపూర్వ పుట్టింది.

వైజయంతికి చిన్నారి అపూర్వ సంరక్షణ తోపాటు సుస్తీగా ఉండే అత్తగారిని చూసు కోవడం, అంత పెద్ద ఇంటిని చూసుకుంటూ నౌకర్లను అజమాయిషీ చేస్తూ పనులు చేయించడం ఇవన్నిటితో ఒత్తిడి పెరిగింది. ఆ కారణాలవల్ల తన బాగోగులు చూసుకో వడం పట్ల శ్రద్ధ లేకుండాపోయింది. అందంగా కన్పించేట్లుగా తయారవ్వాలనీ శరీరాన్ని స్లిమ్‌గా ఉంచుకోవాలనీ, బ్యూటీ పార్లర్స్‌కి వెళ్లి ఉన్న అందానికి మెరుగులు దిద్దుకోవాలనీ ఆమె ఎన్నడూ అనుకోలేదు. అందువల్ల ఆమె ఒక్క కాన్పుకే కాస్త లావైన శరీరంతో గట్టిగా బిగించి అల్లినజడతో చూడడానికి పెద్ద ఆకర్షణీయంగా కన్పిం చదు. ఆమె కనుముక్కు తీరు బాగానే ఉంటుంది. మంచి తెల్లటి రంగు కూడా ఉంటుంది. కానీ ఆమె డ్రస్ చేసుకునే విధానం వల్ల ఏదీ పెద్ద కొట్టొచ్చినట్లుగా కనబడదు.

ఇకపోతే రాంభూపాల్ చౌదరిగారు మాత్రం చాలా బాగా డ్రెస్ అవుతారు. అతను వేసుకునే బట్టలన్నీ యూరప్ నుండి తెప్పించుకుంటాడు. మనిషి ఛామనఛా యలో ఉన్నా పొడుగ్గా ట్రిమ్‌గా మంచి ఫిట్‌నెస్‌తో ఉంటాడు. అతనికి బిజినెస్‌ప రంగా ఇంట్లోనూ, బయటా ఎన్నో పార్టీలు జరుగుతాయి. వాటన్నిటికీ తన ఫ్రెండ్స్ భార్యలతో వస్తారు. వాళ్లంతా మంచి ఫ్లూయన్సీ ఉన్న ఇంగ్లిషు మాట్లాడుతూ ఆడ, మగ భేదం లేకుండా అందరితో కలుపుగో లుగా మాట్లాడుతారు. ఎంతో ఆకర్షణీ యంగా స్టైలిష్‌గా డ్రెస్ అయి చలాకీగా తిరుగుతుంటారు.

వైజయంతి సాధారణంగా అలాంటి పార్టీ లకు రావడానికి ఇష్టపడదు. ఇంట్లో పార్టీ లకి తప్పనిసరిగా ఉండాలి కాబట్టి ఉండిపో తుంది. వచ్చిన వాళ్లందరికీ మర్యాదగా నమస్కరించి ఏదో పలకరింపుగా మాట్లాడి ఒక పక్కన కూర్చుండిపోతుంది.

రానురానూ చౌదరిగారికి ఆమె పట్ల అసంతృప్తి పెరిగిపోతుంది. అలా జరిగిన ప్పుడల్లా అతడు ఎక్కువగా తాగుతాడు. ఆ తర్వాత గదిలోకి వచ్చి ఆమెపై బాగా అరు స్తాడు. మొదట్లో ఆమె ఏడ్చేది. రానురాను అది అలవాటుగా మారి మౌనంగా భరిం చేది. చౌదరి తల్లి అపూర్వకి ఏడేళ్లుండగా పోయింది. ఇక అప్పటి నుండి చౌదరి మరీ విపరీతంగా ప్రవర్తించేవాడు. అందంగా చలాకీగా ఉండే తన సెక్రెటరీ సమీరతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడు. మొదట రాత్రిళ్లు ఇంటికి లేట్‌గా వచ్చేవాడు. రాను రాను రాత్రిళ్లు మొత్తానికే ఇంటికి రావడం మానేశాడు. అతడు తనను పూర్తిగా నిర్లక్ష్యం చేయడంతో వైజయంతి తన రాత ఇంతే అని సరిపెట్టుకొని తన ఆశలన్నిటికీ అపూర్వనే కేంద్రబిందువుగా చేసుకొని ఆమె నెంతో అపురూపంగా పెంచసాగింది.

చౌదరిగారికి కూడా కూతురంటే ప్రాణం. ఆమెపట్ల అతనెంత బిజీలో వున్నా తన బాధ్యతలన్నీ సక్రమంగా నిర్వహించేవాడు. ఏ స్కూల్లో చేర్పించాలో అని ఎన్నో ఎంక్వ యిరీలు చేసి బాగా ఆలోచించి సిటీలోకెల్లా బెస్ట్ స్కూల్లో చేర్పించారు. తనెప్పుడన్నా బిజినెస్ టూర్‌కి వెళ్తే అక్కడినుంచి మంచి మంచి బొమ్మలూ, బట్టలూ తెచ్చేవాడు. అపూర్వ మరీ చిన్నపిల్లగా ఉన్నప్పుడు తను వైజయంతిపై బాగా అరిచేవాడు. కానీ అపూర్వ కాస్త పెద్దయినప్పటి నుండి ఆ అలవాటు పూర్తిగా మానుకున్నాడు. తన

తల్లిపై అరుస్తున్నప్పుడు అపూర్వ నిద్ర లోంచి లేచి తండ్రి వైపు భయం భయంగా చూసేది. అపూర్వ కళ్లల్లో భయం చూడ గానే చౌదరి తనేదో తప్పు చేస్తూ దొరికిపో యినట్లుగా తలదించుకొని వెళ్లిపోయేవాడు.

అపూర్వకి తండ్రి అంటే ఒకలాంటి బెరుకు ఏర్పడిపోయింది. తను స్కూలుకి వెళ్లింతర్వాత కూడా అక్కడ ఇన్‌సెక్యూర్డ్‌గా ఫీలయ్యేది. డాడీ మమ్మీపై అరుస్తున్నా డేమో తను లేనప్పుడు ఇంట్లో ఏం జరుగు తోందో, మమ్మీ ఎంతలా బాధ పడ్తుందో ఇలాగే ఆలోచిస్తూ కూర్చునేది. త్వరగా ఎవ్వరితోనూ పెద్దగా ఫ్రెండ్‌షిప్ చేసుకోలేక పోయేది. లంచ్ అవర్లో అందరు పిల్లలు గ్రూపులుగా చేరి నవ్వుతూ తుళ్లుతూ లంచ్ చేస్తుంటే మమ్మీ లంచ్ తేగానే ఆమె వద్దే కూర్చొని లంచ్ చేసేది. స్కూలు వదలగానే మమ్మీ డ్రైవర్‌తో కార్లో వచ్చి తీసికెళ్లేది. స్కూలు నుండి ఇంటికి వచ్చింతర్వాత ఫ్రెష్ అయింతర్వాత శ్రద్ధగా కూర్చొని ఏ రోజు చెప్పిన పాఠాలు ఆ రోజే చదివేది. ఏవైనా డౌట్సు ఉంటే ఇంటికి వచ్చి తనకు ట్యూషన్ చెప్పే టీచర్‌ని అడిగి క్లియర్ చేసుకునేది. ఏ ఏటికాయేడు మంచి మార్కులతో పాస్ అయ్యేది.

చౌదరిగారు తను ఇంటికి త్వరగా వచ్చిన రోజు అపూర్వచేత సాయంకాలం అప్పుడ ప్పుడూ స్విమ్మింగ్ చేయించేవాడు. షటిల్ ఆడించేవాడు. గేమ్సు వల్ల శరీరానికి మంచి వ్యాయామం కలిగి ఫిజికల్ స్ట్రెంత్ బాగా ఉంటుందని అంటారాయన. ప్రతిసారీ ఆమె బర్త్‌డే రోజున చౌదరిగారు మంచి బుక్స్ ప్రజెంట్ చేసేవారు.

ఇండియాలో దొరికేవే కాక బయటి దేశా లనుండి కూడా తెప్పించేవాడు. అందులో మంచి స్టోరీ బుక్స్ జనరల్ నాలెడ్జ్‌కి సంబంధించిన బుక్సూ, మంచి రైటర్స్ రాసిన బుక్సూ ఆమె వయసుకు తగ్గట్టుగా తెప్పించేవాడు. అపూర్వకి పదిహేనేళ్లు వచ్చే సరికి ఆమెకు ఇంట్లోనే ఒక మంచి లైబ్రరీ ఏర్పాటై ఉండేటట్లు చేశాడు.

అదిగాక చౌదరిగారికి ఒక అపోహ ఉండేది. అదేమిటంటే వైజయంతి పల్లెటూరి నుండి వచ్చిందనీ ఆమె పెంపకంలో అపూర్వ తన చుట్టూ ఉన్న తన ఫ్రెండ్స్ పిల్లలలాగా ఫాస్ట్‌గా తయారవలేదనీ ఎక్స్ పోజర్ ఉండదనీ అనుకునేవాడు. అందు కోసం అపూర్వ ఐదేళ్లప్పటి నుండి బాగా ఇంగ్లిషు మాట్లాడే గవర్నెస్‌నీ, అన్ని సబ్జె క్ట్సుని టీచ్ చెయ్యడానికి మంచి ట్యూటర్‌నీ పెట్టాడు.

తనకెలాంటి హెయిర్‌స్టయిల్ నప్పు తుందో ఎప్పుడు ఎలా డ్రస్ చేసుకోవాలో ఏ వయసుకు ఎలాంటి డ్రస్‌లు కుట్టించుకో వాలో చూసుకోవడానికి మంచి పేరున్న బ్యూటీషియన్‌నీ, డ్రస్ డిజైనర్‌నీ నియమిం చాడు. పాప ఆరోగ్యంగా ఎదుగుతోందో లేదో చూసుకోవడానికి సిటీలో పేరు మోసిన పీడియాట్రిషియన్నీ, న్యూట్రిషి యన్నీ కన్సల్టేషన్‌కి ఏర్పాటు చేశాడు. ఇలా అతను అపూర్వ విషయంలో ఎప్పుడూ ఏలోటూ చేయలేదు. వైజయంతికి అతడు తన ప్రేమను పంచకపోయినా ఆమె పట్ల వేరే బాధ్యతలన్నీ నెరవేర్చేవాడు. ఇంట్లో పనికి తగినంతమంది నౌకర్లని పెట్టేవాడు. ఆమె ఎక్కడకు వెళ్లాలన్నా డ్రైవరు, కారు ఉంచేవాడు. ఆమె ఖర్చులకని ఆమె పేర అకౌంట్ ఉంచి బాంక్ బాలెన్స్ ఉండేటట్లు చేశాడు. కాకపోతే ఆమెను వివాహం చేసు కోవడం వలన తన వైవాహిక జీవితంలో ఏదో కోల్పోయానన్న బాధవల్ల కొన్ని విష యాల్లో మాత్రం ఆమెపట్ల సక్రమంగా ప్రవ ర్తించలేకపోయేవాడు.

అపూర్వ మిడిల్ స్కూలుకి వచ్చేసరికి ఫ్రెండ్‌షిప్‌పైన అవగాహన పెరిగింది. మెల్లమెల్లగా అందరితో మాట్లాడటం, ఫ్రెండ్సుని చేసుకోవడం చేయసాగింది. ఇక పోతే శని, ఆది వారాలు తనకు హాలీడేస్

కాబట్టి తన మమ్మీని ఎంటర్‌టైన్ చేయడా నికి ప్రయత్నిస్తుంది. ఆ రెండురోజులూ ఏదైనా సినిమాకి వెళ్ళడమూ, షాపింగ్‌కి వెళ్ళి అట్నుంచి అటే ఏదైనా రెస్టారెంట్‌లో భోంచేసి రావడమూ చేస్తారు. అపూర్వ కాస్త పెరిగి పెద్దయినప్పటినుండి వైజ యంతి కాస్త మనుషుల్లో పడింది. వాళ్ళి ద్దరూ షాపింగ్‌కి వెళ్ళినప్పుడు అపూర్వ తన తల్లికి బట్టలూ, నగలూ సెలెక్ట్ చేసి కొనిపి స్తుంది. బ్యూటీ పార్లర్‌కి తీసుకెళ్ళి వైజ యంతి జుట్టును మంచి షేప్‌లో ట్రిమ్ చేయించింది. వైజయంతి బాగా పెద్దగా పెట్టుకునే కుంకుమ బొట్టుకు బదులుగా చిన్నచుక్క పెట్టుకునేటట్లుగా చూపించింది. తను స్కూలుకు వెళ్ళిన తర్వాత వైజయంతి బోరు కాకుండా ఉండాలని క్లబ్బులో జిమ్‌కి వెళ్ళే ఏర్పాటు చేసింది. మొదట వైజయంతి ఇష్టపడలేదు. కానీ అపూర్వ బలవంతంమీద వెళ్లసాగింది.

అపూర్వ స్కూలు ఫైనల్ పాసయ్యి ఇంట ర్‌లో జాయినయ్యింది. చౌదరిగారు అపూ ర్వని "అప్పూ నీకే కోర్సంటే ఇష్టం. మెడి సెనా, ఇంజనీరింగా, ఇంటర్లో ఏ సబ్జెక్ట తీసుకుంటావు" అనడిగాడు.

"నేనవేవీ చదవను డాడీ. నేనింటర్లో కామర్స్ తీసుకొని తరువాత ఫ్యాషన్ టెక్నా లజీ కొరకు ఎంట్రెన్స్ రాస్తాను" అంది.

"సరే అప్పూ నీ ఇష్టం మరి ఇంటర్ అడ్మి షన్ ఎక్కడ తీసుకుంటావు"

"సికింద్రాబాద్‌లోని సెయింట్ ఫ్రాన్సిస్‌లో తీసుకుంటాను డాడీ" అంది.

అపూర్వ కాలేజీకి వెళ్లడానికని ప్రత్యేకంగా ఒక కొత్త కారు తీసుకొని దానికి వేరే డ్రైవర్ని పెట్టాడు. స్కూలు ఫైనల్ ఎగ్జామ్స్ అయ్యాక బాగా ఫ్రీ టైం దొరకడంతో అపూర్వ తల్లికి ఇంగ్లిషు నేర్పసాగింది. స్పోకెన్ ఇంగ్లిషుకు మంచి ఆంగ్లో ఇండి యన్ ట్యూటర్‌ని పెట్టింది. మంచి ఆక్సెంటు రాకపోయినా వైజయంతికి ఒక ఏడాదిలో ఇంగ్లిషు మాట్లాడటం బాగా నేర్పింది. అదీగాక ఆమె పదవక్లాసు వరకు చదివి ఉండటంవలన ఇంగ్లిషు రాయ డమూ, బుక్స్ చదవడమూ కూడా బాగా నేర్చుకుంది.

మొదట వైజయంతి క్లబ్‌లో జిమ్‌కి అపూర్వ బలవంతంమీద వెళ్ళినా రాను రానూ అది ఆమెకు రొటీన్ చర్యగా అల వాటై రెగ్యులర్‌గా వెళ్ళసాగింది. దాంతో ఆమె శరీరంలో పేరుకుపోయిన కొవ్వు కరిగి శరీరం నాజూకుగా, ట్రిమ్‌గా అవసా గింది.

ఒకరోజు వైజయంతీ, అపూర్వా లైఫ్‌స్ట యిల్ షాపింగ్ కాంప్లెక్స్‌కి వెళ్ళారు. అపూర్వ అక్కడ కొన్ని డిజైనర్ చీరలు, షల్వార్‌లు, ఒక నాలుగైదు నైటీలు కొంది. వైజయంతి వద్దని వారించింది. "వద్దు అప్పూ అవన్నీ నాకిష్టం ఉండదు కన్నా. అవి వేసుకుంటే ఏదో నడమంతరంగా నేర్చి నట్లుంటుంది. అదీగాక చుట్టుపక్కలవారు ఏమనుకుంటారు. ఇప్పటికే నా సగం జీవితం ముగిసింది. నన్నిలా వదిలెయ్యి" అంది నిరాసక్తంగా.

"సగం జీవితం ముగిసినా ఇంకా సగం జీవితం ముందుందిగా మమ్మీ. నీకు పద హారేళ్లప్పుడు పెళ్లయింది. నీ పెళ్ళయి పద్దె నిమిదేళ్లు. అంటే నీకు మహా అయితే ముప్ఫై నాలుగేళ్లుంటాయి. అంటే నీ ముందు ఎంతో లైఫ్ మిగిలుంది. కాలానికి తగ్గట్లుగా మన జీవితాలను మల్చుకుంటే లైఫ్ బోరు కొట్టదు మమ్మీ. అదీకాక మన మీద మనకు కాన్ఫిడెన్స్ పెరుగుతుంది. ఇక పోతే ఎవరో ఏదో అనుకుంటారని ఎందుక నుకోవాలి. మనమేం తప్పుచేశామని. ఇలా బట్టలు వేసుకోవడంవల్ల స్టయిలు పెరుగు తుందని కాదు మమ్మీ. మన కంఫర్ట్ కొరకు వేసుకుంటాం. ఎబ్బెట్టుగా, అసభ్యంగా ఉండనంతవరకు మనమెవ్వరికీ భయపడవ లసిన అవసరంలేదు" అంటూ బిల్ చేయిం

చింది. తర్వాత ఇంటికి వెళ్తున్నప్పుడు దోవలో అడిగింది.

“మమ్మీ నిన్నో విషయం అడగనా. నేను నీతో బలవంతంగా ఇవన్నీ చేయించడంవలన నీ వ్యక్తిత్వం దెబ్బతిన్నట్లు ఫీలౌవుతున్నావా, నీ సహజత్వాన్ని కోల్పోతున్నానని బాధపడుతున్నావా, నిజంగా అలా అనుకుంటే చెప్పు ఇవన్నీ మానేద్దాం. కానీ ఒక్కటి మాత్రం నిజం. నువ్వు ముప్పై ఐదేళ్లు కూడా నిండకుండానే డెబ్బైఏళ్ల వయస్సున్న వాళ్లలా గడపడం నాకిష్టంలేదు మమ్మీ. నువ్వు ఇంగ్లిష నేర్వడంవల్ల ఎన్నో పన్లు నువ్వు స్వంతంగా చేసుకోగలుగుతావు. డ్రైవింగ్ రావడంవల్ల నువ్వు ఎవ్వరిపైనా ఆధారపడకుండా ఇంట్లో డ్రైవరు లేకున్నా అత్యవసర పరిస్థితుల్లో ఎక్కడికయినా వెళ్లగలుగుతావు. మంచి బట్టలు, ఫిట్‌నెస్, స్టైల్ ఈ మూడూ నీలో కాన్ఫిడెన్స్‌ని పెంచుతాయి మమ్మీ. నువ్వు తాతయ్యతో ఉన్నప్పుడు మీ ఊళ్లో అవకాశాలు లేక నీకివన్నీ నేర్వలేకపోయుండొచ్చు. డాడీకి నీపైన శ్రద్ధలేక ఇవన్నీ పట్టించుకోలేదు. నాకు మాత్రం నువ్వు ఇవన్నీ నేర్చుకోగలవు, నీకా అవకాశం కల్పిస్తే నువ్వేదయినా చెయ్యగల నేర్పు నీకుందన్న నమ్మకంతో ఇలా చేస్తున్నాను. నీకిష్టంలేని పనులు చేయిస్తున్నానని నీకు కోపంగా ఉందా?” అలా అంటున్నప్పుడు అపూర్వ కళ్లలో నీళ్లు తిరిగాయి.

అది చూసి వైజయంతి వెంటనే అపూర్వ చెయ్యి తన చేతిలోకి తీసుకొని “లేదు అప్పూ... నేను ఇంకెప్పుడూ ఏదీ కాదనను సరేనా నువ్వు ఏది చెప్పినా నాకు సమ్మతమే. నువ్వు నా కూతురివే అయ్యుండొచ్చు కానీ నేను నీలో మంచి స్నేహితురాల్ని చూసుకుంటున్నాను. నీలాంటి కూతురుండటం నిజంగా నా అదృష్టం” అంది కళ్లు చెమర్చుతుండగా. ఇంతలో కారు ఇంట్లోకి రావడంతో ఇద్దరూ మౌనంగా కారు దిగి లోపలికి వెళ్ళిపోయారు.

★ ★ ★

అపూర్వ కాస్త పెద్దయినప్పటినుండి ఆ ఇంట్లో చాలా మార్పు వచ్చింది. చౌదరిగారు వైజయంతిపట్ల మొదటంత అంటీముట్టనట్లుగా ప్రవర్తించలేకపోయేవాడు. అపూర్వకి సంబంధించిన విషయాలు కలిసి మాట్లాడుకునేవారు. అపూర్వకి ఆదివారం హాలీడే కాబట్టి ఆరోజు ఉదయం బ్రేక్‌ఫాస్ట్ అతడింట్లోనే ఉండి అపూర్వతో కలిసి చేసేవాడు.

అపూర్వ ఎనిమిదవ క్లాసులోకి వచ్చినప్పుడే అతడు జర్మనీ నుండి చాలా లేటెస్ట్ మోడల్ కంప్యూటర్ తెప్పించి మంచి సాఫ్ట్‌వేర్ ఇంజనీరును పిలిపించి తను కూడా ఉండి ప్రతి ఆదివారం కంప్యూటర్‌ని ఎలా ఉపయోగించాలో అపూర్వకి నేర్పించాడు.

తన తల్లితండ్రుల మధ్య రిలేషన్ ఎలా ఉన్నా, వాళ్ళిద్దరి ప్రేమకు తనే కేంద్రబిందువు అన్న విషయం అపూర్వకి స్పష్టంగా అర్థమయ్యింది. ఇద్దరికీ తనంటే ప్రాణం. తన తల్లి తనంటే ప్రాణంగా తన తోడిదే లోకంగా తను కళ్ళముందుంటే చాలన్నట్లుగా ఉంటుంది. ఇక తన తండ్రి తను ఏదీ పెదవి విప్పి అడగనవసరంలేకుండా అన్నీ సమకూరుస్తాడు. తనెక్కడకు వెళ్ళినా అందరిలోకెల్లా ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటాడు.

చౌదరిగారికి అపూర్వని చూస్తే చాలా గర్వంగా ఉంటుంది. అపూర్వ అచ్చంగా తన పోలికతోనే ఉంటుంది. అపూర్వకి వైజయంతి తెల్లటి రంగు రాకపోయినా ఆమె కనుముక్కుతీరు కాస్త వచ్చాయి. అపూర్వ మరీ తెల్లటి రంగులో ఉండకపోయినా తనలా ఛామనఛాయకంటే మెరుగైన రంగులో ఉంటుంది. కానీ ఆమె చర్మం ఎంతో ఆరోగ్యంగా, కాంతివంతంగా మెరుస్తూ నునుపుదేలి ఉంటుంది. సుమారు ఐదడుగుల ఆరంగుళాల హైటు ఉంటుంది. సన్నగా నాజూగ్గా మంచి ఫిగర్‌తో ఒక

మోడల్‌లా ఉంటుంది. నల్లటి మెరిసే చిక్కని పట్టుకుచ్చులాంటి జుట్టు జాలువారుతూ ఉంటుంది. పెద్దపెద్ద కళ్లు. ఆ కళ్ళు ఎంత స్వచ్ఛంగా ఉంటాయంటే ఆ కళ్లలో ఎలాంటి కల్మషంలేని ఆమె మనసు ప్రతిఫలిస్తుందేమో అన్నట్లుగా ఉంటాయి. కళ్ల కంటే ఆమె కనురెప్పలు దట్టమైన నల్లటి పొడవాటి వెంట్రుకలతో ఎంతో అందంగా ఉంటాయి. ఆమె నవ్వు, నవ్వినప్పుడు మెరిసే తెల్లటి ముత్యాల్లాంటి పలువరుస ఇంకా అందంగా ఉంటాయి. ఈ మధ్యన రాంభూపాల్‌చౌదరిగారు అపూర్వని తన వెంట బిజినెస్ పార్టీలకు, స్నేహితుల, బంధువుల పార్టీలకు తీసుకువెళ్తున్నాడు. అతడు అపూర్వని వెంటరమ్మన్నప్పుడల్లా అపూర్వ "మమ్మీ కూడా వస్తుందా డాడీ" అనడుగుతుంది.

అతడు కూడా ఈమధ్యన వైజయంతిలో వచ్చిన మార్పు కనిపెట్టాడు. దానికి అపూర్వే కారణమని అతడు అర్థంచేసుకున్నాడు. అపూర్వ అలా అడగగానే అతడు సరే అంటాడు. అపూర్వ అడిగినందుకు రమ్మన్నాడనీ అతడు తనకు తానుగా పిలవలేదనీ గ్రహించి రావడం ఇష్టంలేకున్నా అపూర్వ ఫీలవుతుందని వెళ్తుంది వైజయంతి. ఇలా అపూర్వవల్ల వాళ్లిద్దరూ కాస్త దగ్గరవసాగారు. వైజయంతిని తెలిసిన వాళ్లు "ఏమండీ మీరిమధ్య బాగా స్లిమ్‌గా అయ్యారు, సీక్రెటేంటో మాక్కూడా చెప్పరూ" అనో, "వైజయంతీ మీరు కట్టుకున్న చీర చాలా బాగుందండీ, చాలా మంచి కలర్ కాంబినేషన్ ఎక్కడ కొన్నారూ" అనో, కాంప్లిమెంట్స్ ఇవ్వసాగారు. దాంతో వైజయంతికి తనపై తనకు కాన్ఫిడెన్స్ పెరగసాగింది. చూసేవాళ్లకు కూడా వీళ్లది ముచ్చటైన కుటుంబంలా అన్పించేది.

కానీ చౌదరిగారు రాత్రిళ్లు సమీర ఇంటికి వెళ్ళడముగానీ ప్రతి నెలా సమీరతో ఒకసారన్నా ఔటాఫ్ స్టేషన్ వెళ్తాడని కానీ బయట ఎవ్వరికీ పెద్దగా తెలియదు. కానీ మొదట మాత్రం చౌదరిగారు పాపం ఎక్కువ చదువులేని పల్లెటూరమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడని అనుకునేవారు. ఇప్పుడేమో చౌదరిగారు మిసెస్ చాలా మారింది. ఇప్పుడన్నివిధాలా ఆయనకు సూటబుల్‌గా ఉంది అనుకుంటున్నారు. గిట్టనివారు మాత్రం దీనికేం పొయ్యేకాలం నడమంత్రంగా ఇన్ని షోకులు నేర్చింది అనుకుంటున్నారు.

చౌదరిగారు సమీరని పెట్టుకున్న విషయం వైజయంతికి, ఇంకా తను పుట్టింటినుంచి తన వెంట వచ్చిన నమ్మకమైన మనిషి గిరిజమ్మకి, చౌదరిగారి డ్రైవరు వర్ధన్నకి, చౌదరిగారి పి.యస్. రామ్మూర్తికి తప్ప ఎవ్వరికీ తెలియదు. వర్ధన్నా, రామ్మూర్తీ ఇద్దరూ చౌదరిగారి నమ్మిన బంట్లు. నరికినా ఈ విషయం ఎవ్వరికీ చెప్పరు. రోజులు ఇలా గడిచిపోతున్నాయి. అపూర్వ ఫ్యాషన్ టెక్నాలజీ కోర్సు కోసం ఎంట్రెన్స్ రాసి రిజల్ట్సు కొరకు వెయిట్ చెయ్యసాగింది. తను ఎట్లైనా బయటకు వెళ్ళినా పార్టీలకు వెళ్ళినా ఎక్కువగా మాట్లాడదు.

చిరునవ్వుతో అందరినీ విష్‌చేస్తుంది. వాళ్లడిగిన వాటికి చక్కగా సమాధానాలిస్తుంది. కానీ తనంతతానుగా ఎక్కువ మాట్లాడదు. పరిసరాలను క్షుణ్ణంగా గమనిస్తుంది. ఎవరు ఎట్లాంటి దుస్తులు వేసుకున్నారో గమనిస్తుంది. ఆ దుస్తులు వాళ్లకు సరిగ్గా సూటవలేదు. వీళ్ళిలా వేస్తే బాగుండదు. అంత లావుగా ఉన్న ఆవిడ ఇంత గాడీగా డ్రెస్ అవడంవల్ల చాలా మొరటుగా కనబడుతుంది. ఆ అమ్మాయి అంత సన్నగా ఉండి అంత పలుచని దుస్తుల్లో మరీ గెడకర్రలా అగుపడుతుంది. అపూర్వ ఆలోచనలన్నీ ఈ విధంగానే ఉంటాయి. అసలు మనవాళ్లలో చాలామందికి డ్రెస్ సెన్స్ ఉండదు. అసలు ప్రతి ఒక్కరికీ సరి

పడేలా వాళ్లవాళ్ల వయసుకీ, శరీరాకృతులకు నప్పేలా డిజైన్ చెయ్యగలగాలి. వాటికి సూట్ అయ్యేలా నగలు కూడా డిజైన్‌చేసి అన్నీ ఒకేదగ్గర దొరికేలా ఒక స్వంత కంపెనీ ఔట్‌లెట్ ఏర్పాటు చెయ్యాలి. అపూర్వ తను ఫ్యాషన్ డిజైనింగ్ కోర్సు చెయ్యాలని ఖచ్చితంగా నిర్ణయించుకుంది.

అపూర్వ తను రోజూ చేసే దినచర్య తరువాత రాత్రిళ్లు తన కంప్యూటర్ ముందు కూర్చొని పెద్దపెద్ద కంపెనీ వాళ్ళు కెల్‌విల్ క్లెయిన్, గెస్‌గాప్ ఇలాంటి పెద్దపెద్ద బ్రాండ్ వాళ్లు తయారుచేసిన లేటెస్టు డిజైన్స్‌ని వెబ్‌సైట్‌లో చూడటం, వాటి గురించి డీటెయిల్డ్‌గా స్టడీచేయడం చేస్తుంది.

కొన్నిసార్లు కంప్యూటర్ స్క్రీన్ పైన రకరకాల మనుషుల ఆకృతులను అంటే లావుగా, సన్నగా, కురచగా, మధ్యస్థంగా ఇలా విభిన్న ఆక్రతులతో రేఖా చిత్రాలను సృష్టించి అలాంటి ఆకృతులకు ఎలాంటి బట్టలు నప్పుతాయో వేసి చూసుకుంటుంది.



తరువాత రంగులు మిక్స్‌చేసి దుస్తులకు కొన్ని డ్రై కలర్స్ ఎలా వాడుకోవచ్చో ఆలోచిస్తుంది. కానీ అపూర్వకి ఎంట్రెన్సులో మంచి ర్యాంక్ రాకపోవడంతో బి.కాం ఫస్టియర్లో జాయినయ్యి మళ్ళీ ఎగ్జామ్స్‌కి ప్రిపేరవసాగింది. సరిగ్గా అటువంటి సమయంలోనే అపూర్వకి మయూర్‌తో పరిచయం ఏర్పడింది.

అంతకుమునుపే అతని గురించి ఫ్రెండ్స్ ద్వారా వినిఉండటంవలన ఆమెలో అతన్ని చూడాలన్న క్యూరియాసిటీ కాస్త ఉండేది. అపూర్వ ఎప్పుడూ కూడా కోఎడ్యుకేషన్‌లో చదువలేదు. తన తండ్రితో తప్ప పెద్దగా మగవాళ్లతో క్లోజ్‌గా ఎన్నడూ మాట్లాడలేదు. ఆమెకు అన్నా, తమ్ముళ్లు లేరు. పెద్దగా కజిన్స్ కూడా లేరు. అందువల్ల ఆరోజు మయూర్ అంత సడన్‌గా పక్కన వచ్చి నిలబడేసరికి అంతలా తడబడిపోయింది. తనకు నోటమాట రాలేదు.

తళుక్కున మెరిసే ఆ నీలికళ్లతో సూటిగా తనను చూసిన ఆ చూపు తన గుండెలోకి దూసుకుపోయింది. తను మళ్ళీ ఆ షాపుకి వెళ్ళాలనీ, అతన్ని చూడాలనీ, అతనితో మాట్లాడాలనీ బలంగా అన్పించసాగింది. కానీ ఏ కారణం సృష్టించుకొని వెళ్లగలదు. ఎవరికన్నా బర్త్‌డే గ్రీటింగ్ కార్డ్స్ కొనడానికని వెళ్ళాలా. కానీ ఇంత త్వరగా తను అలా వెళితే అతను తన మనసు కనిపెడితే, తను చులకనైపోతుందేమో! ఇలా ఆలోచిస్తూనే ఉంది. ఆమె ఇంక ఆ రాత్రి తను రోజూ చదివేలా చదవలేకపోయింది. ఆమెకి నిద్ర కూడా చాలా ఆలస్యంగా పట్టింది. ఆమె మనసు అప్పుడు నిర్మలంగా ఉన్న తటాకంలో రాయిపడితే ఎలా ఉంటుందో అలా ఉంది.

అపూర్వ మళ్ళీ సరియైన కారణంతో ఆ షాపుకి వెళ్ళడానికి పదిహేను రోజులు పట్టింది. తన క్లాస్‌మేట్ నవ్య తన బర్త్‌డే పార్టీకి ఇన్వయిట్ చేసింది. తనకి గ్రీటింగ్ కార్డ్, గిఫ్ట్ కొనాలని వెళ్ళింది. ఆమె వెళ్లేసరికి షాపులో ఇంకొందరు కస్టమర్స్ ఉన్నారు. కొందరు కార్డ్సు చూస్తున్నారు. కొందరు కీ చెయిన్స్ సెలెక్ట్ చేసుకుంటున్నారు. మయూర్ కౌంటర్ దగ్గర కూర్చొని ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. ఆ షాపులో పనిచేసే ఇద్దరు సేల్స్‌గర్ల్స్ వచ్చిన కస్టమర్లపైన ఒక కన్నేసి ఉంచి చూస్తూనే అడిగిన వాళ్లకు అవసరమైనవి చూపిస్తున్నారు.

అపూర్వ ముందుగా గ్రీటింగ్ కార్డ్స్ సెక్షన్‌లో ఒక మంచికార్డ్ సెలెక్ట్ చేసుకొని కౌంటర్ దగ్గరకు వెళ్ళింది. ఆమె అక్కడికి వెళ్లేసరికి మయూర్ ఫోన్ పెట్టేసి అపూర్వవైపు తిరిగాడు. అతడు ఆమెను చూడగానే గుర్తుపట్టినట్లు పలకరింపుగా నవ్వాడు.

అపూర్వ గ్రీటింగ్ కార్డ్ కౌంటర్‌పైన పెట్టి అతనితో

"ఐ వుడ్ లైక్ టు సీ సమ్ గిఫ్ట్ ఐటమ్స్" అంది.

ఆరోజు ఒక్కమాట కూడా మాట్లాడకుండా వెళ్లిన అపూర్వ ఈరోజు తనంతతానుగా వచ్చి మాట్లాడటంతో మయూర్ కొంచెం ఆశ్చర్యం ముఖంలో కనబడేటట్లుగా చూస్తూ "దోస్ ఆర్ డిస్‌ప్లేడ్ ఇన్ ఫస్ట్‌ఫ్లోర్ మేడం" అంటూ కౌంటర్ వెనక కనబడుతున్న చిన్న స్పైరల్ స్టెయిర్‌కేస్‌వైపు చూపించాడు.

ఆరోజు కస్టమర్ల రద్దీ ఎక్కువగా ఉండటంవల్ల మయూర్‌కి బిల్ కౌంటర్ వద్ద నుండి అతడు పైకి వెళ్ళడానికి కొంత సమయం పట్టింది. సేల్స్‌గర్ల్‌ని పిలిచి కౌంటర్‌వద్ద ఉంచి అతడు పైకి వెళ్ళాడు. ఈ లోపల అపూర్వ ఐటమ్స్ చూడసాగింది.

ఒక పక్కన అన్నీ సాఫ్ట్ టాయ్స్ ఉన్నాయి. మరోపక్కన పోర్సలిన్‌తో తయారుచేసిన బొమ్మలు డిస్‌ప్లే చేసున్నాయి. మయూర్ వెళ్లేసరికి అపూర్వ తనకి కావా

ల్సిన ఐటమ్ సెలెక్ట్ చేసుకుంది. అందమైన ఫ్లవర్ బొకే చేతిలో పట్టుకొని నిల్చున్న అమ్మాయి బొమ్మ అది. అది పూర్తిగా ఫోర్సి లిన్‌తో తయారైన బొమ్మ కానీ దానికి వేసిన మాక్సీలాంటి డ్రెస్ నెట్‌క్లాత్‌పైన మంచి ఎంబ్రాయిడరీ చేసి ఉంది. ఆ బొమ్మ ఫీచర్స్ ఎంతో అందంగా తీర్చిదిద్దిన ట్లుగా ఉన్నాయి. అపూర్వ చేతిలో ఆ బొమ్మ చూసిన మయూర్ ఆమెతో 'గుడ్ ఛాయిస్ మాడమ్, గివ్ ఇట్ టుమీ ఐ విల్ గెట్ ఇట్ పాక్డ్' అంటూ ఆమె చేతిలోని బొమ్మను తీసుకొని వెంటనే అక్కడున్న కుర్రవాణ్ణి పిలిచి ఆ బొమ్మను ఎలా ప్యాక్ చేయాలో చెప్పాడు.

అపూర్వ, మయూర్ ఇద్దరూ కిందికి వచ్చారు. అపూర్వ బిల్ కట్టేటప్పుడు మయూర్ ఆమెకి ఒక రిజిష్టర్ బుక్ ఇచ్చి అందులో ఆమె పేరు, అడ్రస్, ఫోన్ నెంబరు రాయమని రిక్వెస్ట్ చేశాడు. "ఈ వివరాలన్నీ ఎందుకు" అనడిగింది అపూర్వ.

"మా షాప్‌లో ఇయర్లీ టూ టైమ్స్ డిస్కౌంట్ సేల్ ఉంటుంది. మీ అడ్రస్, ఫోన్ నెంబరు మా దగ్గర ఉంటే మీకు ఇన్‌ఫామ్ చెయ్యడానికి ఉపయోగపడ్తాయి. "మా దగ్గరకొచ్చే ప్రతి కస్టమర్ వివరాలు మా దగ్గర నోట్ చేసుకోవడం మా ఆనవాయితీ" అన్నాడు మయూర్.

అపూర్వ ఆ బుక్‌లో అడ్రస్ రాసేలోపల ఆ బొమ్మ గిఫ్ట్‌ప్యాక్ చేసిన కుర్రాడు అది తెచ్చి కౌంటర్‌పైన పెట్టాడు. ఆ ప్యాకింగ్ ఎంతో అందంగా చేశాడు. ఆ బొమ్మను ఉంచిన డబ్బాకు నాలుగువైపులా అట్టకు బదులుగా ట్రాన్స్‌పరెంటుగా ఉన్న థిక్ ప్లాస్టిక్ షీటు ఉండటంవలన బొమ్మ అన్ని వైపులనుండీ కనబడుతుంది. ఆ డబ్బాపైన ఒక పక్కకు వచ్చేలా మంచి శాటిన్‌బో కట్టి, దానికి ఒక చిన్న కార్డును ఉంచారు. అపూర్వ అప్రిషియేట్ చెయ్యకుండా ఉండలేకపోయింది.

"హి డిడ్ ఎ గుడ్ జాబ్" మయూర్‌తో అని ఆ కుర్రాడికి మంచి టిప్ ఇచ్చి గ్రీటింగ్ కార్డ్‌నీ, గిఫ్ట్‌నీ తీసుకొని వెళ్ళిపోయింది. మయూర్ ఆమె వెళ్ళిన వైపే చూస్తూండిపోయాడు. ఆమె లోపలికి వచ్చినప్పటినుండి వచ్చే పరిమళం ఆమె వెళ్ళిన తర్వాత కూడా ఎంతోసేపు నిలిచిపోయింది. తన షాప్‌కి రోజూ ఎంతోమంది స్టూడెంట్స్, యంగ్ గర్ల్స్ వస్తారు. కానీ ఈ అమ్మాయి మాత్రం చాలా ప్రత్యేకంగా ఉంటుంది అనుకున్నాడు. కొన్నివందలమంది కస్టమర్స్ తమ షాపు రిజిష్టర్‌బుక్‌లో వాళ్ళ అడ్రసులు రాసినా అతడు తెరిచి చూడడు. డిస్కవుంట్ సేల్స్ ఉన్నప్పుడు వాళ్ళ సేల్స్‌గర్ల్స్‌తో కార్డ్స్ రాయించి పోస్ట్‌చేయిస్తాడు.

మొట్టమొదటిసారిగా అతడు రిజిష్టర్ బుక్ తెరిచి ఆమె వివరాలు చదివాడు.

యస్. అపూర్వచౌదరి
శక్తివిల్లా,
C/o S. రాంభూపాల్‌చౌదరి,
జుబ్లీహిల్స్,
H.No. 87/3, రోడ్ నెం. 36.

ఆ అడ్రస్ చదివిన అతని కనుబొమలు ఆశ్చర్యంతో పైకి లేచాయి. మైగాడ్ ఈ అమ్మాయి "శక్తి గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్, ఛైర్మన్ రాంభూపాల్ చౌదరిగారి అమ్మాయా? మైగాడ్ అసలు ఈ ట్విన్‌సిటీస్‌లో రాంభూపాల్‌చౌదరి గారెవరో తెలియని వారు తక్కువే అని చెప్పాలి. మయూర్ పెన్నుతో అపూర్వ అన్న అక్షరాల కింద అండర్‌లైన్ చేస్తూ ఆ అమ్మాయిలాగే ఈ పేరు కూడా అద్భుతంగా ఉంది అనుకున్నాడు. అతనికెందుకో ఆ అమ్మాయి మళ్ళీమళ్ళీ తన షాపుకి వస్తే బాగుండును అని పదేపదే అనుకోసాగాడు ఆమె వెళ్ళిన వైపే చూస్తూ.

కానీ అతనికి తెలుసు అపూర్వ ఆకాశహర్మ్యాన కూర్చున్న దేవతలాంటిదని. శక్తి

గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ రామ్‌భూపాల్ చౌదరి ఏకైక పుత్రిక అంటే మాటలు కాదు. ఆయన చాలా చిన్న వయసులోనే వ్యాపార రంగంలో అత్యున్నత స్థాయికెదిగారు.

మొదట అతను వంటనూనెల వ్యాపారం చేసేవాడు. ఆ తర్వాత సబ్బులు, వినియోగ వస్తువుల తయారీకి రంగం సిద్ధం చేశాడు. తక్కువ ఖరీదులో మన్నికైన దుస్తులు అన్ని తరగతుల వారికి అందుబాటులో ఉండేలా వస్త్రవ్యాపారంలోకి దిగాడు. ఇవన్నీ సత్ఫలి తాలనివ్వడంతో ఇక ఆయన వెనుకకు తిరిగి చూడలేదు. ఆనాటినుండి ఈనాటివరకు విజయాల్నే చవిచూస్తూ ఆయన వ్యాపా రాన్ని సాఫ్ట్‌వేర్ రంగం వరకూ విస్తరిం చాడు.



మయూర్ ఆయన గురించి తరచుగా న్యూస్ పేపర్లలో, మాగ్‌జీన్స్‌ల్లో వచ్చే ఆర్టికల్స్‌ని శ్రద్ధగా చదివేవాడు. స్వశక్తితో చిన్న వయసులోనే ఉన్నతమైన స్థానానికి ఎదిగినవాళ్లకు మయూర్ చాలా గౌరవాన్నిస్తాడు. తను కూడా వాళ్లలా ఎదగాలని కలలుగంటాడు.

అతని కళ్లముందు మళ్ళీ అపూర్వ మెదిలింది. మహారాణీలాంటి అపూర్వ ప్రవర్తనలో ఏమాత్రం గర్వపుఛాయలు లేవు. ఆమెలో ఎటువంటి మిడిసిపాటూలేదు. నెమ్మదిగా వచ్చి కళ్లతోనే మాట్లాడుతూ తన పని తాను చేసుకుపోయే అపూర్వపైన అతనికి ఒకలాంటి అపురూపమైన భావం కలుగసాగింది. ఆమెకొరకు ఏ రాజకుమారుడి లాంటి వరుడు ఎక్కడో ఎదురుచూస్తుండవచ్చు అయితే మాత్రం ఏం? తను ఆమెను దూరంనుండి ఆరాధించే అర్చకుడవుతాడు.

అతడు ఆమె బిల్ పే చేయడానికని ఇచ్చిన ఐదు వందలనోటును కాష్ కౌంటర్ డెస్క్‌లోంచి తీసి దాన్ని అపురూపంగా స్పృశిస్తూ తన పర్సులోని అరలో భద్రంగా దాచాడు.

మళ్ళీ అనుకున్నాడు ఆ అమ్మాయిని ఎప్పుడు చూస్తానా అని. ఇలా అతను ఎంతసేపు ఆలోచనలో మునిగిపోయి అలాగే ఉన్నాడోగానీ షాపు మూసే టైం అయ్యిందని సేల్స్‌గర్ల్ గుర్తుచేసేసరికి ఉలిక్కిపడి టైమ్ చూసుకున్నాడు. 7 గం॥ 10 నిమిషాలు. తను రోజూ షాపుమూసే టైం కంటే 10 నిమిషాలు దాటింది. అరే లేట్ అయ్యిందే. అదీగాక ఈరోజు తనను తన ఫ్రెండ్ బర్త్‌డే పార్టీకి ఇన్వయిట్‌చేసింది. త్వరగా వెళ్ళాలి అనుకుంటూ షాప్‌క్లోజ్ చేసి పార్కింగ్ లాట్‌లో ఉన్న తన బైక్ పైన ఫాస్ట్‌గా వెళ్ళిపోయాడు.

అతడు వెళ్లిన వైపే చూస్తూ సేల్స్‌గర్ల్స్ ఇద్దరూ, ఇంకో హెల్పర్ అబ్బాయితో "మన సార్ ప్రేమలో పడ్డాడు. ఇది లవ్ ఎట్ ఫస్ట్ సైటేమో" అనుకొని నవ్వుకున్నారు.

**మ**యూర్ వాళ్లషాపు ఉదయం 10॥ నుండి రాత్రి ఏడు గంటలవరకు తెరిచి ఉంటుంది. మధ్యాహ్నం 3 గం॥ల నుండీ రాత్రి ఏడుగంటల వరకు సేల్స్ బాగా ఉంటాయి. కాలేజీలు వదిలింతర్వాత స్టూడెంట్స్, ఆఫీసువర్క్ అయ్యి ఇంటికి తిరిగి వెళ్లేవాళ్లందరూ ఆ సమయంలోనే ఎక్కువగా వస్తారు. ఏడుగంటల తర్వాత పెద్దగా సేల్స్ ఉండవు. మొదట మయూర్

తన తండ్రికి సహాయంగా ఉంటుందని మాత్రమే అప్పుడప్పుడూ షాప్‌కి వచ్చేవాడు. కానీ ఈమధ్య తనతండ్రి ఆరోగ్యం సరిగ్గా లేనందువల్ల తన కాలేజీ అవర్స్ అయిపో యింతర్వాత మధ్యాహ్నంనుండి వచ్చి అక్కడే ఉండి బిజినెస్ చూసుకోవాల్సి వస్తోంది. ఉదయం పదిగంటలకు అతని తండ్రి షాప్ తెరిచి మధ్యాహ్నం 2 గంట లకు మయూర్ వచ్చేవరకు ఉంటాడు. మయూర్ రాగానే అతడు వెళ్ళిపోతాడు.

మొదట మయూర్ తండ్రి సూరజ్‌కు మార్ బాలానగర్‌లో ఒక డెకొలమ్ షీట్స్ తయారుచేసే ఫ్యాక్టరీలో పనిచేసేవాడు. రానురానూ డెకొలమ్ షీట్స్ వాడకం తగ్గ డంతో ఆ ఫ్యాక్టరీ లాభాలు తగ్గాయి. దాని వల్ల ఆ కంపెనీ వాళ్లు వాళ్ళదగ్గర జాబ్‌చేసే ఉద్యోగస్థులను కంపల్సరీగా రిటైర్‌మెంట్ తీసుకొమ్మనీ, అలా తీసుకున్న వారికి వాళ్ల సాలరీని బట్టి ఐదులక్షలనుండి ఎనిమిది లక్షల వరకు నగదు ఇస్తామనీ అన్నారు. ఒకవేళ రిటైర్‌మెంట్ తీసుకోనిపక్షంలో వర్క్‌లోడ్ ఎక్కువవుతుందనీ, సాలరీలు కూడా తగ్గిస్తామనీ చెప్పారు. రిటైర్మెంటు తీసుకోవడానికే నిశ్చయించుకున్నాడు.

అతను ఎనిమిదేళ్ళ క్రితమే సికింద్రాబాద్ లోని పార్శీగల్లీలో ప్లాటు కొనుక్కొని ఎల్.ఐ.సి.లో లోన్ తీసుకుని ఇల్లు కట్టుకు న్నాడు. ఇప్పుడు ఆ లోన్ మొత్తం తీరిపో యింది. కాకపోతే దురదృష్టవశాత్తూ అతని భార్య చనిపోయింది. ఆమెకి మయూర్ పుట్టిన పదకొండేళ్ళ తర్వాత సెకండ్ ప్రెగ్నెన్సీ వచ్చింది. డెలివరీ టైంలో కాన్పు కష్టమై ఆడపిల్లను ప్రసవించి చనిపో యింది. అతను మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. వాళ్ళ దూరపు బంధువులలో ఒకావిడకి భర్తా, పిల్లలు లేరు. ఎవరింట్లో ఏ అవసరం వచ్చినా వచ్చి సహాయపడుతుంది. వాళ్ళు ఆమెకి తోచింది ఇస్తారు. అతడు ఆమెని పిలిపించుకొని తన ఇంట్లోనే ఒక గది ఇచ్చి తన పిల్లల సంరక్షణకొరకు ఉంచాడు. ఇక ఆమే వంటపని, ఇంటిపని అన్నీ చూసుకుం టుంది. ఇక తను రిటైర్‌మెంట్ తీసుకున్న తరువాత వచ్చిన ఎనిమిది లక్షలలో రెండు లక్షలు తన కూతురు నిరాలీ పేరుపైన బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేశాడు. మూడులక్షలు వడ్డీ వచ్చేటట్లు బాంక్‌లో పెట్టి ఇంటిఖర్చులకు వాడుతున్నారు. మిగి లిన మూడులక్షలు ఇన్వెస్ట్ చేసి బ్యాంక్ లోన్ తీసుకొని ఈ బిజినెస్ తీసుకున్నాడు. ఈ ఫ్రాంచయిస్ అతనికి బాగానే కలిసి వచ్చింది.

అతడు గ్రీటింగ్ కార్డ్స్ ఫ్రాంచయిస్‌తో పాటుగా కాలేజీ స్టూడెంట్, యంగ్‌స్టర్స్‌కి కావల్సిన వస్తువులు, గిఫ్ట్ ఐటమ్స్ మెల్లమె ల్లగా ఇంట్రడ్యూస్ చేస్తూ షాప్ వాల్యూ పెంచాడు. మెల్లమెల్లగా తీసుకున్న లోన్ కూడా తీర్చసాగాడు. కానీ తనకు ఈమధ్యనే కాస్త సుగర్ లెవెల్స్ పెరిగాయి. హైపర్ టెన్షన్ కూడా ఉంది. దానివల్ల ఎక్కువ వర్క్ చేయలేకపోవడంవలన మయూర్ హెల్ప్ తీసుకోక తప్పలేదు. మయూర్ కాలేజీ అవగానే షాప్‌కి వస్తాడు. రోజూ ఏడుగంటలకి షాప్ మూసి ఇంటికి వచ్చేస రికి ఏడున్నరవుతుంది. తను, నిరాలీ, మయూర్ కలిసి డిన్నర్ చేసిన తర్వాత, ఆయమ్మ కూడా డిన్నర్ చేసి అన్నీ సర్దే స్తుంది. తనూ, నిరాలీ కాసేపు టీవీ చూసి పడుకుంటారు. నిరాలీ తనకేమైనా స్కూలు హోమ్‌వర్క్‌లో డౌట్స్ ఉంటే మయూర్‌ని అడుగుతుంది. మయూర్ రోజూ రాత్రి రెండుమూడు గంటలన్నా ఇంటర్నెట్ చూస్తూ ఉంటాడు. తర్వాతెప్పటికో పడుకుం టాడు.

కానీ ప్రతి శనివారం అతని ఫ్రెండ్స్ షాప్ కెళ్ళి మయూర్‌కోసం ఉండి అతడు షాప్ క్లోజ్ చేయగానే అందరూ కలిసి బయటే డిన్నర్ చేసి సెకండ్‌షో సినిమాకన్నా వెళ్తారు లేకపోతే బౌలింగ్ ఆలీకో, డిస్కోథె

క్లకో వెళ్ళి ఏ అర్ధరాత్రో ఇంటికి చేరతాడు. ఇలా వారంలో ఒక్కరోజు అతడు ఇంటికి ఆలస్యంగా వస్తాడు. సూరజ్ కుమార్ కూడా ఆ మాత్రం ఎంటర్టైన్మెంట్ లేకుంటే ఎలా అన్నట్లుగానే చూసీచూడన ట్లుగా ఉంటాడు.

ఆదివారంనాడు మయూర్ ఫ్రెండ్స్ అందరూ అతని ఇంటికే వస్తారు. మయూర్ ఇంటిపక్కనే పెద్ద ప్లేగ్రౌండ్ ఉంది. అక్కడ అందరూ క్రికెట్ ఆడతారు. తర్వాత సాయంత్రం ఇండోర్గేమ్స్ ఆడ తారు. అందరూ పూల్ చేసుకొని బయటి నుండి డిన్నర్కి భోజనం తెచ్చుకొని కలిసి భోంచేసి ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోతారు. నిరాలీని మయూర్తోపాటు మయూర్ ఫ్రెండ్సందరూ గారాబం చేస్తారు.

ఇలా సాదాసీదాగా గడిచిపోతున్న మయూర్ జీవితంలోకి అపూర్వ సుడిగాలి లాగా ప్రవేశించి అతన్ని చుట్టుకుపోయింది. అపూర్వ అతని షాపులోనుండి వెళ్ళిన మరు క్షణంనుంచే అతనిలో ఆమెను మళ్ళీ ఒక సారి చూస్తే బాగుండునన్న కోర్కె మొలకె త్తింది. ఆ మొలక నిమిషాలు, గంటలలోనే మహావృక్షంగా ఎదిగింది. కానీ అతనికి తెలుసు అది అంత తేలిగ్గా తీరే కోరిక కాదని, అయితే అతడు అపూర్వని ఆరోజు రాత్రే మళ్ళీ కలుసుకుంటానని కలలో కూడా ఊహించలేదు. ఆరోజు అతన్ని తన కాల నీలో ఉండే అమ్మాయి తన స్కూల్మేట్ నవ్య బర్త్డే పార్టీకి ఆహ్వానించింది. తను, నవ్యా ఒకే స్కూల్లో చదివారు. నవ్య కంటే తను సీనియర్ స్టూడెంటు. కానీ ఒకే కాల నీలో ఉండటంవలన ఒకే ఆటోలో స్కూలుకు వెళ్ళేవాళ్ళు తన స్కూలింగ్ అయిపోయి కాలేజీకి వెళ్తున్నాకూడా తను అదే కాలనీలో ఉంటున్నందువలన నవ్య వాళ్ళ మమ్మీ తనను వాళ్ళింటికి పిలిచేది. అప్పుడప్పుడూ కొసరి కొసరి వడ్డించి కడుపు నిండా తినిపించేది. ఆమె తన చెల్లెలు నిరా లీని కూడా ఎంతో ప్రేమగా చూస్తుంది. తమ రెండు కుటుంబాలవాళ్ళూ బాగా కలి సిమెలిసి ఉంటారు.

వారంరోజుల క్రితమే నవ్య తనతో చెప్పింది ఆరోజు తన బర్త్డే అనీ, పార్టీ అంతా ఫ్లోరల్ థీమ్లో ఉంటుందనీ, తనను ఆ పార్టీలో ఫ్లవర్స్ థీమ్కి సంబం ధించి ఏదైనా గేమ్ ఆర్గనైజ్ చేయాలనీ చెప్పింది. అతను నిన్న సాయంత్రానికే గేమ్కి కావల్సినవన్నీ రెడీ చేసుకున్నాడు. ఫైనల్గా గెలిచినవాళ్ళకి ఒక మంచి గిఫ్ట్ కూడా ప్యాక్ చేయించాడు. ఇలా ఆలోచి స్తూనే అతడు ఇల్లు చేరుకున్నాడు. ఐదు నిమిషాల్లో స్నానం చేశాడు. ఫ్లోరల్ థీమ్కి సూట్ అయ్యేటట్లుగా కార్గో పాంట్, పైకి మంచి పెద్దపెద్ద పువ్వులు ప్రింట్గా ఉన్న కలర్ఫుల్ షర్ట్ వేసుకున్నాడు. హెయిర్జెల్ పెట్టుకొని వెంట్రుకలు పైకి దువ్వాడు. మంచి జాస్మిన్ స్మెల్ ఉన్న పెర్ఫ్యూమ్ స్ప్రే చేసుకున్నాడు. అప్పటికే నిరాలీ, తనతండ్రీ, ఆయమ్మ అందరూ నవ్య ఇంటికి వెళ్ళిపోయారు. తను కూడా ఇంటికి లాక్ చేసుకుని వెళ్ళాడు.

తను అక్కడికి వెళ్ళేసరికి నవ్య క్లాస్మేట్స్ కొందరు వచ్చి ఉన్నారు. ఇంకా కాలనీలో తమ కామన్ ఫ్రెండ్స్ కొందరున్నారు. పార్టీ టెర్రస్పైన అరేంజ్ చేశారు. మయూర్ తన ఫ్రెండ్స్ సహాయంతో గేమ్కి అవసర మైన మ్యూజిక్ సిస్టమ్నీ, మైక్నీ అరేంజ్ చేసుకున్నాడు. ఫొటోలు తీయడానికి సరైన లైటింగ్ ఉందో లేదో చెక్ చేసుకున్నాడు. ఇంతలో నవ్య పైకి వచ్చింది "మయూర్! అంతా రెడీయేనా?" అంటూ.

"యా ఎవర్థింగ్ ఈజ్ రెడీ. నీ గెస్ట్ లంతా వచ్చినట్లేనా?" అనడిగాడు.

"ఒకమ్మాయి తప్ప అందరూ వచ్చారు. అక్చువల్లీ ఐ యామ్ వెయిటింగ్ ఫర్ హర్" అంటూ కిందికి వెళ్ళింది.

మయూర్, అతని ఫ్రెండ్స్ టెర్రస్పైన

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రూ. *3000/-* పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.**



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ **మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జులై చతుర నవల **ఇది జీవితం**

చిరునామా: ______________________

______________________

______________________

______________________

పిట్టగోడకి ఆనుకుని నిలబడి తీరిగ్గా మాట్లాడుకుంటున్నారు. కింద ఏదో కారు వచ్చి ఆగింది. అందులోంచి ఒకమ్మాయి దిగింది. అక్కడ కాస్త చీకటిగా ఉండడంవలన ఆ అమ్మాయి ఎవరో తెలియలేదు. ఐదు నిమిషాల తర్వాత అందరూ టెర్రస్‌పైకి చేరారు. ఇక పార్టీ స్టార్ట్ అవుతుంది. మ్యూజిక్ ప్లే చెయ్యాలి అనుకుంటూ తను అరేంజ్ చేసి పెట్టుకున్న సిస్టమ్‌లో సిడిల అరేంజ్‌మెంట్ చెక్ చేసుకుంటున్నాడు. అందులో ఉన్న పాటలు అన్నీ పువ్వులకు సంబంధించేట ట్లుగా రీరికార్డ్ చేయించి పెట్టుకున్నాడు. ఏ పాట ప్లే చెయ్యాలో ఆలోచిస్తూ యథాలాపంగా నవ్య వాళ్ళు వస్తున్నవైపు చూశాడు. ఒక్కసారిగా అతని కళ్ళు మిరుమిట్లు కొల్పినట్లుగా అయ్యాయి. అరే నవ్య పక్కన అపూర్వ...! అవును అపూర్వే. మధ్యాహ్నం తన షాపులో కొన్న గిఫ్ట్ పట్టుకొని ఉంది. అతడు నమ్మలేకపోతున్నాడు. అతను అపూర్వను ఇంత త్వరలో చూస్తానని కలలో కూడా అనుకోలేదు.

అతనికి ఆ నిమిషంలో ఒక్క గెంతులో ఎగిరి ఆకాశాన్నందుకోవాలన్నంత భావోద్వేగం కలిగింది. అతడు తనను తను కంట్రోలు చేసుకోవడానికి కౌంట్‌డౌన్ 100 నుంచి రివర్స్‌లో స్టార్ట్ చేశాడు. తనెప్పుడో చిన్నప్పుడు ఏదో బుక్‌లో చదివాడు. కోపంగాగానీ టెన్షన్‌గాగానీ ఉన్నప్పుడు 1 నుంచి 100 వరకూ కౌంట్ చేయడం చేస్తూ మన ఫీలింగ్స్ కంట్రోలు చేసుకోవచ్చని. కానీ తను 100 నుండి 1 వరకు రివర్స్‌లో చేసేవాడు. అతనికి అలాగే అలవాటయ్యింది. కాసేపటికి అతను కూల్‌డౌన్ అయ్యాడు. అతడు మ్యూజిక్ సిస్టమ్ వెనక చీకట్లో ఉండడంవలన అపూర్వకి కనబడడు. కానీ తనకిమాత్రం లైట్ల వెలుతురులో కూర్చున్న అపూర్వ స్పష్టంగా కనబడుతుంది. లైట్ బ్లూ కలర్ ఫ్లెయిర్ ఉన్న షైనీజీన్ వేసుకుంది. దానిపైన పెద్దపెద్ద రేకలున్న పువ్వులు పెయింట్ చేసి ఉన్న కలర్‌ఫుల్ టాప్ వేసుకుంది. బోట్ నెక్ ఉన్న ఆ టాప్ పైన ఆమె శంఖంలాంటి మెడ, ఒక చిన్న మచ్చ కూడా లేని ఆమె ముఖం ఆ లైట్ల వెలుగులో నునుపుగా మెరుస్తున్నాయి. తన పైనుండి జలపాతం దూకుతున్నట్లుగా ఉన్న ఆమె జుట్టు భుజాలపైనుండి నడుమువరకూ నల్లగా నిగనిగలాడుతూ జాలువారుతుంది. చెవిపక్కగా చిన్న క్లిప్ పెట్టి పెట్టుకున్న మినీ డేలియా పువ్వు నునుపైన కాంతులీనే ఆమె చెంపను తాకాలన్నంత ఆశగా ముందుకు వంగుతున్నట్లుగా ఉంది. అపూర్వను చూస్తున్న మయూర్ అనుకోసాగాడు చాలామంది ఆడవాళ్ళు అతిగా అలంకరించుకుంటే అందంగా కనబడతామని భ్రమపడతారు. కానీ అపూర్వని చూస్తే ఆ అభిప్రాయాన్ని మార్చుకోవాల్సి వస్తుంది. ఆమె ఎటువంటి ఆభరణాలూ పెట్టుకోలేదు. బొట్టూ, కాటుకా ముఖానికి రంగు పులుముకోవడాలూ ఇటువంటి అలంకరణ కూడా చేసుకోలేదు. కానీ ఆమె మెరిసే కురులు, ఆమె కళ్ళు, ఆమె చిరునవ్వు... ఇవే ఆమెకు పెట్టని ఆభరణాలు. మెరుస్తూ కాంతులీనే ఆమె చర్మమే ఆమెకు అలంకరణ అన్నట్లుగా ఉంటాయి. ఇంతలో అతని మదిలో ఒక చిలిపి ఆలోచన వచ్చింది. అతను వెంటనే దాన్ని అమలు చేశాడు. తను రికార్డ్ చేసి సెట్ చేసిన సీడీలలో ఒక దాన్ని సెలెక్ట్ చేసుకొని దాన్ని ఆన్‌చేశాడు. క్షణంతర్వాత పాట మొదలైంది.

'బహారో ఫూల్ బర్సావో
మెరా మహబూబ్ ఆయాహై
మేరా మహబూబ్ ఆయాహై..'

(వసంతమా పూలవర్షం కురిపించు, నా ప్రియురాలు వచ్చింది)

టెర్రస్‌పైన నలువైపులా అరేంజ్ చేసిన స్పీకర్స్‌లోనుండి ఆ మధురగాయకుడు మహమ్మద్ రఫీ పాడిన పాట వినబడడంతో బిజీగా మాట్లాడుకుంటూ ఉన్నవా

ళ్ళందరూ మెలొడియస్‌గా ఉన్న ఆ గాయకుని కంఠంనుండి వెలువడ్డ ఆ పాటలోని మాధుర్యాన్ని, ఒక ప్రేమికుడు తనప్రియురాలి గురించి పాడే ఆపాటలో ఆ కవి రాసిన భావాన్నీ ఆస్వాదిస్తున్నట్లుగా నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఏళ్ళనాటి పాత పాటైనా ఆ పాట, అందులోని భావం అందరికీ ఇష్టమైంది.

ఆ పాట పూర్తి కాగానే నవ్య తన బర్త్‌డే కేక్ కట్ చేసింది. కేక్ కూడా ఒక బాస్కెట్‌లో రెడ్‌రోజెస్ ఉన్నాయా అన్నట్లుగా ఐసింగ్ చేసి డెకరేట్ చేశారు. అక్కడ డిన్నర్ అరేంజ్ చేయడానికి వేసిన టేబుల్స్ పైన కూడా పెద్దపెద్ద పూలు పెయింట్ చేసిన టేబుల్ క్లాత్స్ వేశారు. అక్కడక్కడ అందమైన ఫ్లవర్‌బొకేలు అరేంజ్ చేశారు. అమ్మాయిలూ, అబ్బాయిలూ అందరూ పూలున్న షర్ట్స్ వేసుకున్నారు. పెద్దవాళ్ళు కొందరు అంటే నవ్య తల్లి, ఆయమ్మ వాళ్ళు పూలున్న చీరెలు వేసుకున్నారు. నిరాలీ పువ్వుల ప్రింట్ ఉన్న ఫ్రాక్ వేసుకుంది. నవ్య తండ్రి, మయూర్ తండ్రీ వాళ్ళు వైట్ షర్ట్స్ వేసుకొని చొక్కాకి ఒక్కొక్క గులాబీ పెట్టుకున్నారు. ఇలా అందరూ పార్టీ థీమ్‌కి సూట్ అయ్యేటట్లుగా తయారై రావడంతో ఆ టెర్రస్ ఎంతో కలర్‌ఫుల్‌గా, కన్నులపండుగలా అన్పించసాగింది.

అపూర్వ ఎప్పటిలాగే అక్కడి పరిసరాలను గమనించసాగింది. అది సికింద్రాబాద్ లోని చిన్న కాలనీ. అక్కడ అన్నీ సుమారుగా 500 చ.గజాల స్థలాల్లో కట్టిన ఇళ్ళు ఉంటాయి. అక్కడ ఎక్కువగా పార్శీవాళ్లు, చాలా ఏళ్ళనుంచి ఇక్కడికి వచ్చి సెటిలైన నార్త్ ఇండియన్స్, గుజరాతీవాళ్ళు ఉంటున్నారు. మిడిల్‌క్లాస్ వాళ్ళయినా వీళ్ళ లైఫ్ స్టయిల్ కూడా రిచ్‌గానే ఉంది. ఉన్నంతలో ఇల్లు నీట్‌గా టేస్ట్‌ఫుల్‌గా కట్టుకున్నారు.

తను నవ్య వాళ్ళింటికి ఇదివరకు ఒకసారి ఏదో నోట్స్ అవసరముంటే వచ్చివెళ్ళింది. కానీ పార్టీకి రావడం ఇదే మొదటిసారి. మిడిల్‌క్లాస్ వాళ్ళు కూడా ఇంత ప్లాన్డ్‌గా, ఇంత స్పెండ్ చేసి పార్టీ అరేంజ్ చేస్తారని తను ఊహించలేదు.

వచ్చిన గెస్టులు అందరూ నవ్వుతూ, తుళ్ళుతూ ఎంతో ఆనందంగా ఉన్నారు. తను తన ఇంటికి ఇంత ఫ్రీగా తన స్నేహితులందర్నీ ఇన్వాయిట్ చేయగలదా? తను పిలిచినా వాళ్ళు ఇంత ఫ్రీగా తనింట్లో ఎంజాయ్ చేయగలరా? అదీకాక నవ్య తల్లి తండ్రులు, ఆమె అన్నయ్య తననెంత బాగా రిసీవ్ చేసుకున్నారు. అపూర్వకెందుకో తన పెద్ద ప్యాలెస్‌లాంటి ఇల్లు కంటే నవ్య ఇంట్లో సుఖసంతోషాలు ఎక్కువ ఉన్నాయనిపిస్తుంది. నవ్య ముఖంలో వెల్లివిరిసే ఆనందం చూస్తే తనెప్పుడన్నా అలా ఉండగలుగుతుందా అన్పించసాగింది. అపూర్వ ఇలా ఆలోచిస్తుండగానే,

"హలో ఎవిరిబడీ" మైక్‌లోనుండి వినబడగానే అటువైపు చూసింది. అక్కడ మైక్ పట్టుకొని మయూర్ నిలబడి ఉన్నాడు. అతన్ని చూడగానే ఆమె మనసు పౌర్ణమి చంద్రుడ్ని చూసి ఉవ్వెత్తున ఎగిసిపడే అలలా ఎగిసిపడింది. అతన్ని చూసిన ఆమె కళ్ళలోకి కాంతి చెంగున దూసుకువచ్చింది. మైక్ పట్టుకొని ఆమెవైపే చూస్తున్న మయూర్ తనను చూడగానే ఆమె కళ్ళల్లో తళుక్కున మెరిసిన కాంతిని కనిపెట్టగలిగారు.

ఆ తర్వాత అతడు అందర్నీ సర్కిల్‌లాగా ఫామ్ చేసుకొని రౌండప్‌గా జరిగి కూర్చోమన్నాడు. ఒక పెద్ద ఫ్లవర్‌లాగా తయారుచేసిన మెత్తనికుషన్‌ని ఇచ్చి 'పాస్ ఆన్ ద పార్శిల్' గేమ్‌లాగా ఎలా ఆడాలో ఎక్స్ప్లెయిన్ చేశాడు. అతడు మ్యూజిక్ ప్లే చేయసాగాడు. కళ్ళకు గంతలు కట్టుకోవడంవల్ల అతడు కుషన్ ఎవరి చేతిలో ఉందో చూడలేదు. మ్యూజిక్ కాసేపు నడవగానే అతడు సడన్‌గా మ్యూజిక్ ఆఫ్ చేశాడు. అప్పుడు

కుషన్ ఎవరి చేతిలో ఉంటే వాళ్ళు అవుట్ ఆఫ్ ద గేమ్. కానీ వాళ్ళముందు చిన్నచిన్న చీటీలు వేసిన డబ్బా ఉంచుతారు. అందు లోంచి ఔట్ అయినవాళ్ళు ఒక చీటీతి య్యాలి. ఆ చీటీలో ఏ పువ్వు పేరు రాసి ఉంటే దానిపైన ఒక సినిమా పాట పాడాలి. పాడలేనివాళ్ళు పది గుంజీలు తీయాలి. అలా అందరూ అవుట్ అయినత ర్వాత లాస్టకి ఎవరు మిగిలితే వాళ్ళు గేమ్‌లో విన్నర్. వాళ్లకి అట్రాక్టివ్ గిఫ్ట్ ఇవ్వబడుతుంది. మొదటిసారి మ్యూజిక్ ఆఫ్ అయినప్పుడు కుషన్ నవ్యవాళ్ళ తల్లి చేతిలో ఉండిపోయింది. 'ఓ' అని గోల చేస్తూ, అరుస్తూ చీటీల డబ్బా ఆమె ముందుపెట్టారు. ఆమెచేత ఒక స్లిప్ తీయించారు. దానిలో 'మల్లెపూవు' అని రాసుంది.

ఆమె సిగ్గుపడుతూ "నేను పాడలేను, నాకు రాదు" అంది.

"ఆంటీ పది కౌంట్ చేసేవరకూ మీరు పాడకుంటే గుంజీలు తీయాల్సివస్తుంది. 'బి స్పోర్టివ్' ఆంటీ, పాడండి ప్లీజ్" అని పిల్ల లందరూ రిక్వెస్ట్ చేయసాగారు. ఆమె గొంతు సరిచేసుకొని సిగ్గుపడుతూనే పాడింది.

"మనసున మల్లెల మాలలూగెనే" అంటూ నాకింతే వచ్చు ప్లీజ్ ఇక నన్ను వదిలేయండి అంది. ఇక తను ఔట్ కాబట్టి ఆయమ్మతో కలిసి డిన్నర్ అరేంజ్ చేయడా నికి వెళ్ళింది.

మళ్ళీ గంతలు కట్టుకొని మ్యూజిక్ ఆన్ చేశాడు. ఈసారి మ్యూజిక్ ఆఫ్ అయిన ప్పుడు కుషన్ నవ్య ఫ్రెండ్ జ్యోతి చేతిలో ఉండిపోయింది. ఆ అమ్మాయి స్లిప్ తీస్తే అందులో 'ముద్దబంతి పువ్వు' అని ఉంది. ఆ అమ్మాయి కాసేపు ఆలోచించింది. నంబర్స్ కౌంట్ చేయసాగారు. నంబర్ ఫైవ్ అనేసరికి ఆమె పాట అందుకుంది, 'ముద్దబంతి పూవులో మూగకళ్ళ ఊసులో...' అని.

"అమ్మా తల్లీ నీ మూగకళ్ళ ఊసులతో మా గుండెల్ని బేజారు చేయకు తల్లీ. ఆపు తల్లీ... ఆపు" అంటూ మయూర్ ఫ్రెండ్స్ ఆ అమ్మాయిని టీజ్ చేస్తూ అరవసాగారు.

మళ్ళీ మ్యూజిక్ స్టార్ట్ అయ్యింది. ఈసారి కుషన్ నవ్య తండ్రి చేతిలో ఉండి పోయింది. అతడు మెల్లిగా తప్పించుకొని వెళ్ళసాగాడు. "అంకుల్‌జీ ఇది మోసం. అలా తప్పించుకోవడానికి వీలులేదు. చీటీ తియ్యాల్సిందేనని అతనిచేత చీటీ తీయిం చారు. అందులో 'లిల్లీ పూవు' అని ఉంది.

"అబ్బా నావల్ల కాదురా, నాకు రాదు. నన్ను వెళ్ళనీయండి" అన్నాడు.

"అలా అయితే గుంజీలు తీయాల్సిందే" అన్నారు పిల్లలు.

అతడు తప్పదనుకుని మెల్లిగా అందుకు న్నాడు.

"లక్స్ పాపా లక్స్ పాపా లంచ్‌కొ స్తావా?

లిల్లి పూవంటి సోకూ లీజుకిస్తావా? "

పిల్లలందరూ అరుస్తూ, ఈలలు వేస్తూ నవ్వుకుంటూ, "ఆంటీజీ మన అంకుల్ ఏం పాట పాడుతున్నారో వింటున్నారా? మీరు చాలా జాగ్రత్తగా ఉండాల్సిందే" అని అరవ సాగారు.

అందులో ఎవరో కొంటెకుర్రాడు, "అంకు ల్‌జీకి తెలుగుపాటల నాలెడ్జ్ బాగానే ఉందే. మనకంటే నయమే" అన్నాడు. ఇంక ఇలాగే ఆ గేమ్ చాలా ఇంట్రెస్టింగ్‌గా నడి చింది. పాడగల్గినవాళ్ళు పాడారు, లేనివాళ్ళు గుంజీలు తీశారు. ఆఖరికి ఇద్దరే మిగిలారు వాళ్ళు. అపూర్వ, నిరాలీ. మయూర్ కళ్ళకి గంతలు కట్టుకొని మ్యూజిక్ ఆన్‌చేశాడు. అందరూ గేమ్‌లో విన్నర్ ఎవరోనని ఎగ్జై టింగ్‌గా చూడసాగారు. అపూర్వక్కూడా టెన్షన్‌గా ఉంది. తనకైతే అలా పాడడం చేతకాదు. పాడకుంటే పనిష్‌మెంట్ కూడా కష్టంగానే ఉంది అనుకుంది. సడెన్‌గా

మ్యూజిక్ ఆఫ్ అయ్యింది. కుషన్ నిరాలీ చేతిలో ఉండిపోయింది. హమ్మయ్య విన్నర్ ప్రైజ్ ఏమోగానీ తను పాడడం తప్పింది అని రిలాక్సయ్యింది అపూర్వ. నిరాలీ తీసిన చీటీలో 'గులాబి పువ్వు' అని ఉంది. నిరాలీ ఫేస్‌లో గెలవలేదన్న నిరాశ కాస్త కనపడ్డా పాట మాత్రం చక్కగా పాడింది.

'రోజ్ రోజ్ రోజ్ రోజ్... రోజా పువ్వా' అంటూ పాడింది. అందరూ అభినందిస్తూ చప్పట్లు కొట్టారు.

"మిస్ అపూర్వ ఈజ్ విన్నర్ ఆఫ్ ద గేమ్" అని అనౌన్స్ చేస్తూ గేమ్ స్పాన్సర్ చేసిన మయూర్ ఆమెకి గిఫ్ట్ అందించాడు. అపూర్వ గిఫ్ట్ తీసుకొని నిరాలీని రమ్మని పిల్చింది. "అసలు ఈ గేమ్‌లో సరైన విజేత నిరాలీ. ఎందుకంటే నేను ఓడితే పాట పాడలేను అని గెలవాలనుకున్నాను. కానీ నిరాలీ డిజప్పాయింట్‌మెంట్‌లో కూడా ఎంతో చక్కగా పాడింది. ఈ గిఫ్ట్ తనకే చెందాలి" అని అంటూ ఆ గిఫ్ట్‌ని నిరాలీకివ్వ బోయింది. "నో దీదీ మీరు గెల్చుకున్న గిఫ్ట్ మీదే అవుతుంది. గేమ్ కాన్సెప్ట్ ప్రకారం విన్నర్ ఆఫ్ ద గేమ్ మీరే. ఐ కంగ్రాట్స్ యూ దీదీ" అంటూ షేక్‌హ్యాండ్ చేస్తున్న నిరాలీని చూసి విస్తుబోయింది అపూర్వ.

ఆ అమ్మాయికి సుమారు పదేళ్ళు ఉండుం డొచ్చు కానీ ఎంత ఆత్మాభిమానం. ఎంతో ముద్దుగా, అమాయకంగా కనబడుతున్న ఆ కళ్ళలో స్థిరత్వాన్ని చూసి ఆమెని మళ్ళీ గిఫ్ట్ తీసుకొమ్మని అడగలేకపోయింది. నవ్యవైపు తిరిగి,

"హూ ఈజ్ దిస్ గర్ల్ నవ్యా. వెరీ ఇంట్రెస్టింగ్" అనడిగింది. పక్కనే ఉన్న మయూర్ నిరాలీని దగ్గరకు తీసుకుంటూ, "షి ఈజ్ మై సిస్టర్" అన్నాడు గర్వంగా.

అంతలో నవ్య ఏదో గుర్తుకు వచ్చినట్లుగా "ఓ...! మర్చేపోయాను. నీకు ఇతన్ని పరి చయం చేయలేదుకదూ. హి ఈజ్ మయూర్. నా చిన్ననాటి స్నేహితుడు, నా స్కూల్ మేట్, మా నైబర్ కూడా" అని గబ గబా చెప్పేసింది. ఆ తర్వాత అందర్నీ డిన్న ర్‌కి పిలిచారు. అందరూ వెళ్ళి ప్లేట్లలో వేడి వేడిగా ఉన్న పదార్థాలను వడ్డించుకొని వచ్చి తీరిగ్గా కుర్చీలలో కూర్చొని మయూర్ ప్లే చేస్తున్న పాటలను ఎంజాయ్ చేస్తూ భోజనం చేశారు. అపూర్వ డిన్నర్ చేసిన తర్వాత కాసేపటికి వెళ్తానని లేచింది. అపూర్వ వెళ్ళేటప్పుడు నవ్య అపూర్వ గెలు చుకున్న బహుమతిని గుర్తుచేసి మరీ చేతి కిచ్చింది. అపూర్వ వెళ్తున్నప్పుడు స్పీకర్ లోంచి వినబడుతున్న పాట అపూర్వ మన సుని వెనక్కు పట్టి లాగుతున్నట్లుగా అనిపిం చింది.

'ఫూల్ తుమే భేజాయే ఖత్‌మే,
ఏ ఫూల్ నహీ మేరా దిల్ హై'
(పువ్వులు నీకు పంపాను లేఖద్వారా, అవి పూలు కావు నా హృదయం)

ఆరోజు మయూర్ సెలెక్ట్ చేసి వేసిన పాటలు ప్రతి ఒక్కటీ ఒక ఆణిముత్యమే. ఆ ఆహ్లాదకరమైన వాతావరణంలో ఆ పాటలు వింటూ అక్కడే కూర్చుండిపోవాల న్పించింది. మనసు వెనకకు లాగుతున్నా తన శరీరంతో బలవంతంగా తన మన సును లాక్కెళ్ళింది. ఆమె కార్లో వెళ్తున్న ప్పుడు దోవలో పదేపదే అనుకోసాగింది ఇది తన జీవితంలో మరచిపోలేని రోజని. తను కారుదిగి ఇంట్లోకి వెళ్లేసరికి వైజయంతి కూడా అపూర్వకోసం ఎదురుచూస్తూ కూర్చుంది. అపూర్వని చూస్తూనే,

"ఏమిటి అప్పూ... ఇంత లేట్ అయ్యింది. నేను ఫోన్ చేద్దామన్నా కూడా నీ సెల్ ఇంట్లోనే మర్చిపోయి వెళ్ళావు. ఆఖరికి నువ్వయినా అక్కడ్నించి రావడం లేటవుతుందని ఒక ఫోన్ కాల్ చేసుండొ చ్చుగా" అంది కాస్త కోపంగా.

"ఐ యామ్ సారీ మమ్మీ అక్కడ పార్టీలో కూర్చుంటే నాకు టైమే తెలియలేదు" అంటూనే త్వరగా మెట్లెక్కి పైకి తన గది

లోకి వెళ్ళిపోయింది. అలా అపూర్వ తన దగ్గర ఒక్క నిమిషం కూడా ఆగకుండా గబ గబా తన గదిలోకి వెళ్ళడం నచ్చలేదు. అంతేకాకుండా అక్కడే హాల్లో ఓ పక్కగా కూర్చున్న చౌదరిగార్ని కూడా అపూర్వ గమ నించకుండా పైకి వెళ్ళిపోవడం వాళ్ళిద్దరికీ మింగుడుపడలేదు.

అపూర్వ నిర్లక్ష్యానికి అతని దవడ ఎముక కాస్త బిగుసుకుంది. అతనికి అపూర్వది కేవలం నిర్లక్ష్యమే అన్పించలేదు. ఆమెలో మైమరుపు, కాస్త కంగారు గమనించాడు.

"వైజయంతీ... నువ్వు పైకి వెళ్ళు. నేను ఐదు నిమిషాల్లో వస్తాను" అన్నాడు.

ఆమె పైకి వెళ్ళేవరకూ ఆగి బయట సెక్యూరిటీకి డయల్ చేసి అపూర్వ డ్రైవర్ గారేజ్‌లో కారు పెట్టాడా అనడిగి ఆ పని అయింతర్వాత ఇంట్లోకి పంపమన్నాడు.

ఆ డ్రైవర్ రెండు నిమిషాల్లో ఇంట్లోకి వచ్చాడు.

"ఏరా పార్టీ బాగా జరిగిందా" అనడిగాడు.

"చాలా బాగా జరిగిందండి. వాళ్లు నన్ను కూడా అక్కడే భోంచెయ్యమంటే చేశానండీ" అన్నాడు.

"ఎంతమంది అమ్మాయిలు వచ్చారు" అడిగాడు చౌదరిగారు.

"అమ్మాయిలూ అబ్బాయిలూ కలిసి సుమారు పాతిక మంది ఉండొచ్చండీ"

చౌదరి గారు కాస్త దీర్ఘంగా నిశ్వసించి ఆ తర్వాత అపూర్వ వెళ్లిన ఆ ఇంటి అడ్రస్, లొకేషన్ వివరాలు తెలుసుకొని డ్రైవర్ని పంపించి వేశాడు.

ఇవన్నీ తెలియని అపూర్వ తన గదిలోకి వెళ్లగానే తనకి మయూర్ బహుమతిగా ఇచ్చిన గిఫ్ట్ బాక్స్‌ని త్వరగా రాపర్ విప్పి అందులో ఏముందోనని క్యూరియాసిటీతో చూసింది. అందంగా తయారుచేసిన గాజు పువ్వులు ట్రాన్స్‌పరెంట్ గ్లాస్‌తో తయారైన కాడకు మూడు రెడ్‌కలర్ గ్లాస్‌తో తయారైన రోజాపూలు. లేత ఆకుపచ్చరంగు కాడకు ఎర్రని అరవిచ్చిన గులాబిల గుత్తి అది. ఎంతో అందంగా ఉంది. ఆమె మదిలో మరోసారి "ఫూల్ నహీ మేరా దిల్ హై" అన్న వాక్యం మార్మోగింది.

మయూర్‌కి ఆ పార్టీకి తను వస్తున్నట్లుగా కూడా తెలియదు. అక్కడ జరిగిన వన్నీ కాకతాళీయమే కానీ అన్నీ తన మనసు కోరుకున్నట్లుగా జరిగినట్లు అన్పించింది అపూర్వకి. ఆమె ఆ పూలగుత్తిని తన డ్రెస్సింగ్ టేబుల్ పైన ఖాళీగా ఉన్న ఫ్లవర్ వాజ్‌లో ఉంచింది. తర్వాత బాత్‌రూంలోకి వెళ్లి ఫ్రెష్ అయ్యి వచ్చి నైటీ వేసుకొని లైటాఫ్ చేసి పడుకుంది. బెడ్‌లైట్ కాంతిలో కూడా మెరుస్తూ కనబడుతున్న ఆ పూలను చూస్తూ అలాగే నిద్రపోయింది.

కింద డ్రైవర్ని పంపించి వేసిన చౌదరి గారు పైకి వచ్చి తన గదిలోకి వెళ్తూ తలుపులు వేసి ఉన్న అపూర్వ గది వైపు సాలోచనగా చూశాడు. ఈమధ్య తను ఇంటికి త్వరగా వస్తున్నాడని అపూర్వకి తెలుసు. అయినా భయం లేకుండా అర్ధరాత్రి వరకూ పార్టీకి వెళ్లి ఎలాంటి జంకూ గొంకూ లేకుండా తల్లికి ఒక్క మాటలో సమాధానం చెప్పి పైకి వెళ్లడం అసలే నచ్చలేదు. అపూర్వ కారు డ్రైవరుతో మాట్లాడింతర్వాత చౌదరిగారు బాగా ఆందోళన చెందసాగారు. ఇకనించీ తాను అపూర్వ విషయంలో చాలా కట్టుదిట్టంగా ఉండాలి. నలుగురు అబ్బాయిలూ, అమ్మాయిలూ కలిసి తిరగడం, ఫ్రెండ్లీగా ఉండటం ఈ రోజుల్లో పట్టించుకోవల్సిన విషయం కాదు. కానీ ముఖ్యంగా ఈ ఎటూకాని వయసులో వాళ్ల ఆలోచనలు చాలా అస్తవ్యస్తంగా ఉంటాయి. ఏదైనా బలమైన ఆకర్షణకు ప్రలోభపడితే జీవితాలే తారుమారవుతాయి. అపూర్వ లాంటి అమ్మాయికోసం మగపిల్లలు క్యూకట్టి నిల్చుంటారు. ఎవరైనా వల పన్ని ట్రాప్

చేస్తే తనేం చెయ్యగలడు. అతను ముఖ్యంగా అపూర్వ వివాహం గురించి ఎన్నో కలలు కంటున్నాడు. అవి కల్లల యితే తను భరించగలడా. ఇక తను ఏమాత్రం ఉపేక్షించకూడదు. అపూర్వ చుట్టూ కోటగోడ లాంటి రక్షణ కల్పించాలి. ఆమెకు తగిన వరుణ్ణి ఎంపికచేసి వివాహం నిశ్చయం చేయాలి. ఇలా ఆలోచిస్తూ అతను తన ఫ్రెండ్స్ సర్కిల్ పైన ఇంకా తనకు తన స్టేటస్‌కీ సరిపోయే బిజినెస్ సర్కిల్ పై దృష్టిసారించి వాళ్లలో అపూర్వకి ఈడూ జోడూ సరిపోయేటట్లుగా ఉన్న అబ్బాయిల వివరాలు సేకరించాలని నిర్ణయించుకున్నాడు.

అదీకాక ఆందోళన ఆయనకు సమీర వైపునుండి కూడా తరుముకుంటూ వస్తోంది. ఆ విషయం కూడా ఎన్నడో పేలే అగ్నిపర్వతంలా అతన్ని భయపెడ్తోంది. అతడు సమీరతో తన అవసరాలు తీర్చుకున్నాడు కానీ తన మనసును పంచివ్వలేదు. ఆ అవసరాలకు ప్రతిఫలంగా ఆమె కోరుకున్న సంపదను ఇచ్చాడు. అతని దృష్టిలో ఆమె కేవలం ఒక ఉంపుడుగత్తె మాత్రమే. సమీర కూడా వయసులో ఉండగా పెద్దగా ఆలోచించకుండా ఈ రిలేషన్ కంటిన్యూ చేస్తూ వచ్చినా ఇప్పుడు మాత్రం ఆమెకు కూడా సంఘంలో ఒక స్థానం కావాలని బలీయంగా అన్పించసాగింది. వయసు పైబడ్తున్న కొద్దీ ఆమె కూడా ఇన్ సెక్యూర్డ్ ఫీలింగ్‌తో బెంబేలెత్త సాగింది. దాంతో చౌదరి గారి మీద ఒత్తిడి తేసాగింది. ఇలాంటి పరిస్థితిని చౌదరిగారు ముందుగా దూరదృష్టితో ఊహించలేకపోవడం వలన ఆయన బాగా ఆందోళన చెందసాగారు. తను జీవితంలో చేసిన ఒకే ఒక్క తప్పు తనను ఈవిధంగా పీడిస్తుందని కలలో కూడా అనుకోలేదు. అతడొకసారి పక్కన గాఢ నిద్రలో ఉన్న వైజయంతి వైపు చూశాడు. అబ్బా ఆ మొహంలో ఎంత ప్రశాంతత, ఎంత నిర్మలంగా ఉంది. నిజంగా ఏ పాపమూ తెలియని వాళ్లకే అంత సుఖమైన నిద్ర ప్రాప్తిస్తుందేమో. ఫానుగాలికి ఆమె ముంగురులు విశాలమైన ఆమె నుదుటిపై వాలి సయ్యాటలాడుతున్నాయి. అతడు చేత్తో ఆమె ముంగురులను తలపైకి సర్ది ఆమెను ఆపాద మస్తకం తదేకంగా చూడసాగాడు. తెల్లటి నైటీ లోంచి బయటకు వచ్చిన తెల్లటి పాదాలకున్న సన్నటి బంగారపు మెట్టెలు, సమున్నతమైన ఆమె వక్షస్థలం పైన మెరుస్తూ కనబడుతున్న మంగళసూత్రాలు ఆమె అందానికి పవిత్రతను తెచ్చిపెట్టాయా అన్నట్లుగా మెరుస్తున్నాయి. అతడొకసారి బాధగా నిట్టూర్చాడు. తను ఆమెనెంతగా నిర్లక్ష్యానికి గురిచేశాడు. ఆమెతో ఎన్నడూ సవ్యంగా కాపురం చెయ్యలేదు. చిన్న వయసులోనే అన్ని విధాలా సక్సెస్ అయిన తన కళ్లు గర్వాంధకారంతో మూసుకుపోయాయి. ఆమె తనకు తగదనుకున్నాడు. అదేదో రొటీన్ చర్యలాగా ఆమె తన భార్య కాబట్టి భరించక తప్పదు అన్నట్లుగా ప్రవర్తించాడే గానీ తన మనసునూ, ప్రేమనూ ఆమెకు పంచలేకపోయాడు.

కానీ వైజయంతి తననే సర్వస్వమని నమ్మింది. మనసా వాచా కర్మణా తనకు సర్వస్వం అర్పించింది. తన నిర్లక్ష్యాన్ని, దురహంకారాన్ని మౌనంగా భరించింది. అతడిలా ఆలోచనలో ఉండగా ఆమె నిద్రలో కాస్త పక్కకు మలిగింది. ఆమె చెయ్యి వచ్చి అతని ఛాతీపై పడింది. మృదువుగా తగిలిన ఆ చేతిని పట్టుకొని 'ఐయామ్ సారీ' అని తనలోతను గొణుక్కున్నట్లుగా అనుకోసాగాడు. ఈ మాటలు ఆమెతో పైకి చెప్పగల్గినప్పుడే తను క్షమార్హుడు. కానీ ఇంకా తనలో మిగిలి ఉన్న మేల్ ఈగో తనని ఆ పని చెయ్యనియ్యట్లేదు. కానీ అతడిప్పుడు ఆమెను మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాడు. బెడ్ లైట్ వెలుగులో కాంతులీనుతున్న ఆమె చెంపలను ముని వేళ్లతో ఒకసారి నాజూగ్గా

స్పృశించి ఆమెను తమకంగా దగ్గరకు తీసుకున్నాడు.

ఆ పార్టీ తర్వాత అపూర్వ ఒక వారం రోజుల వరకూ మయూర్ షాపుకి వెళ్లలేక పోయింది. కానీ ఆమె మనసంతా మళ్లీ మయూర్‌ని చూడాలనీ అతనితో మాట్లాడాలనీ తహతహలాడింది. కానీ సరి అయిన కారణం లేకుండా కేవలం అతన్ని చూడడానికే ఆ షాపుకి వెళ్లడానికి ఆమెకి అహం అడ్డొచ్చింది. ఆ షాపుకి మళ్లీ వెళ్లడానికి అవకాశం కొరకు ఎదురు చూడసాగింది. అక్కడ మయూర్ పరిస్థితీ అలాగే ఉంది. ఆ రోజు అపూర్వ తన షాపు రిజిష్టర్ బుక్‌లో రాసిన ఆమె వివరాలు చదివిన తరువాత అతనికి ఖచ్చితంగా తెలుసు ఆమె తనకు అందనంత ఎత్తులో ఉందని, కానీ నవ్య బర్త్‌డే పార్టీలో తనను చూడగానే ఆమె కళ్లలో తళుక్కున మెరిసిన కాంతిని - తను గ్రహించకపోలేదు. అతని హృదయంలో ఆమెకు తనంటే ఇష్టం అన్న ఆశ మినుకుమినుకు మంటోంది.

ఆ ఆశతోటే అతడు షాపులో ఉన్నప్పుడు తన షాపు గ్లాస్‌డోర్ తెరుచుకున్నప్పుడల్లా అపూర్వ వస్తుందేమో అన్న ఆశతో చూస్తాడు. అపూర్వ కాకపోయేసరికి ఎంతో నిరాశ పడ్తాడు. ఒక్కొక్కసారి ఎవరైనా అమ్మాయి వస్తుంటే అపూర్వే అని కూడా భ్రమపడసాగాడు.

నవ్యబర్త్‌డే పార్టీలో తీసిన ఫొటోలో నుండి అపూర్వ ఉన్న ఫొటో ఒకటి ఎవరికీ తెలియకుండా తీసుకొని తన పర్సులో పెట్టుకున్నాడు. ఎంతో చలాకీగా తిరుగుతూ పని చేసుకునే మయూర్ ఈ మధ్యన పరధ్యానంగా ఉంటున్నట్లు అతని స్నేహితులు గమనించారు.

మయూర్ షాపులో ఎప్పటిలాగే ఆ శని వారం కూడా ఫ్రెండ్సందరూ మీట్ అయ్యారు.

"హృతిక్‌రోషన్‌ది కొత్త సినిమా వచ్చింది. ఎక్కడైనా డిన్నర్ చేసి సెకెండ్‌షో సినిమాకి వెళ్లాలని ఫ్రెండ్సందరూ డిసైడ్ చేశారు.

"నేను రానురా-మీరు వెళ్లండి నేను ఇంటికెళతాను" అన్నాడు మయూర్ పెద్దగా ఇంట్రస్టు లేనట్లుగా.

"అరే అదేమిటి భాయ్ ఏ ప్రోగ్రాం వేసినా అందరికంటే ముందుగా నువ్వే రెడీ అయ్యేవాడివి ఏమయ్యింది నీకు ఎనీ ప్రాబ్లం" అన్నాడు అతని ఫ్రెండ్ మనోజ్‌సింగ్.

"నోనో అదేం లేదు కాస్త తలనొప్పి అంతే. ఇంటికి వెళ్లి త్వరగా పడుకుంటాను. రేపటికల్లా అదే తగ్గిపోతుంది" అన్నాడు మయూర్.

"ఓకే, అయితే ఈ రోజు ఈ ప్రోగ్రాం కాన్సిల్ చేస్తున్నాం. కానీ రేపు మాత్రం నిరాలీకి ప్రామిస్ చేశాం గుర్తుందా 'గోకార్టింగ్' తీసుకొని వెళ్తామని. రేపు నీ మూడ్స్ ఎలా ఉన్నా రాక తప్పదు. అసలు నీకేమయ్యింది. ఇంత డల్‌గా ఉన్నావు ఆర్‌యూ ఇన్ లవ్" అన్నాడు ఇంకో ఫ్రెండ్ లక్ష్మణ్.

"అలాంటిదేం లేదులేరా. నాకు నిజంగా తల పగిలిపోతోంది. ప్లీజ్ లీవ్‌మీ ఎలోన్" అంటూ తల గట్టిగా పట్టుకున్నాడు.

"సరేలే నాయినా అంత ఓవర్ యాక్షన్ వద్దు"

ఇందులో ఏదో రహస్యముంది. ఇవాళ కాకపోతే రేపయినా బయటపడాల్సిందే. అనుకుంటూ అందరూ ఆ రోజుకి ఎవరిళ్లకి వాళ్లు వెళ్లిపోయారు.

మయూర్ కూడా షాపుమూసి ఇంటికి వెళ్లాడు. శనివారం నాడు అంత త్వరగా ఇంటికి వచ్చిన అతన్ని చూసి అతని తండ్రీ, నిరాలీ, ఆయమ్మా ఆశ్చర్యపోయారు.

"అరే చాలా త్వరగా వచ్చావేంటీ. ఈ రోజు శనివారమేకదా" అని డౌట్‌ఫుల్‌గా అడుగుతున్న తండ్రితో.

"కొంచెం హెడేక్‌గా ఉంది డాడీ! అందుకే త్వరగా వచ్చాను" అని నసుగుతూ పైకి తన గదిలోకి వెళ్లాడు. అతని వాలకం చూసి ఆయమ్మ, నిరాలీ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"ఈ రోజు శనివారం మయూర్ బాబు భోజనానికి రాడనుకొని అతనికోసం ప్రత్యేకంగా ఏమీ చెయ్యలేదు బేటీ. త్వరగా ఏదైనా చేస్తాను" నిరాలీతో అంటూ ఆయమ్మ వంటింట్లోకి వెళ్లి త్వరత్వరగా రెండు చపాతీలు చేసింది. రెండు బంగాళాదుంపలు కట్‌చేసి వేపింది. అది వరకే ఉన్న దాల్‌ని వేడిచేసి చిన్న బౌల్‌లో వేసింది. ఒక గాజుగ్లాసులో గోరు వెచ్చని పాలుపోసి అన్నీ ట్రేలో సర్ది నిరాలీ సహాయంతో పైకి మయూర్ బెడ్‌రూమ్‌లోకే తీసుకొని వెళ్లింది. వీళ్లు వెళ్లేసరికి మయూర్ బట్టలు మార్చుకొని రాకింగ్ ఛైర్లో ఒరిగి తన పర్స్ తెరుచుకొని అందులోకి తదేకంగా చూస్తూ కూర్చున్నాడు. ఆయమ్మ చేతిలోని ట్రేని టేబుల్‌పై పెట్టిన శబ్దానికి ఉలిక్కిపడిన మయూర్ వెంటనే పర్సు మూసేసి జేబులోకి తోసేశాడు.

ఆయమ్మ మయూర్‌ని భోంచేయమని చెప్పి రూమంతా నీట్‌గా సర్దసాగింది.. ఇంతలో ఫోన్ రింగ్ అయింది. నిరాలీ వెళ్ళి రూమ్‌లో మయూర్ మంచం హెడ్ బోర్డ్‌పైనున్న ఫోన్ లేపింది. అవతలినుండి నవ్య మాట్లాడుతోంది. రేపు పదకొండు గంటలకి గోకార్డింగ్ ప్రోగ్రాం ఫిక్సయిందనీ, మయూర్‌నీ, నిరాలీనీ ఆ టైమ్‌కు రెడీగా ఉండమని చెప్పింది. నిరాలీ మయూర్‌కి అదే విషయం చెప్పింది.

మయూర్ ఏదో గతికినట్లుగా తిని బాత్ రూమ్‌లోకి వెళ్ళి చెయ్యి వాష్ చేసుకొని వచ్చి తనకు నిద్ర వస్తోందంటూ పడుకున్నాడు. నిరాలీ, ఆయమ్మ ట్రే పట్టుకొని కిందికి వచ్చేసి తమ గదిలోకి వెళ్ళిపోయారు. మయూర్ ఇల్లు చిన్నగా వున్నా ఎంతో నీట్‌గా సర్ది పొందికగా ఉంటుంది. ఇంట్లోకి ఎంటర్ కాగానే మొత్తం ఇల్లంతా కనబడుతుంది. ఒకపక్కగా నీట్‌గా సర్ది వున్న ఓపెన్ కిచెన్, కిచెన్‌కి హాలుని సపరేట్ చేస్తున్నట్లుగా వున్న గ్రనైట్ కౌంటర్ చుట్టూ నాలుగు కుర్చీలు భోంచేయడానికి అనువుగా వేసి వున్నాయి. చిన్న హాల్లో మధ్యకి చిన్నగా క్యూట్‌గా వున్న లెదర్ సోఫాసెట్టు, మధ్యలో చిన్న గ్లాస్ టాప్‌తో ఉన్న సెంటర్ టేబుల్ వేసి ఉంది.

హాల్లోకి కనెక్టింగ్‌గా రెండు బెడ్‌రూమ్‌లు. ఒకటి మయూర్ తండ్రి సూరజ్‌కు మార్‌ది, రెండోది నిరాలీది. హాల్లో ఒక మూలగా మయూర్ గదికి వెళ్ళేలా మెట్లు. మెట్లెక్కగానే మయూర్ రూమ్ ఉంటుంది. కిందినుండి చూస్తే మయూర్ రూమ్ కనబడుతుంది. మయూర్ రూమ్ బయటికివచ్చి నిలబడితే కిందంతా కనబడుతుంది. ఆయమ్మ నిరాలీ రూమ్‌లోనే ఒకపక్కగా పడుకుంటుంది. ఆ ఇంట్లోకి ఎవ్వరు వచ్చినా అబ్బా ఈ ఇల్లు ఎంత ప్లాన్డ్‌గా, ఎంత క్యూట్‌గా ఉంది అనుకుంటారు.

ఆరోజు రాత్రంతా మయూర్‌కి నిద్రలేదు. తన షాపు డోర్ తెరుచుకుంటూ వస్తున్న అపూర్వ ఆ దృశ్యం అతని మూసిన కళ్ళ ముందుకు వస్తుంది. అతను వెంటనే

నిజమా అన్నట్లుగా లేచి కూర్చుంటాడు. రాత్రంతా ఇలాగే గడిచి ఏ తెల్లవారుఝాముకో నిద్రపట్టింది. మయూర్ పరిస్థితి ఇక్కడిలా ఉంటే అక్కడ అపూర్వ పరిస్థితీ అలాగే ఉంది. ఆమెకు ఇంటర్నల్ ఎగ్జామ్స్ దగ్గరకు వస్తున్నా బుక్ తెరిచి చదవాలని పించదు. కంప్యూటర్ ముందు కూర్చుంటే ఆ స్క్రీన్‌పైన మయూర్ బొమ్మ వస్తే బాగుండును అన్పిస్తుంది. ఉన్నపళంగా ఆమెకు చూడాలనిపించసాగింది. కానీ ఎలా? ఆమెకి ఒక ఐడియా తట్టింది. రేపు ఆదివారం తను నోట్స్ రాసుకునే నెపంతో నవ్య ఇంటికి వెళ్తే ఆమె ఎదురింట్లోనే ఉన్న మయూర్ తనకు కన్పించవచ్చు అన్న ఆశ ఆమె మనసులో రెపరెపలాడింది. అలా నిర్ణయించుకున్న తర్వాత ఆమె నిశ్చింతగా నిద్రపోయింది.

★ ★ ★

ఆరోజు ఆదివారం. అపూర్వ త్వరగాలేచి ఎనిమిది గంటలకల్లా రెడీ అయిపోయి నవ్యకి ఫోన్ చేసింది. తను నోట్స్ కాపీ చేసుకోవడానికి వస్తానని చెప్పింది. త్వరగా వచ్చి కాపీ చేసుకొమ్మనీ తను పదకొండు గంటలకు బయటికి వెళ్తున్నాననీ చెప్పింది నవ్య. అపూర్వ త్వరగా కిందికి దిగి వంటింట్లో గిరిజమ్మ సహాయంతో బ్రేక్‌ఫాస్ట్ రెడీ చేస్తున్న వైజయంతితో

"మమ్మీ నేను మా ఫ్రెండ్ ఇంటికి నోట్స్ కాపీయింగ్ కోసం వెళ్తున్నాను" అని చెప్పి వెళ్ళబోయింది

"అదేంటి బ్రేక్‌ఫాస్ట్ చెయ్యకుండానే వెళ్తావా? " అంది వైజయంతి.

"అబ్బా నాకసలు ఆకలిగా లేదు మమ్మీ, నేను త్వరగానే వచ్చేస్తాను ప్లీజ్" అంది అపూర్వ.

అసలు అపూర్వ మనసులో ఉన్న విషయం ఆరోజు ఆదివారం చౌదరిగారు ఇంట్లోనే ఉండి అపూర్వతో కలిసి బ్రేక్‌ఫాస్ట్ చేస్తారు. ఆయన ఇంకాసేపటిలో కిందికి దిగుతారు. ఆయన కిందికి దిగారంటే బ్రేక్‌ఫాస్ట్ చేసి టీ తీసుకునే సరికి సుమారు గంటా, గంటన్నర సమయం పడుతుంది. తనకు బాగా ఆలస్యమవుతుంది. అక్కడ నవ్యావాళ్ళు వెళ్ళిపోతారు. ఇక అపూర్వ ఆగలేకపోయింది.

"మమ్మీ ప్లీజ్ నేను వెళతాను, కావాలంటే ఈ జ్యూస్ తాగుతాను" అంటూ అక్కడే జగ్‌లోకి తీసి ఉంచిన ఫ్రెష్ ఆరెంజ్ జ్యూస్ గ్లాసులోకి వంపుకొని అక్కడే ప్లేట్‌లో ఉన్న ఛీజ్, శాండ్‌విచ్ ఒకటి గబాల్న తీసుకొని క్షణాల్లో దాన్ని తినేసి గబాగబా జ్యూస్ తాగేసి గ్లాస్ గిరిజమ్మ చేతికిచ్చి,

"ఓకేనా మమ్మీ ఇక వెళ్ళచ్చా" అంది.

"అప్పూ... నీకేమన్నా పిచ్చిపట్టిందా, ఈరోజు డాడీ ఇంట్లోనే ఉన్నాడు. బ్రేక్‌ఫాస్ట్ చేయడానికి కాసేపట్లో వస్తారు. ఈరోజు ఆదివారం మర్చిపోయావా? " అంది వైజయంతి.

"మమ్మీ నాకీ నోట్స్ అర్జెంటుగా కాపీ చేసుకోవాలి. ఇలా మళ్ళీ ఎప్పుడూ సండే నాడు ప్రోగ్రామ్ వేసుకోను. ప్లీజ్ మమ్మీ ఎలాగైనా డాడీకి సర్దిచెప్పవూ" ఆమె తల్లిని బతిమిలాడసాగింది.

కూతురంతలా అడుగుతుంటే కాదనలేక ఒప్పుకుంది వైజయంతి.

"థాంక్స్ మమ్మీ" అంటూ పరుగులాంటి నడకతో బయటికి వెళ్ళింది అపూర్వ. ఆమె కార్లో కూర్చొని గేటుదాటి వెళ్ళడం, చౌదరి గారు అప్పుడే కిందికి రావడం జరిగాయి.

అతడు డైనింగ్‌టేబుల్ దగ్గరకు వస్తూనే 'అప్పూ' అని పిల్చాడు.

"అప్పూ లేదండీ. ఫ్రెండ్ ఇంటి...కి... నో...ట్స్. కాపీ" ఆమె అంటూండగానే అప్పటికే ఆ కాస్త వినడంతోటే భ్రుకుటి ముడివడ్డ అతడి ముఖంవైపు భయంగా చూస్తూ మాటలు మింగేసింది.

"అప్పూ ఎప్పుడెళ్ళింది? "

"ఇప్పుడేనండీ ఐదు నిమిషాలయిందేమో" అతడు వెంటనే అక్కడే ఉన్న సెల్ తీసుకొని అపూర్వ సెల్ నంబర్‌కి కలిపాడు.

అపూర్వ గదిలోంచి ఫోన్ రింగ్ అవుతున్న శబ్దం లీలగా వినబడ్డంతో "డామిట్ సెల్ ఇంట్లోనే మర్చి వెళ్లినట్లుంది" అన్నాడు విసురుగా.

"వైజయంతీ, నేనిదే చెబ్తున్నాను, అప్పూ ఇలా వెళ్ళడం నాకిష్టం ఉండదు. ఈసారికి ఊరుకుంటున్నాను. ఇంకోసారి మాత్రం ఇలాంటివి రిపీట్ కావద్దు" అన్నాడు.

ఆ తర్వాత అతడు బ్రేక్ ఫాస్ట్ సరిగ్గా చేయలేక పోయాడు. నామమాత్రంగా తిని 'టీ' పైకే పంపమని వెళ్ళిపోయాడు. కూతురికీ, భర్తకీ ఇష్టమని చేసిన పదార్థాలన్నీ టేబుల్ మీద చూస్తుంటే వైజయంతి మనసు ఉసూరుమంది.

అసలు విషయమేమిటంటే అపూర్వ తన తండ్రి తను వెళ్ళానని తెలియగానే తన సెల్‌కి ఫోన్ చేస్తాడని ఊహించి మరీ ఇంట్లో వదిలేసి వెళ్ళింది.

సుమారు తొమ్మిదిగంటలకల్లా అపూర్వ నవ్య ఇంటికి వెళ్లింది. నవ్య అపూర్వని పైన ఉన్న తనరూంలోకి తీసుకెళ్ళి నోట్స్ ఇచ్చి ఇక్కడైతే ఎలాంటి డిస్ట్రబెన్సూ ఉండదు అని తన రూమ్ బాల్కనీకి ఉన్న డోర్ తెరిచింది గాలీ వెలుతురూ రావడానికన్నట్లుగా.

ఆరోజు నవ్య బర్త్‌డే పార్టీరోజు. ఆ బాల్కనీలోనుండే తనకు మయూర్ వాళ్ళ ఇల్లు చూపించింది. మయూర్ వాళ్ళ బాల్కనీ, నవ్యావాళ్ల బాల్కనీ ఎదురెదురుగా ఉన్నాయి. అపూర్వ అక్కడెవరైనా కనబడతారేమోనని చూసింది కిటికీలోంచి ఆశగా. కానీ అక్కడెవరూలేరు.

ఇంతలో నిరాలీ వాళ్ళ బాల్కనీ చివరి వరకు వచ్చి "నవ్యా దీదీ" అని పిల్చింది. నవ్య అటువైపు తిరిగి ఏమిటీ అన్నట్లుగా సైగచేసింది.

చుట్టూ తిరిగి ఇంట్లోకి రా అన్నట్లుగా మళ్ళీ సైగచేసింది నిరాలీ. రెండిళ్ళ బాల్కనీలు ఎదురెదురుగా ఉన్నా మయూర్ ఇంటికి చుట్టూ తిరిగి వెళ్ళాలి.

ఎందుకంటే నవ్య వాళ్ళ ఇంటికి బాల్కనీ ముందు వైపుకి ఉంటే, మయూర్ వాళ్ళ బాల్కనీ ఇంటి వెనక వైపు ఉంటుంది. దానితో వాళ్ళ రెండిళ్ళూ ఎదురెదురుగా అన్పిస్తాయి కానీ ఇంట్లోకి వెళ్ళాలంటే రోడ్ చుట్టివెళ్ళాలి.

"అపూర్వా నువ్వు నోట్స్ కాపీ చేసుకుంటూ ఉండు నేను ఇప్పుడే పదినిమిషాల్లో వస్తాను. నిరాలీ ఎందుకో పిలుస్తూంది" అంటూ వెళ్ళింది.

అపూర్వకి కూడా నవ్య వెంట వెళ్ళాలన్పించింది. కానీ ఆమె రమ్మనకుండా ఎలా వెళ్ళటం. అయ్యో మంచి ఛాన్స్ మిస్ అయ్యానే అనుకుంటూ మళ్ళీ మయూర్ ఇంటివైపే చూస్తూ కూర్చుంది. మయూర్ బాల్కనీలో పెద్దపెద్ద పూలకుండీలలో చక్కటి ఎర్రగులాబీలు విరగబూసి ఉన్నాయి. అబ్బా ఆ మొక్కల సంరక్షణ ఎంత బాగా చేస్తున్నాడో. ఆ పూలు ఎంతందంగా పూశాయి అనుకోకుండా ఉండలేకపోయింది అపూర్వ.

నవ్య మయూర్ ఇంటికి వెళ్ళేసరికి నిరాలీ కింద హాల్లో మయూర్ ఫ్రెండ్స్‌తోపాటు దిగులుగా కూర్చొని ఉంది. "అరే... క్యా హువా"

"వై ఆర్ యూ పీపుల్ సిటింగ్ లైక్ దట్. ఎనీ ప్రాబ్లెమ్" అనడిగింది నవ్య.

"దీదీ, మయూర్ భయ్యా ఇంకా లేవలేదు. వీళ్ళంతా లేపడానికి వెళ్తే చిరాకు పడుతున్నాడు" అంది నిరాలీ.

"ఈరోజు ప్రోగ్రామ్ కాన్సిలయ్యేటట్లే వుంది. అసలేమయింది. వీడిలో ఇంత మార్పు" అన్నాడు మనోజ్.

"దీదీ అసలు భయ్యా పర్సులోనే ఏదో సీక్రెట్ ఉంది. ఈమధ్యన ఎప్పుడూ ఆ పర్సులోకే చూస్తూ ఏదో తనలోనే తను

మాట్లాడుకుంటాడు" అన్నది నిరాలీ దిగులుగా. ఆ అమ్మాయి కళ్ళలో తమ ప్రోగ్రామ్ కాన్సిల్ అవుతుందేమోనన్న వర్రీ కంటే తన అన్నకేమయిందోనన్న టెన్షన్ బాగా కనబడుతుంది.

"నేనిప్పుడే వస్తాను, మీరంతా ఇక్కడే ఉండండి" అని చెప్పి నవ్య పైకి మయూర్ రూమ్‌లోకి వెళ్ళింది. మయూర్ లేచి బాల్కనీలోకి వెళ్ళినట్లు ఉన్నాడు. బెడ్‌పైన అతని పర్స్ ఉంది. నిరాలీ చెప్పింది గుర్తుకు రావడంతో ఆ పర్స్‌లో ఏముందోనని దాన్ని తెరచి కుతూహలంగా చూసింది. అరే ఆశ్చర్యం అందులో అపూర్వ ఫొటో ఉంది. అంటే విషయం ఇదన్నమాట. ఈ మహాశయుడు అపూర్వతో ప్రేమలోపడ్డాడు. అయితే అపూర్వ కూడా...? అంతే నవ్య మైండ్‌లో తళుక్కున స్ట్రయిక్ అయింది. నిజమే అపూర్వ ఎన్నడూలేంది తనంతతానుగా ఇక్కడికి వచ్చి నోట్సు కాపీ చేసుకోవడం ఇదంతా ఒక బహానా మాత్రమే.

నవ్య ఇలా ఆలోచిస్తూ నిలబడిపోయింది. ఇంతలో అందరూ ఉలిక్కి పడేటట్లుగా బాల్కనీలోనుండి అద్భుతంగా ఒక అందమైన పాట వినబడింది.

"ఓ... ఏక్ లడికి... కో దేఖాతో ఐసా లగా

జైసే ఖిల్‌తా గులాబ్ జైసే

షాయర్ కా ఖ్వాబ్ జైసే

(ఒక అమ్మాయిని చూస్తే ఎలా అనిపించిందంటే, విచ్చుకున్న గులాబీలాగా ఒక కవి గన్న స్వప్నంలాగా)

ఆ పాట విన్న నవ్య కిటికీలోంచి చూసింది. అక్కడ బాల్కనీలో మయూర్ గులాబీ మొక్క దగ్గర నిల్చొని విచ్చిన గులాబీని తన చెంపకు ఆనించుకొని తన్మయత్వంతో పాడుతున్నాడు. కింద హాల్లో ఉన్న నిరాలీ, మయూర్ ఫ్రెండ్స్ అందరూ

పాట విని పైకి మయూర్ గదిలోకి ఊకుమ్మడిగా వచ్చారు. నవ్య వాళ్లని బాల్కనీలోకి వెళ్లకుండా ఆపింది. అందరూ కిటికీలోంచి మయూర్‌ని చూస్తూ ఆ పాటని ఆస్వాదిస్తున్నారు.

ఆ పాట అలాగే గాలిలో తేల్తూ నవ్య రూమ్‌లో కూర్చున్న అపూర్వ చెవులకి సోకింది. అపూర్వ కిటికీలోంచి చూసేసరికి అక్కడ తెల్లటి పైజామా, కుర్తాలో మయూర్ కనబడ్డాడు. అతడు పాడుతున్న పాటలోని భావానికి, అతని కంఠంలోని మాధుర్యానికి ఆమె ముగ్ధురాలైంది. ఆరోజు వాతావరణం కాస్త మబ్బు పట్టినట్లుగా ఉండి ఎక్కడో వర్షం పడిన సూచనగా చల్లటి గాలులు వీస్తున్నాయి. మబ్బుపట్టిన ఆకాశంలో సూర్యుడు రావాలా వద్దా అన్నట్లుగా ఒక మూలనుండి తొంగిచూస్తున్నట్లుగా ఉన్నాడు.

అక్కడ్నించి నులివెచ్చని సూర్యకిరణాలు ఏటవాలుగా వచ్చి మయూర్ పైన పడుతున్నట్లుగా ఉన్నాయి. దాంతో తెల్లటి బట్టల్లో ఉన్న మయూర్ మరీ తెల్లగా మెరిసే చర్మంతో నిగనిగలాడుతున్నట్లు కనబడుతున్నాడు. అతడి చేతుల్లో ఉన్న గులాబీ పుష్పం ఎనలేని సౌందర్యాన్ని ఆపాదించుకుంది.

పర్స్‌లో ఫోటోచూసిన నవ్యకి అర్థమయ్యింది. మయూర్ ఆ పాటను అపూర్వనుద్దేశించి పాడుతున్నాడని, నిజంగా ఆ పాట రాసిన కవి అపూర్వలాంటి అమ్మాయి నుద్దేశించినట్లే ఆ పాటలో ఎంతో అందమైన భావాన్ని పొందుపర్చాడు.

నవ్య అక్కడ ఎదురుగా ఉన్న డ్రెస్సింగ్ టేబుల్ అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. తను తెల్లగా చూడడానికి బాగానే ఉంటుంది. కానీ తనది అపూర్వలాంటి అద్వితీయమైన అందంకాదు. తను మయూర్‌ని ఇష్టపడ్డది కానీ మయూర్ అపూర్వనిష్టపడ్డాడు. తనది వన్ సైడెడ్ లవ్. కానీ వాళ్లిద్దరూ ఒకర్నొకరు ఇష్టపడుతున్నారు. ఆమె ముఖంలో ఒక్కసారి బాధావీచిక కద

లాడింది. కానీ ఆమె వెంటనే సర్దుకుంది. మయూర్ తనకేం అతని జీవితాన్ని బాండ్ రాసివ్వలేదు కదా. ఇన్నాళ్లూ మంచి ఫ్రెండ్స్ లాగా ఉన్నారు. ఇప్పుడూ అలాగే ఉంటారు. అపూర్వ, మయూర్‌ల ప్రేమ బలపడేందుకు తన శాయశక్తులా కృషి చేస్తుంది. ఇప్పుడు తను చేసే ఈ మంచి పనివల్ల వచ్చేజన్మలోనయినా తను ఇష్టపడ్డ వాణ్ణి పెళ్ళిచేసుకోగలుగుతుందేమో. తనకు తెల్సు తను చిన్ననాటి నుండీ ఎంతో ఇష్ట పడే మయూర్‌ని మర్చిపోవడం కష్టమని కానీ తప్పదు అందరికీ జీవితం వడ్డించిన విస్తరికాదు. ఆమె కళ్లనుండి ఉబికి వచ్చే రెండు కన్నీటిచుక్కలను ఒక వేలితో తుడి చేసి ఏమీ జరగనట్లుగా ఒక చిన్న కుదు పుతో తననుతాను సంభాళించుకుంది.

అక్కడ మయూర్ పాట పాడటం అయి పోగానే అందరూ పొలోమంటూ అతని చుట్టూ మూగి చప్పట్లు కొడుతున్న వాళ్లతో తనూ కలిసిపోయింది.

ఎదురింట్లో ఉన్న అపూర్వ కూడా పాట వింటూ తన్మయత్వంలో అలాగే గదిలోంచి బయటకు వచ్చి బాల్కనీలో నిలబడింది. తన ఫ్రెండ్స్‌తో ఏదో మాట్లాడుతూ తలపై కెత్తిన మయూర్‌కి ఎదురింటి బాల్కనీలో శిల్పంలా నిలబడ్డ అపూర్వ కనబడింది. ఎవర్నైతే ఊహించుకొని పాట పాడాడో ఆ అమ్మాయే తన కళ్లముందు ప్రత్యక్షమ య్యింది. అతను ఎంతో ఆనందంతో ఆమెవైపు చూస్తూ "హాయ్" అని విష్ చేశాడు.

ఆమె కూడా చిరునవ్వుతో చెయ్యి వూపింది. ఇక ఆ క్షణం నుండీ ఆ రోజంతా ఎంతో సందడిగా, ఆనందంగా గడిచిపో యింది. నవ్య, నిరాలీ వాళ్లు అపూర్వని కూడా వాళ్లతోపాటు 'గోకార్టింగ్'కి రమ్మని కోరారు. అపూర్వ అందుకు అంగీకరిం చింది. అందరూ కలిసి రెండు కార్లలో వెళ్లారు. గోకార్టింగ్ అనేది ఒక స్పోర్ట్. గోకా ర్ట్స్‌తో రేసింగ్ చేస్తారు.

హైదరాబాద్ ఔట్‌స్కర్ట్స్‌లో మేడ్చల్ వెళ్లే రూట్‌లో కొన్ని ఎకరాల స్థలంలో 'రన్‌వే నైన్' అనే పేరుతో నాలుగేళ్ల కిందట తెరిచారు. ఈ గేమ్ అంటే పిల్లలు, యంగ్ స్టర్స్‌కీ ఎంతో క్రేజ్ ఏర్పడింది. ముఖ్యంగా శని, ఆది వారాలలో బాగా రష్‌గా ఉంటుంది. టికెట్ కొని నంబర్ తీసుకొని క్యూలో నిలబడి వెయిట్ చేయాల్సొస్తుంది. అక్కడ తినడానికి స్నాక్స్, కూల్‌డ్రింక్స్, లంచ్‌కి ఫుడ్ కూడా దొరుకుతుంది. వీళ్లంతా ఆరోజు బాగా ఎంజాయ్ చేశారు. వాళ్లంతా సరదాగా రేసింగ్ పెట్టుకున్నారు. ఆ తర్వాత లంచ్ చేశారు.

ఆరోజు ఆకాశం మబ్బులు పట్టి ఏ నిమి షంలోనైనా పెద్ద వర్షం వచ్చేటట్లుగా ఉంది. అందరూ వాతావరణం చల్లగా ఉండటంతో స్వెటర్స్, జాకెట్స్ వేసుకొని వచ్చారు. అపూ ర్వకి ఈ ప్రోగ్రాం ముందుగా తెలియక పోవడంతో ఉదయాన వచ్చేటప్పుడు జీన్స్ పైకి షార్ట్‌గా ఉన్న స్లీవ్‌లెస్ టాప్ వేసుకొని వచ్చింది. ఆమెకు చాలా చలివేయసాగింది. బాగా వచ్చే ఈదరగాలికి అప్పుడప్పుడూ తీగ లాంటి ఆమె శరీరం సన్నగా వణకసాగింది. అది చూసినప్పుడల్లా మయూర్‌కి తన జాకెట్ విప్పి ఆమె భుజాలమీదుగా కప్పా లన్న కోర్కెను ఎవరన్నా ఏమన్నా అనుకుం టారేమోనని బలవంతంగా అణచుకు న్నాడు.

లంచ్ చేసింతర్వాత అందరూ 'రన్‌వే నైన్' పక్కనే ఉన్న మయూర్ ఫ్రెండ్ వాళ్ల గ్రేప్ గార్డెన్‌లోకి వెళ్లారు. అపూర్వకి ఆ ప్లేస్ చాలా నచ్చింది. సుమారు పదెకరాల స్థలంలో ద్రాక్షతోట డెవలప్ చేశారు. ఒక మూలగా చిన్న ఫామ్‌హౌజ్ కట్టారు. ఆ ఇంటిపక్కగా ఆర్టిఫిషియల్‌గా క్రియేట్ చేసిన ఒక లేక్ ఉంది. దానిచుట్టూ అందంగా రకరకాల చెట్లు పెంచారు. మయూర్ వాళ్లు అక్కడ ఖాళీ స్థలంలో

క్రికెట్ ఆడ్తుంటే నవ్య, నిరాలీ వాళ్లు ఇంటి ముందు ఇనుప పైపులకు గొలుసులతో ఉన్న ఉయ్యాల బల్లపై కూర్చొని ఊగుతు న్నారు. అపూర్వ మాత్రం ఆ తోటలో కారు తిరగడానికి వీలుగా వేసిన పాత్‌పై నడుస్తూ ఆ తోట అందాలు పరికిస్తూ ముం దుకు వెళ్ళిపోయింది. ఆమె తోట మధ్యలో ఉండగా ఆకాశంలో నుండి ఉరుముతున్న ట్లుగా శబ్దం వినవచ్చింది. ఆమె తల పైకెత్తి చూసింది.

కారు మేఘాలు కమ్ముకోవడానికి సిద్ధంగా పెద్దపెద్ద నల్లటి మేఘాలు పరుగుపరుగున వస్తున్నాయి. అపూర్వకి భయమేసింది. అపూర్వకి మొదటినుండీ ఉరుములంటే చాలా భయం. పిడుగుశబ్దం వింటే ఇప్ప టికీ ఒంటరిగా ఉండలేదు. ఎవరిదగ్గరకన్నా వెళ్ళి కూర్చుంటుంది. ఆమె కాస్త ఉరిమిన శబ్దం వినగానే వెనక్కి తిరిగి వడివడిగా నడవసాగింది. ఇంతలో ఒక్కసారిగా వర్షం మొదలయ్యింది. క్రికెట్ ఆడుతున్న వాళ్లం దరూ బాట్, బాల్ అక్కడే వదిలేసి ఇంట్లోకి పరిగెత్తారు. కానీ అపూర్వ ప్రతి క దలికా గమనిస్తున్న మయూర్ మాత్రం అపూర్వ దూరంగా వెళ్ళడం చూశాడు. అతడు వెంటనే అపూర్వ వెళ్లినవైపు పరుగె త్తాడు. అపూర్వకి ఒక్కసారిగా అంతపెద్ద వర్షం రావడంతో ఎటువెళ్ళాలో తెలియ లేదు. కానీ అంతలోనే మయూర్ వచ్చి ఆమె చెయ్యి పట్టుకొని ఎక్కువగా తడవ కుండా సమీపంలో ఉన్న పెద్ద చెట్టుకిందకు లాక్కెళ్ళి నిలబడ్డాడు. అనుకోకుండా జరిగిన ఆ సంఘటనతో అపూర్వ ఒక్క క్షణం నివ్వె రపోయినా వెంటనే తేరుకొని మయూర్‌కి 'థాంక్స్' చెప్పింది.

కానీ అప్పటికే కాస్త తడిసిన అపూర్వ చలికి వణకసాగింది. మయూర్ ఇంక సంకోచించకుండా తన జాకెట్ తీసి ఆమెకి ఇచ్చాడు. ఆమె ఇక చలి భరించలేనట్లుగా వెంటనే దాన్ని తీసుకొని వేసేసుకుంటూ మళ్ళీ మయూర్‌కి థాంక్స్ చెప్పింది.

"అపూర్వా డోంట్ బి టూ ఫార్మల్! వి ఆర్ ఫ్రెండ్స్ నౌ" అన్నాడు.

అతని నోటివెంట తన పేరు వినడం మొదటిసారి. అబ్బా అతని గొంతులో తన పేరు ఎంతందంగా వినబడింది. నిజంగా మయూర్ వాయిస్ చాలా బాగుంటుంది అనుకున్నది అపూర్వ. ఇంతలో మయూర్ ఒక పాటను హమ్ చేయసాగాడు.

"బర్‌సాత్‌కె మౌసమ్ మే
తన్‌హాయ్‌కే ఆలమ్ మే
మై ఘర్‌సె నికల్ ఆయా"
(వర్షం కురుస్తున్నవేళ, విరహ వేదనలో, నేను ఇల్లు విడిచి వచ్చాను)

గండుకోయిలలు కూస్తున్నట్లుగా ఉన్నటు వంటి కంఠంతో హమ్ చేస్తున్న ఆ పాట వింటూ తోటలో ఆ చెట్టుకింద తను మయూర్‌తో గడిపిన ఆ మధుర క్షణాలు తను తన జీవితంలో ఎన్నడూ మరువలేనం తగా ఆమె హృదయంలో హత్తుకుపోయి నాయి. కాసేపటికి వర్షం కాస్త తగ్గుముఖం పట్టింది. "ఇక వెళ్దామా అంటూ అడుగు ముందుకు వేయబోయేటంతలోనే ఆకా శంలో ఒక్కసారిగా ఉరుముల శబ్దంతో పాటు ఫెళఫెళమంటూ వీళ్లున్న చెట్టుకి దూరంగా ఉన్న పెద్ద మద్దిచెట్టుపై పిడుగు పడింది. ఆ దృశ్యాన్ని చూడటం, ఆ శబ్దాన్ని వినడం తట్టుకోలేక అపూర్వ భయకంపితు రాలై మయూర్ని గట్టిగా హత్తుకుపోయి వెంటనే స్పృహ కోల్పోయింది.

ఉన్నట్లుండి కూప్పకూలిన అపూర్వని చూస్తే ఒక్కక్షణం అతనికేం చెయ్యాలో తోచలేదు. ఇక అతనేం ఆలోచించకుండా ఆమెను రెండుచేతులతో అమాంతంగా ఎత్తుకొని ఇంట్లోకి తీసుకొని వచ్చాడు. అప్ప టికే అక్కడ అపూర్వ గురించి కంగారుప డుతూ ఉన్న నవ్య వాళ్లు అచేతనంగా ఉన్న ఆమెని చూసి మరింత కంగారుపడుతూ దగ్గరకు వెళ్లారు.

మయూర్ అపూర్వని అక్కడున్న మంచం పైన పడుకోబెట్టి ఆమె తడి ఒళ్లు, తడి జుట్టూ టవల్‌తో బాగా తుడవమని నవ్యకి చెప్పి, ఇక్కడ ఒక కప్పు వేడి టీ గానీ పాలు గానీ దొరుకుతాయా అని తన ఫ్రెండ్‌ని అడిగాడు.

అతడు వెంటనే ఆ ఫామ్‌హౌజ్‌లో పని చేసే కుర్రాడికి చెప్పి క్షణాల్లో వేడి టీ తెప్పించాడు. మయూర్, నవ్య అపూర్వని స్పృహ లోకి తెప్పించేందుకు ప్రయత్నించారు. కొన్ని క్షణాల తర్వాత స్పృహలోకి వచ్చిన అపూర్వ భయవిహ్వాలంగా వణుకుతూ ఉంది. అలా భయపడవద్దని చెప్తూ మయూర్ ఆమెతో అతి ప్రయత్నింగా వేడి టీ తాగించగలిగాడు. ఒక పావుగంటలో ఆమె పూర్తిగా కోలుకుంది.

వర్షం తగ్గుముఖం పట్టగానే వాళ్లు తిరిగి సిటీలోకి వెళ్లారు. అపూర్వ కారు నవ్యా వాళ్ళింటి ముందు ఆగింది. నవ్య, నిరాలీ దిగగానే అపూర్వ వెళ్తానంటూ బయలుదేరింది. అంతలో మయూర్ వచ్చి ఒక్కదానివీ వెళ్ళగలవా ఎవరమన్నా తోడు రావాలా అని అడిగాడు. అపూర్వ వద్దని వారించింది. "ఇప్పటికే మీకు చాలా శ్రమ కల్గించాను. డ్రయివర్ ఉన్నాడుగా వెళ్లగలను. ఎనీ వే థాంక్స్‌టు ఆల్ ఆఫ్ యూ'' అంటూ వెళ్ళిపోయింది. అపూర్వ ఇంటికి వెళ్లేసరికి రాత్రి తొమ్మిదిగంటలయ్యింది. కానీ అపూర్వ ముందుగానే తల్లికి ఫోన్‌చేసి ఫ్రెండ్స్‌తో కలిసి పిక్నిక్ వెళ్తున్నానని చెప్పడం వలన ఆమె కంగారుపడలేదు. కానీ ప్రతీ ఆదివారం అపూర్వ తనతోనే గడిపేది. ఆరోజు అపూర్వ మొత్తంగా ఇంట్లో లేకపోవడంతో వైజయంతికి ఆరోజంతా బోర్‌గా, వెలితిగా గడిచిపోయింది. అపూర్వ తన గదిలోకి వెళ్ళి ఫ్రెష్ అయ్యి నైటీ వేసుకొని డైనింగ్ హాలులోకి వచ్చి డైనింగ్ టేబుల్ కుర్చీలో కూర్చొని డిన్నర్‌కి ఏం ఐటమ్స్ ఉన్నాయో అన్నట్లుగా డిష్‌ల పైనున్న మూతలు తీసి చూడసాగింది.

హాల్లో కూర్చొని టి.వీలో సీరియల్ చూస్తున్న వైజయంతి అపూర్వ వంక కాస్త ఆశ్చర్యంగా చూసింది. ఎందుకంటే రోజు టేబుల్‌పై డిన్నర్ రెడీగా ఉంచి పైకి పదిసార్లు పనిమనిషితో డిన్నర్ రెడీగా ఉందని చెప్పి పంపినా కిందికి త్వరగా వచ్చేది కాదు. మళ్ళీ తను వెళ్ళి బలవంతంగా తీసుకొస్తే నిరాసక్తంగా కాస్త తిని లేచిపోయేది. కానీ ఈరోజు తనంతతానుగా వచ్చి ఆకలిగా ఉందంటూ గిన్నెలు చూడటం విచిత్రంగా ఉంది.

వైజయంతి లేచి కిచెన్‌లోకి వెళ్ళి రైస్‌కుక్కర్‌లో అప్పుడే వండిన వేడి రైస్ తెచ్చి టేబుల్‌పైనపెట్టి అపూర్వకి వడ్డించి తనూ భోజనానికి కూర్చుంది. ఎంతో ఆకలిగా ఉన్నట్లు అపూర్వ గబగబా తినసాగింది. ఆమె భోంచేసే పద్ధతి చూసి "అప్పూ పిక్‌నిక్‌లో మధ్యాహ్నం నువ్వు లంచ్ చెయ్యలేదా" అనడిగింది.

"చేశాను మమ్మీ కానీ బాగా తిరగడంవల్లనేమో మళ్ళీ ఆకలి వేస్తోంది" చిన్నపిల్ల తరహాలో అంటూ మళ్ళీ రైస్ వడ్డించుకుంది. వైజయంతి అపూర్వ ప్లేటులో చికెన్ ఫ్రై వడ్డిస్తూ అపూర్వ వంక చూసింది. ఆ ముఖం బాగా తిరగడంవల్ల అలసిపోయినట్లున్నా ఆమె కళ్లలో వెలుగు, ముఖంలో ఆనందం ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. ఈ ఆదివారం ఫ్రెండ్స్‌తో బయటకు వెళ్ళడంతో ఎప్పుడూ ఉండే రొటీన్ లైఫ్‌కి భిన్నంగా గడపగలిగినందువల్ల మార్పుతో అలా ఉందేమో! పోనీ మంచిదేగా ఈ రకంగానైనా అది సంతోషంగా ఉంటే తనకి కావల్సిందేముంది. కానీ అదృష్టకరమైన విషయం ఏమిటంటే అపూర్వ వచ్చే సమయానికి చౌదరిగారు ఇంట్లో లేరు. ఉంటే పెద్దరాద్ధాంతం జరిగి ఉండేది. ఉదయం పది గంటలకు బయటకు వెళ్ళిన చౌదరిగారు అట్నించటే సాయంకాలం

క్లబ్‌కి వెళ్ళినట్లున్నారు. ఇంకా ఇంటికి రాలేదు.

అపూర్వ భోంచేసి పైన గదిలోకి వెళ్ళిపోయింది. ఎప్పటిలా ఆమె రోజూ రొటీన్‌గా చూసే ఇంగ్లిష సీరియల్ ఆరోజు చూడలేదు. కంప్యూటర్ ముందు కూడా కూర్చోలేదు. ఆ రోజు వాతావరణం చల్లగా ఉండటంతో వెచ్చగా క్విల్ట్ కప్పుకొని పడుకొని ఆరోజు ఉదయంనుండీ జరిగిన విషయాలు గుర్తుకు తెచ్చుకుంటూ ఉండిపోయింది. తను పిడుగుపడిన శబ్దానికి భయపడి మయూర్‌ని గట్టిగా హత్తుకోవడంవరకే తనకు గుర్తుంది. తనకు స్పృహ వచ్చేసరికి ఆతృతతో తనవైపే చూస్తున్న మయూర్ కనబడ్డాడు. తనకి మెలుకువ వచ్చింతర్వాత అతను తనతో ఎంత లాలనగా 'టీ' తాగించాడు. అతని చేతుల మధ్యలో తనకెంత సెక్యూర్డ్ ఫీలింగ్ కలిగింది. నిజంగా అతని చేతలలో ఎంత ఆత్మీయత దాగి ఉంది. ఆమె అతని రూపాన్ని తన కళ్లలో దాచుకున్నట్లుగా కళ్లు గట్టిగా మూసుకొని అరచేతులు కళ్లపై పెట్టుకొని కాసేపటికి అలాగే నిద్రలోకి జారుకుంది.

నిద్రలో అపూర్వకి విచిత్రమైన కల వచ్చింది. ఆమెకి నీలాకాశంలో తారలు కనబడుతున్నాయి. ఆ తారల్లో ఎంతోమంది అమ్మాయిల ముఖాలు కనబడుతున్నాయి. అందులో తన స్నేహితురాలు నవ్య కూడా ఉంది. ఆ చుక్కల్లో చంద్రుడిలా మయూర్ అతి తెల్లని బట్టల్లో తేజోవంతంగా మెరుస్తూ కనబడుతున్నాడు. అతని చుట్టూ ప్రకాశవంతమైన 'గ్లో' ఉంది. అతని చుట్టూ అంతమంది అమ్మాయిలు ఉన్నా కూడా అతడు వాళ్ళని దాటుకొని ముందుకు వచ్చి తనని అతని వైపుకు ఆహ్వానిస్తున్నట్లుగా రెండు చేతులూ ముందుకు చాపి రమ్మన్నట్లుగా చూస్తున్నాడు. తను అతనివైపు గాలిలో తేలుతూ వేగంగా దూసుకెళ్తోంది.



ఇక అతడి చెయ్యి తనకందుతుంది అన్న సమయంలో చిత్రంగా తనను వెనుకనుండి బలంగా లాగుతున్నట్లనిపించసాగింది. తను ఎంతో ప్రయత్నించి మయూర్ చెయ్యందుకోవాలని చూస్తోంది. కానీ తన శరీరంలో శక్తంతా ఎవరో లాగేసుకున్నట్లు నిస్సత్తువగా, శరీరం కదలిక లేకుండా గడ్డకట్టినట్లుగా అన్పించసాగింది. ఇంతకూ తనను మయూర్ వద్దకు వెళ్తుంటే వెనకనుండి తనను పట్టి ఆపిందెవరు అనుకుంటూ వెనకకు మరలిచూస్తే అక్కడ తన తల్లి వైజయంతి నిలబడి ఉంది.

"మమ్మీ నువ్వా ఎందుకలా ఆపావు" అని అంటూ మళ్లీ మయూర్‌వైపు తిరిగింది.

కానీ విచిత్రం అక్కడ మయూర్ లేడు. ఆ నక్షత్రాలు, నీలాకాశం ఏవీ లేవు. అంతా చీకటిమయం. తను భయంగా ఆ చీకట్లో తడుముకుంటూ 'మయూర్' అని పిలుస్తుండగా తనను ఎవరో బాగా కుదుపుతున్నట్లుగా అన్పించింది. తను కళ్లు తెరచిచూసేసరికి వైజయంతి తన కళ్ళెదురుగా ఉంది. తను చుట్టూ పరికించి చూసింది. అది తన బెడ్‌రూమే. తను నిద్రపోయేముందు బెడ్ లైట్ ఆన్‌చేసి పడుకుంది. కానీ ఇప్పుడు రూమ్‌లో పూర్తి వెలుతురు ఉంది. మమ్మీ తనవైపు చూస్తూ కంగారుగా "ఏమయ్యింది అప్పూ ఏదైనా పీడకల వచ్చిందా ఎందుకలా అరిచావు" అనడిగింది.

అపూర్వకర్థమయ్యింది ఇప్పటివరకూ తను కలగన్నదనీ, ఆ కలలో తను మయూర్ అని పిలవటం మాత్రం బయటకే అరిచిందని, అదీకాక తన గొంతుకెందుకో తడి లేకుండా ఎండిపోయినట్లుగా అయ్యింది.

"మమ్మీ నాకు ముందు కొన్ని మంచినీళ్ళివ్వు" అనడిగింది.

వైజయంతి వెంటనే బెడ్‌కి అవతలివైపు ఉన్న చిన్నఫ్రిజ్‌లోంచి బాటిల్ తీసి నీళ్లు గ్లాసులో వంపి అపూర్వకిచ్చింది. అపూర్వ వెంటనే ఆ నీళ్లన్నీ గబగబా తాగేసి ఖాళీ

గ్లాసు తల్లికిచ్చి అంత చలిలో కూడా తనకు పట్టిన చెమటను తుడుచుకోసాగింది.

"ఏం కల అప్పూ అది 'మయూర్' అని ఎంతలా అరిచావు అసలేం జరిగింది"

"ఎ...ఏం లేదు మమ్మీ, అసలు నాకేం గుర్తులేదు" తడబడుతూ అన్నది అపూర్వ.

"ఒక్కనిమిషం అప్పూ ఇప్పుడే వస్తాను" అంటూ అపూర్వ గదికి ఎదురుగా ఉన్న తన గదిలోకి వెళ్ళింది. అపూర్వ అరుపు తనకు వినబడగానే తను కంగారుగా తన గదిలో లైట్ ఆన్‌చేసి అలాగే వచ్చేసింది. మంచంపైనున్న తన దుప్పటి చేతిలోకి తీసుకొని లైటు ఆర్పేసి రూమ్ డోర్ దగ్గరకు వేసి వచ్చి అపూర్వ పక్కన పడుకుంది.

అపూర్వ కాసేపట్లో నిద్రపోయింది. కానీ వైజయంతికి ఆ తర్వాత అస్సలు నిద్రరా లేదు. తనకి తెలియకుండా అపూర్వ విషయంలో ఏదో జరుగుతోంది. అపూర్వలో కూడా ఏదో మార్పు కనబడుతోంది అనుకుంటూ బెడ్‌లైట్ కాంతిలో అపూర్వవైపు చూసింది. అపూర్వ గాఢ నిద్రలో ఉంది. ఆ బెడ్‌లైట్ కాంతిలో కూడా ఆమె నునుపైన బుగ్గలు మెరుస్తూ కనబడుతున్నాయి. సన్నని పొడవైన నాసిక ఎంత నాజూకుగా ఉందంటే సంపెంగ పువ్వుతో పోల్చినా తక్కువే. దట్టమైన నల్లటి వెంట్రుకలున్న కనురెప్పలు మూసుకున్న ఆల్చిప్పల్లా పెద్దగా ఉన్నాయని చెప్పవచ్చు ఆమె ముఖంలో ఎంత వర్చస్సు ఉంది. అపూర్వ అందానికి ఆమె కన్నతల్లైన తనే ఇంత అబ్బురపడుతుంటే ఇక బయటివాళ్ల సంగతేమిటి? అప్పూ పెద్దదవుతోంది. ఇప్పటి నుండీ తను అపూర్వని బాగా కనిపెట్టుకొని ఉండాలి. అది వేసే ప్రతి అడుగునూ గమనించాలి. ఇలా చాలాసేపు ఆలోచిస్తూనే ఉంది. తెల్లవారుఝామున ఆమెకు కాస్త మాగన్నుగా నిద్రపట్టింది.

ఆమెకు మెలుకువ వచ్చేసరికి పక్కన అపూర్వ బాగా వణుకుతూ క్విల్ట్‌ని బాగా దగ్గరగా మెడవరకు కప్పుకుని మూడు అంకెలా ముడుచుకొని పడుకొని ఉంది. వైజయంతి అపూర్వ నుదుటిపై చెయ్యి ఉంచి చూసింది. వళ్లు వేడిగా తగిలింది. అరే బాగా జ్వరంగా ఉందే అనుకుంటూ మెడికల్ కిట్ తెచ్చి అందులోంచి ఒక 'క్రోసిన్' టాబ్‌లెట్ తీసి అపూర్వ చేత మింగించి నీళ్లు తాగించింది. ఆ తర్వాత ఇంటర్‌కమ్ ఫోన్‌లో సర్వెంట్ రూమ్‌కి కలిపి రెండు కప్పుల వేడి కాఫీ కలిపి అపూర్వ గదిలోకి తెమ్మని వంట వాడికి చెప్పి గిరిజమ్మని పైకి రమ్మంది. గిరిజమ్మ రాగానే అపూర్వని కనిపెట్టుకొని ఉండమని చెప్పి తను బాత్‌రూంలోకి వెళ్ళి ఫ్రెష్ అయ్యి వచ్చి అపూర్వ పర్సనల్ డాక్టర్‌కి ఫోన్‌చేసింది. అతడు క్లినిక్‌కి వెళ్లేముందు ఇంటికి వచ్చి అపూర్వని చూసి వెళ్తానని చెప్పాడు.

వైజయంతికి కాస్త కంగారుగా ఉంది. ఎందుకంటే ఆరోజు చౌదరిగారు ఇంకా బయటకు వెళ్లకుండా ఇంట్లోనే ఉన్నారు. ముందురోజు రాత్రి క్లబ్‌నుండి లేట్‌గా వచ్చి పడుకోవడంతో అతడు కాస్త లేటుగా నిద్రలేచాడు. అతడు వెళ్లేలోపల డాక్టరుగారు రావడం అతని దృష్టిలో పడితే అపూర్వకి జ్వరం వచ్చిందని తెలుస్తుంది. అలా జరిగితే అతను నానా హంగామా చేస్తాడు. అన్నిటికంటే ముఖ్యంగా వైజయంతిపై కోపం ప్రదర్శిస్తాడు. నువ్వు సరిగ్గా కేర్ తీసుకోలేదు. అందుకే ఇలా జరిగింది అంటాడు. అపూర్వ చిన్ననాటినుండీ అంతే. అపూర్వకి కాస్త నలతగా ఉన్నా 'నువ్వు దాన్ని సరిగ్గా పట్టించుకోకపోవడంవల్లే ఇలా జరిగింది, అయినా పల్లెటూర్లలో పెరిగిన నీలాంటివాళ్లకి పాపాయినెలా పెంచాలో ఏం తెలుస్తుంది' అనేవాడు.

ఆమెకి అతడు త్వరగా ఇంట్లోనుండి వెళ్తే బాగుండును. లేదా డాక్టరుగారన్నా కాస్త ఆలస్యంగా వస్తే బాగుండును అనుకోసా

గింది. కానీ ఆమె అనుకున్నవేవీ జరగలేదు. డాక్టరుగారు రానేవచ్చారు. అతడు అపూర్వ గదిలోకి వెళ్ళి అపూర్వని చెకప్‌చేసి రొటీన్‌గా వేసే ప్రశ్నలు వేశాడు. ఆ తర్వాత ఏవో కొన్ని టాబ్లెట్లు రాసి వైజయంతితో ఎలా వాడాలో చెప్తూ "ఏం భయంలేదమ్మా మామూలు జ్వరమే ఒక్కసారిగా వాతావరణంలో వచ్చిన మార్పువల్ల, అదీగాక నిన్నవర్షంలో తడిశానని అంటూంది కదా దానివల్ల మైల్డ్ ఇన్‌ఫెక్షన్ అంతే, మూడురోజులు ఈ టాబ్లెట్స్ వాడండి, తగ్గకపోతే టెస్టులు చేయిద్దాం" అని అతడు వెళ్లడానికి సిద్ధమయ్యాడు. అతడు గదిలోంచి బయటికి రావడమూ, ఎదురుగా ఉన్న గదిలోంచి చౌదరిగారు రావడమూ ఒకటేసారి జరిగాయి.

చౌదరిగారు డాక్టర్ని చూడగానే ఆశ్చర్యంగా "హలో" చెప్పి మళ్ళీ వెంటనే "ఏమిటి ఇలా వచ్చారు అపూర్వ రొటీన్ చెకప్ కా" అన్నాడు.

"అపూర్వ ఈజ్ సిక్. మీ మిసెస్ కాల్ చేస్తే వచ్చాను" అన్నాడు.

"అరే నాకు తెలియదే ఏమయ్యింది అపూర్వకి" అంటూ చౌదరిగారు అపూర్వ గదిలోకి వచ్చాడు. అతనితోపాటుగా డాక్టరుగారు కూడా లోపలికి వచ్చాడు.

బెడ్‌పైన గొంతువరకు దుప్పటి కప్పుకొని నీరసంగా పడుకొని ఉన్న అపూర్వని చూస్తూ "ఏమయ్యింది అప్పూకి" అన్నాడు మళ్ళీ.

"ఏం ఫర్వాలేదు, కాస్త జ్వరంగా ఉంది. వర్షంలో తడవడంవల్ల వచ్చి ఉంటుంది. యాంటీబయాటిక్ స్టార్ట్ చేశాను రెండ్రోజుల్లో తగ్గిపోతుంది" అన్నాడు డాక్టరు. డాక్టరుతో మాట్లాడిన తరువాత చౌదరి అతనికి థాంక్స్‌చెప్పి మర్యాదగా సాగనంపిన తర్వాత అప్పుడు మొదలయ్యింది అసలు కథ.

అతని ఉగ్రస్వరూపాన్ని చూసేవరకే వైజయంతికి చెమటలు పట్టసాగాయి. నౌకర్లందరూ ఎక్కడి వాళ్లక్కడ కుక్కిన పేనుల్లా ఉండిపోయారు. అతడు వైజయంతిని ఒక్కటే ఒక్క మాటడిగాడు "అసలు అప్పూ వర్షంలో ఎందుకు తడవాల్సివచ్చింది? "

ఆ మాటకు వైజయంతి ఏం సమాధానమివ్వలేదు. ఎందుకంటే ఏం మాట్లాడినా, మాట్లాడకపోయినా జరిగే రాద్ధాంతం జరిగి తీరుతుంది. కానీ వైజయంతిని వెనకేసుకొస్తూ గిరిజమ్మ అనేసింది "అపూర్వమ్మాయిగారు నిన్నంతా ఇంట్లోనే లేరు బాబూ. అమ్మాయి వర్షంలో తడవడం మాకెవరికీ తెలియదు" అనేసింది తొందరపాటుగా.

"అవునా వైజయంతీ మాట్లాడవేం నిన్న ఉదయాన వెళ్ళిన అపూర్వ ఇంటికెప్పుడు వచ్చింది? " ఇక తప్పదన్నట్లుగా నోరు విప్పింది వైజయంతి.

"రాత్రి తొమ్మిదింటికి".

"ఫ్రెండ్ ఇంటికి నడిచెళ్ళిందా కార్లోనే కదా వెళ్ళింది. వర్షంలో ఎందుకు తడిచింది అసలు మిమ్మల్నడగటం అనవసరం. 'గిరిజమ్మా నువ్వెళ్ళి అప్పూ డ్రైవర్ని పిలుచుకురా' అన్నాడు. క్షణాలమీద డ్రైవరు రావడం, నిన్నటి అపూర్వ ప్రోగ్రాం గురించి పూసగుచ్చినట్లు చెప్పడం జరిగిపోయింది.

అది విన్న చౌదరిగారు వైజయంతివంక తిరస్కారంగా చూస్తూ నిన్నంతా అది ఇంట్లో లేకుంటే ఏం జరిగింది, ఎటు వెళ్ళిందో తెలుసుకునే ఇంగితజ్ఞానం కూడా లేదు అని అపూర్వవైపు తిరిగి "అప్పూ నీకిదే చెప్తున్నాను, నీకే నోట్సు. అవసరమున్నా డ్రైవర్ని పంపి ఇంటికి తెప్పించుకో. అలా వీలుకాకపోతే నాకు చెప్పు మీ లెక్చరర్‌ని ఇంటికి పిలిపించి నోట్స్ రాయిస్తాను. అంతేగానీ ఇలా అలగా జనం ఇళ్లకీ, వాళ్లతో పిక్‌నిక్ స్పాట్‌లకీ నువ్వు వెళ్ళేదిలేదు. నువ్వు వాళ్లతో 'రన్‌వేనైన్'కి ఎందుకు వెళ్ళినట్లు, నిన్ను/నేను పోయిన సమ్మర్‌లో మలేషియాలో ఇంతకంటే ఎన్నోరెట్లు పెద్దదైన జెంటింగ్ ఐలాండ్స్ తీసుకెళ్లలేదా.

"నీకు ఫ్రెండ్స్ ఉండొద్దని నేను అనటం

లేదు. కానీ వాళ్లని కాలేజీవరకే పరిమితం చెయ్యి. అంతేగానీ మళ్లీ ఇటువంటి పరిస్థితి తీసుకురాకు" ఖచ్చితంగా చెప్పాడు.

"వైజయంతీ నువ్వే దగ్గరుండి అపూర్వకి టైమ్‌కి మందులు ఇవ్వు. నేను సాయంత్రం ఇంటికి త్వరగా వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

వైజయంతికి ఒళ్లు మండిపోయింది. ఏమిటీ మనిషి? మందులెప్పుడూ తనివ్వకుంటే ఈయనగారు దగ్గరుండి ఇస్తున్నారా. అయినా ఈ కాస్త విషయానికి పనివాళ్ళందరి ముందు ఇంత రాద్ధాంతం చేయడం ఏమాత్రం సబబుకాదే

ఇలా ఇంకా ఎన్నేళ్లు అతడెప్పుడూ అయిందానికీ కానిదానికీ అనడం, తను పడటం ఆమె మనసులో తిరుగుబాటు మొదలయ్యింది. కానీ ఆమెలోని సంస్కారం ఆమె నోరు కట్టేస్తుంది. తనూ అతనిలాగే తొందరపడితే పనివాళ్ళముందు పరువు పూర్తిగా పోతుంది. అపూర్వ బాధ పడుతుంది. ఆమె అపూర్వవైపు చూసింది. దాని కళ్ళల్లో నీళ్లు ఏ_సమయంలోనైనా కిందికి దూకేటట్లుగా ఉన్నాయి. ఆమె వెంటనే అపూర్వని దగ్గరగా తీసుకొని-

"నీకు బాగా జ్వరం వచ్చేసరికి డాడీ కంగారుపడ్డారు. నీకు తెలుసుగా ఆయనకు కోపం వస్తే ఎలా ప్రవర్తిస్తాడో. నువ్వేం మనసులో పెట్టుకోవద్దు" అని సముదాయించింది.

ఇక అపూర్వకి మాత్రం తన ఫ్రెండ్స్‌ని పట్టుకొని అలగా జనం అనడం చాలా బాధ కలిగించింది. తన తండ్రి స్వభావం తనకు తెలుసు. కానీ అతడు తననెప్పుడు అర్థం చేసుకోగలుగుతాడు. తన తండ్రి తనని మలేషియాకి తీసుకెళ్ళాడు నిజమే. కానీ అక్కడి స్టార్ హోటల్‌లోని సూట్, కేబుల్ కార్లు, అక్కడ తను చూసిన పార్కులూ, వాటర్ గేమ్స్ అన్నీ ఎంతో బాగున్నాయి. కానీ తన ఫీలింగ్స్‌ని షేర్ చేసుకునే కంపెనీ తనకు లేదే. నిన్న తను నవ్యా వాళ్ళతో ఎంజాయ్ చేసినంతగా తనెప్పుడూ ఎక్కడికి వెళ్ళినా ఎంజాయ్ చేయలేదు.

అప్పుడు అన్పించింది అపూర్వకి తనకు ఒక అక్కైనా, చెల్లెలైనా ఉంటే బాగుండునని. లేదా తన ఫీలింగ్స్ పంచుకోవడానికి మంచి స్నేహితులైనా ఉండాలని. డాడీ అనుకున్నట్లుగా డబ్బుంటే ఈ లోకాన్నంతా చుట్టిరావచ్చు తన తండ్రి లక్షలు ఖర్చుపెట్టి తనని విదేశాలకి తీసుకెళ్ళినా తను పొందలేని ఆనందం తన స్నేహితులు కొద్దిపాటి ఖర్చుతో పొందగలిగారు. వారి సంతోషాన్ని తనతో పాటుగా పంచుకున్నారు.

అపూర్వ స్థిరంగా నిశ్చయించుకుంది తన తండ్రికి భయపడి తన ఫ్రెండ్‌షిప్ వదులుకోకూడదని. ఆమె ఇలా ఆలోచనలలో మునిగి ఉండగానే వైజయంతి తను స్వయంగా తయారుచేసిన వేడి టమాటో సూప్‌తో బ్రెడ్‌క్రంబ్స్ కలిపి తెచ్చి తనే స్వయంగా తినిపించి టాబ్లెట్స్ వేయించింది. ఆ తర్వాత కాసేపటికి అపూర్వ పడుకుంది.

అపూర్వ ఆ వారం అంతా కాలేజీకి వెళ్ళలేదు. జ్వరం తగ్గినా నీరసంగా ఉండడం

వల్ల వైజయంతి ఆమెని కాలేజీకి వెళ్ళనీయలేదు. అపూర్వ ఇంట్లోనే ఉండి తన నిఫ్ట్ ఎంట్రెన్స్ ఎగ్జామ్స్‌కి అవసరమైన బుక్స్ రిఫర్ చేయసాగింది. కాలేజీకి లీవ్ లెటర్ పంపించడంవలన నవ్యకి తెలిసింది అపూర్వకి జ్వరం వచ్చిందని. ఆమె ఆ రోజు కాలేజీనుండి ఇంటికి వచ్చిన తర్వాత అపూర్వకి ఫోన్ చేసి మాట్లాడింది. తను సోమవారంనుండి కాలేజీకి వస్తానని చెప్పింది.



నవ్య ఫోన్ మాట్లాడిన కాసేపటికి నవ్యా వాళ్ళింటికి మయూర్ వచ్చాడు. నవ్య అతనికి అపూర్వ సిక్ అయిన విషయం చెప్పింది.

"అపూర్వకి ఇన్ని రోజులుగా జ్వరంగా ఉంటే ఇప్పుడా నాకు చెప్పేది. అసలు పిడుగుపాటుకు దడుసుకొని జ్వరం వచ్చి ఉంటుంది. నవ్యా నాకు అపూర్వ ఫోన్ నంబరు ఇవ్వు. నేను మాట్లాడతాను" అన్నాడు మయూర్.

"ఆహా ఎంత తేలిగ్గా అన్నావు మై డియర్ మయూర్! అపూర్వకి జ్వరం వచ్చిన సంగతి నాకూ ఇప్పుడే తెలిసింది.



అయినా నా ఫ్రెండ్‌కి జ్వరం వస్తే నీకెందు కంత శ్రద్ధ" అంది నవ్య.

"నవ్యా ప్లీజ్ అపూర్వ నంబరు ఇవ్వవూ. ఆ ఇన్సిడెంట్ జరిగినప్పుడు నేనూ అక్కడే ఉన్నానుకదా. జస్ట్ ఐ వాంట్ టు మేక్ ఎ కర్టెసీ కాల్ దట్సాల్" అన్నాడు.

"తనకు కాల్ చెయ్యడం అంత తేలిక కాదు మయూర్. వాళ్ళ ఫోన్ ఎప్పుడూ ఆపరేటర్ లిఫ్ట్ చేస్తుంది. ఎవరి పర్సనల్ ఫోన్ వాళ్ళకున్నా అక్కడ వాళ్ళకు ఎవరె వరు ఫోన్ చేస్తే కనెక్షన్ ఇవ్వాలో వాళ్ళ పేర్ల లిస్ట్ ఆపరేటర్ వద్ద ఉంటుంది. నా పేరు ఈమధ్యనే ఆ లిస్ట్‌లో అపూర్వ ఇన్‌క్లూడ్ చేయించడం వల్ల నేను తనతో మాట్లాడగలిగాను. అదీగాక నా ఫోన్ నంబరు వాళ్ళ కాల్ ఐడీలో చెక్ చేసుకున్న తర్వాతే అపూర్వకి కనెక్షన్ ఇస్తారు" అంది.

అది వినగానే అతడు నవ్యని చెయ్యి పట్టుకుని ఫోన్ దగ్గరకు లాక్కెళ్ళి, "నువ్వు ఈ ఫోన్‌నుండే అప్పూకి ఫోన్ కలిపి మాట్లాడిన తర్వాత నాకివ్వు. నేను మాట్లాడతాను" అన్నాడు.

"ఈ పని కాస్త కష్టమే. సరే నేను నీకీ పని చేసిపెడితే నాకేమిస్తావు చెప్పు?" అంది నవ్య.

"నువ్వేది అడిగితే అది. సరేనా... అబ్బా ప్లీజ్ త్వరగా నంబర్ డయల్ చెయ్యి"

"నేనేది అడిగినా ఇస్తావా గుర్తుంచుకో మళ్ళీ మాట తప్పొద్దు" అంది నవ్య.

"మాట తప్పే అలవాటు ఈ మయూర్ జీవితంలోనే లేదు" అన్నాడు.

'నేనడిగింది నువ్వు నాకెప్పటికీ ఇవ్వలేవు మయూర్. నేనడగాలనుకున్నది ఇప్పుడు నీ దగ్గర లేనేలేదు' అనుకుంది నవ్య తన మనసులో. అది పైకి చెప్పలేక భారంగా శ్వాస వదిలి అపూర్వ నంబరు డయల్ చేసింది.

అక్కడ ఆపరేటర్ ఫోన్ లిఫ్ట్ చేసి అపూర్వనడిగింది, "మేడమ్ ఇంతకుముందు చేసిన అమ్మాయే. నవ్య మళ్ళీ ఫోన్ చేసింది. కనెక్షను ఇవ్వమంటారా" అనడిగింది.

"సరే ఇవ్వు" అంది అపూర్వ.

"హలో నవ్యా ఏమిటి" అనడిగింది.

"సారీ ఫర్ ద డిస్టర్బెన్స్ అప్పూ. మయూర్ నీతో మాట్లాడాలంటే చేశాను. కెన్ ఐ గివ్ హిమ్" అంది.

"ఓ తప్పకుండా దానికింత హెసిటేట్ చేస్తావెందుకు?" అంది అపూర్వ.

'ఓ మై గాడ్ మయూర్ తనకు ఫోన్ చేశాడా! ఎవరి గురించయితే తను రాత్రింబవళ్ళు ఆలోచిస్తోందో అతనే తనతో మాట్లాడాలని ఫోన్ చేశాడా... ఎంత అదృష్టం' అనుకుంటూ అతడి మాటకోసం ఒళ్ళంతా చెవులు చేసుకున్నట్లు వినసాగింది.

"హలో అప్పూ హౌ ఆర్ యూ"

అతనికేం సమాధానం రాలేదు.

అతడు మళ్ళీ రిపీట్ చేశాడు.

అతని గొంతు వింటుంటే ఆమె హృదయం ఝల్లుమంది.

ఆమె మెల్లగా "ఐ యామ్ ఫైన్, థ్యాంక్యూ" అంది. అసలు వాళ్ళిద్దరికీ వెంటవెంటనే ఏం మాట్లాడాలో తోచలేదు.

ఆఖర్న అపూర్వ మయూర్‌తో "రియల్లీ ఐ యామ్ మిస్సింగ్ యూ పీపుల్" అని అతని ఫోన్ నంబరు అడిగి తీసుకుని ఫోన్ పెట్టేసింది.

ఫోన్లో అపూర్వ ఇచ్చిన రెస్పాన్స్‌కి ఇక మయూర్ ఆగలేకపోయాడు. ఎగిరి గంతులు వేయడమొకటే తక్కువ. అతడు సంతోషం పట్టలేక నవ్య చెయ్యి పట్టుకుని రాక్ అండ్ రోల్ డాన్స్ చేస్తూ పాట పాడుతూ ఇల్లంతా తిరగసాగాడు.

ప్యార్ హువా ఇక్‌రార్ హువా

ఇక్‌రార్ సే భీ డర్‌తా హై దిల్

డర్‌తా హై దిల్ రాస్తా ముషికిల్

మాలుమ్ నహీ కహా హై మంజిల్

(ప్రేమించడం జరిగింది, ఆమోదించడం జరిగింది

ఆమోదించినా గుండెల్లో గుబులుగా ఉంది.

ఎందుకంటే గమ్యం ఎక్కడుందో తెలియదు.

వెళ్ళే దారేమో కష్టంగా వుంది)

ఆ పాట ట్యూన్ ఎంత ఫాస్ట్‌గా ఉందో అర్థం అంత ఆలోచించే విధంగా ఉంది. అలా సందర్భానికి తగ్గట్టుగా నిమిషాలమీద పాటను సెలెక్ట్ చేసి పాడడం మయూర్ స్పెషాలిటీ. అదీకాక అతని కంఠం చాలా బాగుంటుంది. అతనికి పాత హిట్ సాంగ్స్ కలెక్ట్ చేయడం హాబీ. అతని దగ్గర సి.డి.ల రూపంలో, క్యాసెట్లలో, ఆఖరికి గ్రామ్‌ఫోన్ రికార్డ్స్‌లో చాలా మంచి పాటల కలెక్షన్ వుంది. అతడు వాటిని ఒక ట్రెజర్ లాగా దాచుకుంటాడు.

మయూర్ వాళ్ళ కుటుంబీకులు చాలా ఏళ్ళక్రితం గుజరాత్‌నుండి వచ్చి హైదరాబాద్‌లో సెటిల్ అయినవాళ్ళు. అతనికి హిందీ, తెలుగు, ఇంగ్లీషు భాషలు అనర్గళంగా వచ్చు

అతడు ఎప్పుడూ ఉరికే జలపాతంలా ఉంటాడు. అతనితో పరిచయమున్న వయసు మళ్ళిన వాళ్ళకు అతన్ని చూస్తే ఇలాంటి కొడుకుంటే బాగుండును అన్పిస్తుంది. చిన్నపిల్లలు ఇలాంటి అన్నయ్య ఉండాలని అనుకుంటారు. అబ్బాయిలు ఇటువంటి ఫ్రెండ్ ఉండి తీరాలి అనుకుంటారు. వయసులో ఉన్న అమ్మాయిలైతే ఇలాంటి ప్రియుడు ఉంటే బాగుండునని మరీమరీ కోరుకుంటారు.

మయూర్ అపూర్వకి ఫోన్ కలిపి ఇచ్చినందుకు నవ్యకి థాంక్స్ చెప్పి మరికాసేపు ఉండి తనింటికి వెళ్ళాడు. రాత్రి భోంచేసి పైకి తన గదిలోకి వెళ్ళాడు. అతనికి అప్పుడే నిద్రపోవాలన్పించడంలేదు. చేతిలో ఏదో బుక్ పట్టుకొని బాల్కనీలోకి వెళ్ళి అక్కడ ఉన్న కుర్చీని లైట్‌కి దగ్గరగా జరుపుకొని చదివే ప్రయత్నం చేయసాగాడు. ఇంతలో ఫోన్ రింగయ్యింది. అతడు వెళ్ళి ఫోన్ తీసి "హలో" అన్నాడు. అవతల సైడ్ ఫోన్ కట్ అయ్యింది. అతడు వెను తిరిగాడు. ఫోన్ మళ్ళీ రింగయ్యింది. అతడు సెకండ్ రింగ్‌కే లిఫ్ట్ చేశాడు. ఫోన్ మళ్ళీ కట్ అయ్యింది. అతడు విసుగ్గా ముఖంపెట్టి వెళ్ళి మళ్ళీ బాల్కనీలోకి వెళ్ళాడు. మళ్ళీ ఫోన్ రింగయ్యింది. అతడు ఫోన్‌వంక సాలోచనగా చూసి గబగబా వచ్చి ఫోన్ తీసి వెంటనే "అప్పూ హలో అపూర్వా" అన్నాడు. మళ్ళీ కట్ అయ్యింది. అతడు ఈసారి కాస్త ఇరిటేట్ అయ్యాడు. మళ్ళీ ఫోన్ రింగయ్యింది. అతడు పక్కనే ఉండడంవల్ల వెంటనే లేపి "చూడు అప్పూ ఈసారి నువ్వు మాట్లాడకుండా ఫోన్ పెట్టేస్తే ఉన్నపళంగా మీ ఇంటికి వచ్చి నీ సంగతి తేల్చుకుంటాను" అన్నాడు. అక్కడ్నించి సన్నగా నవ్వు వినిపించింది. "ఉన్నపళంగా మా ఇంటికి వస్తావా? ఎలా? మా సెక్యూరిటీ సిబ్బందినీ, వాళ్ళ కుక్కల్నీ తప్పించుకుని నువ్వెలా రాగలవు? " అంది నవ్వుతూ.

"అదిసరే... ఫోన్ చేసేది నేనే అని ఎలా కనిపెట్టావు" అంది మళ్ళీ.

"నేను రాదలచుకుంటే మీ సెక్యూరిటీని నిమిషాలమీద కనికట్టు చేసి రాగలను. ఇక పోతే నేను ఫోన్‌లోనైనా సరే నీ శ్వాసను కూడా గుర్తించగలను. అవునూ, ఇంతకీ ఫోనెందుకు చేశావ్" అన్నాడు.

"ఓ... నీకు సినిమా పాటలేకాదు, డైలాగులు చెప్పడం కూడా బాగా వచ్చున్నమాట" అంది.

అతడు ఒకసారి వాచ్‌వైపు చూశాడు రాత్రి 10.30 అయ్యింది. "అప్పూ ఇంతరాత్రి వేళ ఫోన్ చేశావేమిటి? ఆర్ యు ఆల్ రైట్" అన్నాడు.

"మయూర్ నాకు ఎందుకో చాలా ఒంటరితనంగా అన్పించింది. నీ గొంతు వినాలని అన్పించడంతో ఫోన్ చేశాను. మయూర్...

ప్లీజ్! ఒకపాట పాడవూ" అంది.

"ఇప్పుడు పాట పాఢడమేమిటీ... ఆర్యూ మాడ్" అన్నాడు.

"మయూర్ ప్లీజ్, ఐ యామ్ రిక్వెస్టింగ్ యూ. నాకస్సలు నిద్ర రావడంలేదు. ఇంట్లో అందరూ పడుకున్నారు. నా గదిలో నేను ఒంటరిగా ఉన్నాను. నేనెందుకో చాలా లోన్లీగా ఫీలవుతున్నాను. నువ్వు పాట పాడితే నా గురించే పాడతావన్పిస్తుంది. నువ్వు పాడినకొద్దీ వినాలన్పిస్తుంది మయూర్"

అపూర్వ అలా అనడంతో మయూర్ ఆగలేకపోయాడు. అతడు పాడడం మొదలుపెట్టాడు. అపూర్వ కార్డ్‌లెస్ ఫోన్ చెవి దగ్గరగా పెట్టుకొని డోర్ తెరుచుకుని బాల్కనీలోకి వెళ్ళింది. ఫోన్‌లోనుండి మయూర్ కంఠం తియ్యగా ఆమె చెవులకు సోకసాగింది.

'చాంద్ సితారే, ఫూల్ ఔర్ కుషుబూ
ఏ తో సారే పురాణే హై
తాజా తాజా ఖలీ ఖిలీ హై
హమ్ ఉస్‌కే దివానే హై'

(చంద్రుడు, చుక్కలు, పూలు, సువాసన ఇవన్నీ పాత పురాణ కాలంనాటి మాటలు, ఇప్పుడిప్పుడే లేలేత మొగ్గ రేకలు విప్పుకుంటున్నది. నేను ఆమె కొరకు పిచ్చివాడిని అవుతున్నాను)

పాటతోపాటుగా బాల్కనీలోకి పాకి ఉన్న బాగా విరగబూసిన మల్లెతీగనుండి సువాసన, చల్లటిగాలి ఆమెను తాకుతున్నాయి. తెల్లటి నైటీలో ఉన్న అపూర్వపై వెన్నెల ప్రసరిస్తూ ఉంది. ఆమె నిజంగా మయూర్ పాటలో వర్ణిస్తున్నట్లుగా అప్పుడే విచ్చుకున్న జాజి మల్లెమొగ్గలా ఉంది.

అతడు ఒక్క క్షణంపాటు పాడడం ఆపాడు. "అప్పూ ఐ వాంట్ టు సీయూ రైట్ నౌ" అన్నాడు.

"అదెలా సాధ్యం. ఇట్స్ ఇంపాజిబుల్" అంది.

"అప్పూ నువ్వు నా పాట వినాలనుకున్నావు. వింటున్నావు. నేను నిన్ను చూడాలనుకున్నాను, చూస్తాను" అన్నాడు అతడు తన గదిలో ఓ పక్కగా ఉన్న కంప్యూటర్ చూస్తూ.

"కానీ ఎలా?" అంది అపూర్వ.

"నీ దగ్గర డిజిటల్ కెమెరా ఉందా?" అన్నాడు.

"యా" అంది.

"సో... వెంటనే నువ్వు దానికి టైమర్‌తో టైమ్ సెట్ చేసి, ఆటోమేటిక్ సిస్టమ్‌తో ఫొటో తీసి ఆ ఫ్లాపీని కంప్యూటర్‌లో నా ఇ-మెయిల్‌కి ఫీడ్ చెయ్యి" అని ఇ-మెయిల్ ఎడ్రస్ చెప్పాడు.

"ఓ మయూర్! వ్వాటె ఐడియా" అంటూ క్షణాలమీద ఆ పని అమలు చేసింది. అక్కడ మయూర్ కంప్యూటర్ స్క్రీన్‌పై అపూర్వ కనపడింది.

తెల్లటి శాటిన్ నైటీలో నల్లటి సిల్కులాంటిజుట్టు చెంపలపైకి జారుతుండగా స్వచ్ఛంగా ఉన్న చర్మకాంతితో ఆమె కడిగిన ముత్యంలా కనబడసాగింది. వారం రోజులుగా జ్వరంతో ఉండడంవలన ముఖం కాస్త సన్నబడినట్లుగా అయ్యి ఆమె ఎప్పటికంటే ఇంకా నాజూగ్గా ఉండి కళ్ళు మరీ పెద్దవిగా కనబడుతున్నాయి. అతడు స్క్రీన్ పైన ఉన్న ఆమె రూపాన్ని అతి నాజూకుగా స్పృశిస్తూ మళ్ళీ పాట పాడడం కంటిన్యూ చేయసాగాడు. ఇంతలో అపూర్వ గది తలుపులు ఎవరో తట్టారు. అపూర్వ వెంటనే "మయూర్ నేను ఫోన్ పెట్టేస్తాను. ఎవరో పిలుస్తున్నారు" అని ఫోన్ పెట్టేసి వెళ్ళి డోర్ తెరిచింది. బయట వైజయంతి నిలబడి ఉంది.

"ఏమిటి ఇంకా నిద్రపోలేదా అప్పూ?" అంటూనే బాల్కనీ డోర్ తీసి ఉండడం చూసి "ఏమిటిలా డోర్ తీసిపెట్టావు. చలి వేయడంలేదా" అంటూ వెళ్ళి డోర్ వేసేసింది.

"నాకప్పుడే నిద్ర రావడంలేదు మమ్మీ. నువ్వెందుకింకా పడుకోలేదు" అనడిగింది అపూర్వ.

"ఇంకా డాడీ ఇంటికి రాలేదు. ఆయనొచ్చే వరకూ కాలక్షేపానికి బుక్ చదువుతూ ఎదురుచూస్తున్నాను. ఇక చదవడం ఆపి నిద్రపోదామని అనుకుంటుండగా నీ రూమ్ వైపు చూస్తే డోర్ కిందినుండి లైట్ వేసి ఉన్నట్లుగా వెలుతురు కనిపించింది. ఏమైందో అని ఇటు వచ్చాను" అంది.

అపూర్వకి వైజయంతిని చూస్తే ఎంతో జాలి కలిగింది. డాడీ ఇంట్లో లేనప్పుడు అతని కొరకు ఎదురుచూడ్డం, అతడింట్లో ఉన్నప్పుడు అతని కోపాన్ని భరించడం తప్ప మమ్మీకి ఏం మిగిలిందని అన్పించింది.

"మమ్మీ నువ్వీరోజు ఇక్కడే పడుకో. నాకు నిద్ర రావడంలేదు" అంది.

"సరేలే నువ్వు పడుకో. నేనొక ఐదు నిమిషాల్లో వస్తాను" అని లైట్ తీసేసి తన గదిలోకి వెళ్ళింది.

ఆమె కాసేపట్లో వచ్చి అపూర్వ పక్కన పడుకుంటూ "అప్పూ నీకు నిద్ర రావడంలేదంటున్నావుకదా. నేనొక కథ చెబుతాను వింటావా? " అంది.

"ఏం కథ మమ్మీ చెప్పు వింటాను" అంది ఉత్సాహంగా.

"ఇది నిజంగా జరిగిన కథ అప్పూ. నా చిన్నప్పుడు నాకో స్నేహితురాలుండేది. అది ఎర్రగా, సన్నగా అందంగానే ఉండేది. తల్లి తండ్రులకు ఒక్కతే గారాల కూతురు. బోలెడంత ఆస్తి, లంకంత ఇల్లు, వంటినిండా నగలు. ఏ లోటూ లేని అమ్మాయి ఆ ఊర్లోనే ఉన్న స్కూల్లో పదవక్లాసు వరకూ చదివింది. ఆపై చదవాలంటే పక్క ఊరికి రోజూ పడవలో వెళ్ళి చదవాలి. దానికేమో పై చదువులు చదవాలని ఆశ. కానీ ఈడొచ్చిన ఆడపిల్లను పక్క ఊరికి పంపాలి అంటే అమ్మానాన్నలకి ఇష్టంలేదు. కానీ కూతురి ముచ్చట కాదనలేక ఇంట్లో ట్యూషన్ పెట్టి ప్రయివేటుగా పరీక్ష రాయించేలా నిర్ణయించారు. చదువు చెప్పే మాస్టారు పక్క ఊరి మునసబుగారబ్బాయి. ఆ రెండూళ్ళలో ఆయనంత ఎక్కువగా చదివిన వాళ్ళెవరూ లేరు. అతడు పాఠాలు బాగా చెప్పేవాడు. ఆ అమ్మాయి కూడా శ్రద్ధగానే విని అర్థం చేసుకునేది. మాస్టారివెంట అప్పుడప్పుడూ అతని తమ్ముడు వేణుగోపాల్ కూడా వచ్చేవాడు. ఆ అబ్బాయి తెల్లగా, పొడుగ్గా చాలా బాగుండేవాడు. అతడు పక్క ఊరి కాలేజీలో ఇంటర్ రెండవ సంవత్సరం చదువుతుండేవాడు. ఆ అబ్బాయి ఆ అమ్మాయి వంక దొంగచూపులు చూసేవాడు. కానీ ఆ అమ్మాయి ఇవేవీ గమనించనట్లుగా బుద్ధిగా పాఠం వింటున్నట్లు నటించేది. ఆ అబ్బాయికి విసుగొచ్చి డొంక తిరుగుడు లేకుండా ఓ ప్రేమలేఖ రాసి అమ్మాయి పుస్తకంలో పెట్టేశాడు. కానీ ఆ అమ్మాయి ఆ లేఖను చూడకముందే ఆ లేఖ ఆ అమ్మాయి తండ్రి చేతిలో పడింది.

ఆ సంఘటన జరిగిన మర్నాడే ఆ అబ్బాయి శవం వాళ్ళ ఊరి కాలవలో తేలింది. అదెలా జరిగిందో తర్వాత నమ్మకమైన నౌకర్లద్వారా తెలుసుకున్న ఆ అమ్మాయి భయవిహ్వలగా మారింది. అసలు తను ఆ అబ్బాయిని ప్రేమించనే లేదు. తెలిసీ తెలియని వయసులో అమాయకత్వంతో అతను చేసిన చిన్న తప్పును అంటే కేవలం తన కూతురుకు ప్రేమలేఖ రాశాడన్న విషయాన్ని గమనించిన వెంటనే బెదిరించి వదిలేసినా అయిపోయేది. కానీ అంతక్రూరంగా అతని జీవితాన్ని బలి తీసుకోవడం ఆ అమ్మాయికి తన తండ్రిపై రోత కల్గించింది. అక్కడితో ఆమె చదువు ఆగిపోయింది. మేనబావతో వివాహమూ జరిగిపోయింది. కానీ అప్పటినుండి ఇప్పటివరకూ ఆమె తన తండ్రి గుమ్మం తొక్కలేదు.

అతడు పోతూ తన యావదాస్తినీ, డబ్బునూ కూతురిపేరుమీద రాసిచ్చినా ఆమె వాటిని ముట్టనూలేదు. ఆ డబ్బంతా నిరుపయోగంగా బాంకుల్లోపడి వుంది. ఆస్తి కాగితాలు లాకర్లలో నిద్రపోతు న్నాయి. అన్యాయంగా ఒకరి ప్రాణాలను బలి తీసుకున్న తండ్రికి కూతురిగా పుట్టిన ఆ అమ్మాయెన్నడూ తన వైవాహిక జీవితంలో సుఖపడలేదు. ఒక పంజరంలో చిలుకలా ఉండిపోయింది" అక్కడికి కథనాపింది వైజయంతి.

"మమ్మీ ఆ అమ్మాయిపేరు వైజయంతి కదూ" అంది అపూర్వ.

"అవునమ్మా, ఆ అమ్మాయి తండ్రిదీ, నీ తండ్రిదీ ఒకటే రక్తం. ఒకటేలాంటి బుద్ధీ కూడా" అంది వైజయంతి.

"అయితే ఈ సమయంలో ఇప్పుడు ఈ కథ నాకెందుకు చెప్పావు మమ్మీ"

"నాకెందుకో నీకీ కథ తెలియాలనిపించింది. అందుకోసమే చెప్పాను అపూ్వ"

"నీ పెళ్ళి తర్వాత నువ్వు మళ్ళీ తాతయ్యగారి ఊరికి ఎప్పుడూ వెళ్ళలేదా?"

"వెళ్ళాను... మా అమ్మ పోయినప్పుడు, ఆ తర్వాత మీ తాతయ్యగారు పోయినప్పుడు. కానీ నాన్నగారు భౌతిక కాయాన్ని చూసినప్పుడు మాత్రం నాలో కరుడుగట్టిన దుఃఖమంతా బయటపడింది. అప్పుడు నీ వయస్సు ఐదేళ్లనుకుంటా... నిన్ను నావెంట మీ నాన్నగారు పంపించలేదు. ఎందుకంటే కర్మకాండ అయ్యేంతవరకూ నువ్వు ఆ ఊర్లో ఉంటే నీ సంరక్షణ కష్టమని.

తిరిగిరాని లోకాలకు వెళ్ళిన నాన్నగారి అంత్యక్రియలు జరుగుతున్నప్పుడు నాకన్పించింది, నాన్న చేసినదానికి నేను అతనికి అంత పెద్ద శిక్ష విధించడం ఏ రకంగా న్యాయం. అతని ఒక్కగానొక్క కూతుర్ని, అతన్ని విరోధిగా నేను చూడడం అతడు తట్టుకోలేకపోయాడు. నేను అతన్ని నా ఇంటికి రావద్దని శాసించాను. నేను ఆ విధంగా కట్టడి చేయడంతో ఆ మానసిక వ్యథతోనే అతడు పోయాడని ఊర్లో వాళ్ళందరూ గుసగుసలాడడం విన్నాను. నిజమే నేనూ ఆ తండ్రి కూతుర్నేగా అపూ్వ, మరి నాలో ఉన్నదీ ఆ రక్తమేగా. అందుకే అతన్ని బతికున్నప్పుడు క్షమించలేకపోయానేమో. నాన్నగారి కర్మకాండ జరిగిన తరువాత అక్కడ ఉన్న ఇంటిని కాలేజీ బిల్డింగ్‌గా డొనేట్ చేసి దానికి మరమ్మత్తులు చేయించి కొంత డబ్బు కూడా ఫండ్‌గా ఇచ్చాను. నాన్నగారి పట్ల నా బాధ్యతని సక్రమంగా నిర్వహించని నేను అతని ఆస్తికి వారసురాలిని ఎలా అవుతాను? అందుకే ఆ డబ్బంతా నీకు చెందాలనుకున్నాను. నాకు కావల్సింది నువ్వయినా సుఖమయమైన జీవితం గడపడం. అంతే నేను కోరుకునేది" అంది వైజయంతి భారంగా.

మళ్ళీ వెంటనే అంది వైజయంతి. "అపూ్వ నీమీద మీ నాన్నగారు ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. నువ్వు నిఫ్ట్‌కి ప్రిపేరవుతానని అన్నప్పటినుండీ అతడు నువ్వు ఒకపెద్ద డ్రెస్ డిజైనర్ అవుతావనీ, తండ్రికి తగ్గ కూతురిగా పేరు తెస్తావనీ ఎంతో ఉత్సాహపడుతున్నాడు. అంతేకాకుండా నీకోసం అన్నివిధాలా ఉన్నతమైన వరుడ్ని తేవాలని ఆరాటపడుతున్నాడు. నీ తండ్రి నాకు భర్తగా న్యాయం చేయలేకపోయినా నీ తండ్రిగా అతడు నిన్ను అతిగా ప్రేమిస్తున్నాడు. అపూ్వ నేనేం చెప్పదల్చుకున్నానో అర్థం చేసుకో. మీ నాన్నగారు చిన్నప్పటి నుండీ నీకు కావలసినవన్నీ అడగకుండానే అమర్చాడు" అని ఆమె ఇంకా ఏదో అనబోతుండగా,

అపూర్వ అందుకుంది. "మమ్మీ నాకు కావలసినవన్నీ అనేకంటే అతనికిష్టమైనవన్నీ అనొచ్చు కదా మమ్మీ. నేను కోరకముందే నాకవసరపడుతుందని కంప్యూటరు, నేనడగకముందే నాకు కొత్త మోడల్ కారు కొనిచ్చినట్లే ఒకబ్బాయిని తెచ్చి ఇతడు

నీ కాబోయే భర్త అని చెప్తే అతడు నాకు నచ్చకున్నా పెళ్ళి చేసుకొని తీరాలా మమ్మీ. భర్త అంటే ప్రాణం లేని వస్తువా మమ్మీ? నా అభిప్రాయాలకు, అభిరుచులకు తగ్గట్లుగా తన భర్త ఉండాలని ఏ ఆడపిల్లయినా కోరుకుంటుంది. అందరి ఆడపిల్లల్లా నాకా అధికారం లేదా మమ్మీ" అంటూ వైజయంతి ఎదపైన తల ఉంచి ఏడవసాగింది.

"అప్పూ! నా తల్లివిగా ఊరుకో. మీ నాన్నగారి నైజం నీకు తెలుసుకదా నువ్వు ఇప్పటినుండీ నీ జీవితంలో వేయబోయే ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయాలి. ఒక్కరోజు ఇంటికి ఆలస్యంగా వర్షంలో తడిసి వచ్చినందుకే నానా యాగీ చేసిన మీ నాన్న ఇంతకంటే ఏ మాత్రం పెద్ద సంఘటన జరిగినా నిన్నూ, నన్నూ నరకడానికి కూడా వెనకాడడు. అందుకే నేను నీకు ముందుజాగ్రత్తగా చెప్తున్నాను. ఈ ఏడు జరిగే నీ పుట్టినరోజు పార్టీని చాలా గ్రాండ్‌గా జరపాలని నిర్ణయించాడు. ఆరోజు అతని క్లోజ్‌ఫ్రెండ్ కిషోర్ ఏకైక కుమారుడ్ని తన అల్లుడుగా, నీ కాబోయే భర్తగా అందరికీ పరిచయం చేయాలనుకున్నాడు" అంది.

ఆ మాట వినగానే అపూర్వకి నెత్తిన పిడుగు పడ్డట్లుగా అయ్యింది.

"మమ్మీ నాకిప్పుడే పెళ్ళేమిటి మమ్మీ. నేనింకా బాగా చదువుకోవాలనుకుంటున్నాను"

"లాభం లేదు అప్పూ... నేనివన్నీ నాన్నగారికి చెప్పి చూశాను. 'నేనిప్పుడు పెళ్ళిచేయడంలేదుకదా. వరుడ్ని నిశ్చయిస్తున్నానంతే. ఇది అపూర్వ చదువుకి ఎటువంటి అడ్డంకీకాదు. దీనివల్ల మంచే జరుగుతుంది. ఇకపై అపూర్వ వివాహం ఫిక్స్ అయ్యిందని తెలిస్తే ఏ అడ్డమైన వెధవా దాని వెంటపడడు. నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను' అన్నాడు" అంది వైజయంతి.

ఇక అపూర్వకర్థమైంది, ఇక తన డాడీ నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరని. మండుతున్న అపూర్వ మనసులో ఒక కసిలాంటిది బయల్దేరింది. ఎదుటిమనిషికి ఏమాత్రం విలువ ఇవ్వకుండా ఎప్పటికీ తనే నియంతలాగా వ్యవహరించడం పట్ల అపూర్వకి ఏవగింపు కలిగింది. అంతవరకూ మయూర్ పట్ల తనకున్నది ప్రేమో, ఆకర్షణో అన్నది తనకు తెలియకున్నా ఇప్పుడుమాత్రం తన తండ్రికి వ్యతిరేకంగా పోరాడాలని, ఎట్టి పరిస్థితుల్లోనూ మయూర్‌ని వదలకూడదని నిర్ణయించుకుంది.

తన బర్త్‌డే అక్టోబరు 31న. ఈరోజు తేదీ ఆగస్టు 2. అంటే తనకు సుమారు 3 నెలలపైన వ్యవధి ఉంది. తనకు తెలుసు, ఇప్పటినుండి తన ప్రతి అడుగు వెనకా తన తండ్రి నిఘా ఉంటుందని. అతన్ని ఏమార్చేందుకు తను కూడా ఎత్తుకు పైఎత్తు వెయ్యాలి అని ఆలోచనల్లో మునిగిపోయింది.

★ ★ ★

ఆరోజు అపూర్వ తనంతతానుగా ఫోన్ చేయడంవలన మయూర్‌కి ఎంతో ఆనందంగా అన్పించినమాట నిజమే కానీ అతనికి అర్థమయ్యిందేమిటంటే అపూర్వ తనంతతానుగా తన అంతస్థు దిగివచ్చి తనకు చెయ్యందించినా తమ చేతిని అందుకోవాలంటే ఒక స్థాయికి ఎదగాలి. అందుకు తనెంతో కృషి చేయాల్సి ఉంటుంది. అంతకంటే ఐదారునెలల ముందునుండే తను ఒక ప్రాజెక్టు గురించి ఆలోచించి బ్యాంక్ లోన్‌కి అప్లయ్ చేశాడు. ఈమధ్యన పార్టీలలో, ఫంక్షన్‌లలో పూలవాడకం చాలా ఎక్కువయ్యింది. మార్కెట్ బాగా పెరిగింది. ఎన్నోరకాల అందమైన పూలు మార్కెట్‌లో దొరుకుతున్నాయి. వాటిని అందంగా అరేంజ్ చేసి అలంకరించడం, అంతేకాకుండా అందమైన బొకేలు గిఫ్ట్‌లుగా ఇవ్వడం ఆనవాయితీగా మారి పూల అమ్మకాలు బాగా పెరిగాయి. ఈ బిజినెస్

గురించి మయూర్ బాగా స్టడీ చేశాడు. అందుకు అవసరమైన, అందమైన పుష్పాలను బయట దేశాలనుండీ కొన్నిరకాలను, వేలే రాష్ట్రాలనుండి కొన్ని రకాలను తెప్పించడమూ, అంతేకాకుండా అక్కడ సిటీ ఔట్ స్కర్ట్స్‌లో కొంత పొలము లీజుకి తీసుకొని స్వయంగా పండించుకోవడమూ చేసి అందులో కొన్ని ఆర్టిఫిషియల్‌గా తయారు చేసిన బంగారు, వెండి, రాగి రంగుల పుష్పాలు, డ్రై ఫ్లవర్స్‌ని కూడా కలిపి అన్నీ ఒకే దగ్గర సమీకరించి లార్జ్ స్కేల్‌మీద అమ్మకాలు చేయడానికి పెద్ద పెద్ద పార్టీలకూ, స్టార్ హోటల్స్‌ని అలంకరించడం ఇట్లాంటి ఆర్డర్స్‌కి ప్రయత్నం చేయడంవల్ల ప్రాఫిట్స్ బాగా ఉంటాయని మొత్తం ప్రాజెక్ట్ వర్కవుట్ చేసుకున్నాడు. తన ఫ్రెండ్ మనోజ్‌సింగ్ తండ్రి వద్ద భూమి కూడా లీజుకి తీసుకున్నాడు. ఇక ఆలస్యం చేయకుండా తను అహర్నిశలూ శ్రమించాలి' అని నిర్ణయించుకున్నాడు. అతడు తన షాపు ఉన్న షాపింగ్ కాంప్లెక్స్ లోనే ఈమధ్యనే ఒక ఫర్నిచర్ షాపువాడు ఖాళీ చేశాడు. ఆ స్థలాన్ని అతడు తన బిజినెస్‌కి అనువుగా ఎంచుకొని వాళ్ళతో మాట్లాడి లీజుకి తీసుకున్నాడు. లోన్ శాంక్షన్ కాగానే పనులన్నీ చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇక తను ఆలస్యంగా కాకుండా బ్యాంకువాళ్ళతో మాట్లాడి ఇన్‌ఫ్లూయన్స్‌తో తన ఫైల్ త్వరగా మూవ్ అయ్యేటట్లు చూడాలి. ఆ లోపల తను కొన్ని పనులు చేసుకోవాలంటే బాగానే డబ్బు అవసరం పడుతుంది. తన తండ్రి నిరాలీ పేరు పైన పెట్టిన ఫిక్స్‌డ్ డిపాజిట్ డబ్బు అడిగాడు. తనకు లోన్ శాంక్షన్ కాగానే ఆ డబ్బు మళ్ళీ నిరాలీ పేరుమీద డిపాజిట్ చేస్తానని తండ్రికి ప్రామిస్ చేశాడు. చేతిలో డబ్బు పడగానే అతడు వెంటనే పేపర్‌లో ఫ్లవర్ అరేంజ్‌మెంట్‌లో మంచి ప్రావీణ్యం ఉన్నవారు కావాలని మంచి అట్రాక్టివ్ శాలరీస్ ఇస్తామని వాంటెడ్ కాలమ్‌లో అడ్వర్‌టైజ్ చేశాడు. మయూర్ తను కాంప్లెక్స్‌లో లీజుకు తీసుకున్న షాపును తను చేసే బిజినెస్‌కి అనుగుణంగా ఫర్నిష్ చేయించడం, లైటింగ్ అరేంజ్‌మెంట్, కలరింగ్ అన్నీ దగ్గరుండి చేయించసాగాడు. అతని స్నేహితులు కూడా ఈ పనిలో ఎంతో సహాయపడసాగారు. అతడు సిటీలో ఉన్న పెద్ద హోటల్ వాళ్ళకీ, ప్రైవేటు ఫంక్షన్ హాల్స్ వాళ్ళకీ, షాపు పర్పస్ గురించి వివరాలు రాస్తూ ఓపెనింగ్ పార్టీ అంటూ అందంగా ప్రింట్ చేసిన పామ్‌ప్లేట్స్ పంచసాగాడు. అన్ని కాలేజీల దగ్గరా, సినిమా హాళ్ళ వద్ద కూడా ప్రచారం చేయించసాగాడు. ఇన్నిపనుల వత్తిడిలో ఉండి కూడా మయూర్ రెండురోజులకొకసారైనా అపూర్వకి ఫోన్ చేస్తున్నాడు. అపూర్వకి ఫోన్ చెయ్యడం చాలా కష్టమైన పని. అపూర్వ ఇంట్లో ఆపరేటర్ వద్ద లిస్ట్‌లో ఒక నవ్య వాళ్ళ నంబరే ఉంది. ఇంకెక్కడి నుంచి ఫోన్ వచ్చినా వాళ్ళు అపూర్వకి ఇవ్వరు. అపూర్వ ఆరోజు వర్షంలో తడిసి జ్వరం పడిన తరువాత చౌదరిగారు ఆపరేటర్‌తో ఏదన్నా కొత్తనంబరు అపూర్వ చెప్పినా కూడా తన పర్మిషన్ లేనిదే ఎంట్రీ చేయొద్దు అని చెప్పడం అపూర్వకి తెలుసు. అందుకే ఆమె మయూర్ నంబర్ ఐడెంటిటీ కొరకు ఇవ్వలేదు. తనెప్పుడన్నా ఒకసారి నంబరు కలిపి ఇవ్వమని ఆపరేటర్‌ని అడిగితే 'సారీ మేడమ్, సార్ పర్మిషన్ తీసుకోవాలి. ఈ నంబరు మీ లిస్ట్‌లో లేదు' అంటుంది. 'ఛ... పనివాళ్ళకు కూడా లోకువైపోయాను' అనుకుంటూ చికాగ్గా రిసీవర్ పెట్టేస్తుంది. మయూర్ నవ్య ఇంటినుండి ఫోన్ కలిపినా ముందు కాసేపు నవ్య మాట్లాడిన తర్వాత మయూర్ లైన్‌లోకి వస్తాడు. అపూర్వకి ఇదంతా చాలా కష్టంగా అన్పించసాగింది. ఇక ఫోన్ చెయ్యడం వల్ల లాభం లేదనుకుంటూ ఒకరోజు కాలేజీనుండి ఇంటికి వెళ్ళే

టప్పుడు మయూర్ షాపువైపు కారు పోని వ్వమని డ్రైవర్‌తో చెప్పింది. "అమ్మాయిగారూ తోవలో కారెక్కడా ఆప కూడదని అయ్యగారు చెప్పారమ్మా" అన్నాడు.

"చూడూ మాట్లాడకుండా ఆ షాపు దగ్గర కారాపు. నేనేమీ ఫ్రెండ్స్ ఇళ్ళకి తిరగడం లేదు. నాకు అత్యవసరంగా కావల్సిన వస్తువులు కొనుక్కునేది ఉంది. నువ్విప్పుడు కారాపకుంటే నేనే డాడీకి ఫోన్‌చేసి నీపైన మిస్ బిహేవియర్ కింద కంప్లయింట్ ఇవ్వాల్సి ఉంటుంది" అంది కోపంగా.

అతడు అపూర్వ కోపానికి కాస్త జంకాడు. ఈ తండ్రీకూతుళ్ళ మధ్య గోల నాకెందుకూ మధ్యలో అని సణుక్కుంటూ కారాపాడు డ్రైవరు. కారు ఆపీఆపగానే డోర్ తెరుచుకుని దిగి రెండంగల్లో నాలుగు మెట్లూ ఎక్కి షాపుకున్న గ్లాస్‌డోర్ తెరుచుకొని కౌంటర్‌వైపు చూసింది. అక్కడ మయూర్ కనపడలేదు. ఆమె కాస్త నిరాశగా ముఖం పెట్టి అక్కడున్న సేల్స్‌గర్ల్ దగ్గరకు వెళ్ళి మయూర్ గురించి అడిగింది. ఆ అమ్మాయి మయూర్ పై ఫ్లోర్‌లో కొత్త షాపు పనుల పర్యవేక్షణలో ఉన్నాడని చెప్తూ పైకి వెళ్ళేదారి చూపించింది. లిఫ్ట్ ఉన్నా కూడా పట్టించుకోకుండా అపూర్వ చకచకా మెట్లెక్కి పైకి వెళ్లింది. ఆమె పైఫ్లోర్‌లోకి వెళ్ళేసరికి అక్కడ మయూర్ గొంతు అరుస్తున్నట్లుగా పెద్దగా వినబడుతోంది. అక్కడంతా సుమారు పదిహేడు, ఇరవై మంది పనిచేస్తున్నారు. మయూర్ పెద్దగా అరుస్తున్నాడు. "రెండురోజులు నేను వేరే పనిమీద వెళ్ళి ఇక్కడకు రాలేకపోయాను. నిన్నంతా మీరు ఏం పనిచేశారు. ఇలా ప్రతి నిమిషం మీ వెనక ఉండి పనులు చేయించాలంటే ఎలా కుదురుతుంది. నేనింక వేరే పనులు చేసుకో అక్కర్లేదా. ఇంత మెల్లగా చేసుకుంటూపోతే ఇంక పదిహేను రోజుల్లో మనం అనుకున్నట్లుగా షోరూం ఓపెన్ చేయగల్గుతామా లేదా?" అంటున్నాడు. అపూర్వ మెల్లగా వెళ్లి అతని పక్కన నిల్చుంది. పక్కన ఎవరో వచ్చారన్పించిన మయూర్ ఇటుతిరిగి ఆశ్చర్యంగా "అప్పూ ఎలా వచ్చావ్?" అంటూ ఆమె చెయ్యి పట్టుకొని సంభ్రమంగా ఆమెనే చూస్తున్నాడు. కానీ అంతకుముందు అంత కోపంగా ఉన్న అతని ముఖంలో అలాంటి ఛాయలేమీ లేవు. అపూర్వని చూస్తూనే అతని ముఖం ఎంతో ప్రసన్నంగా మారిపోయింది. కానీ అతని ముఖంలో అలసట బాగా కనబడుతుంది. "ఏమిటి మహాశయా మూడు రోజులుగా ఫోన్ కూడా చేయడం లేదు. ఏ దేశం వెళ్ళావో కనుక్కుందామని వచ్చాను" అంది.

"ఓ అదా సంగతి, నేను నిజంగానే ఇక్కడ లేను అప్పూ. బెంగుళూరు వెళ్ళాను. ఈరోజు ఉదయాన్నే వచ్చాను. వచ్చేసరికి ఇక్కడి వర్కంతా అలాగే ఉండిపోయింది. పనుల ఒత్తిడివల్ల నేను ఫోన్ చెయ్యలేకపోయాను. బాగా ఎదురు చూశావా? ఐయామ్ సారీ" అన్నాడు.

"అది సరే నువ్వెందుకు ఇంత ఓవర్ వర్క్ చేయడం? బాగా అలిసిపోయావు. నీ ముఖంలోనే తెలిసిపోతోంది. నువ్వెంత టైర్డ్‌గా ఉన్నావో" అంది అపూర్వ.

"ఇంక షాప్ ఓపెనింగ్ డేట్‌కి పదిహేను రోజులే టైం మిగిలింది. చెయ్యాల్సిన పని బోలెడుంది. షాప్ 'ఇనాగ్రేషన్‌డే' కార్డ్స్‌లోని మాటర్ ప్రూఫింగ్ అయ్యి వచ్చింది చూడు అంటూ అక్కడ టేబుల్ పైన ఉన్న కొన్ని పేపర్స్, శాంపిల్ కార్డ్స్ ఆమె చేతికిచ్చాడు. ఆమె అనాసక్తిగానే వాటిని చూసింది. సడెన్‌గా ఆమె కళ్లు ఆ మాటర్‌లో ముఖ్య అతిథులు అన్న స్థలంలో ఆగాయి. అక్కడ మిస్టర్ అండ్ మిసెస్ రాంభూపాల్‌చౌదరి అనీ, ఆ తర్వాత షాపు ఇనాగ్రేట్ చేసేవాళ్ల దగ్గర 'మిస్ అపూర్వచౌదరి' అని రాసి ఉంది.

అపూర్వ నమ్మశక్యం కానట్లుగా మళ్లీ ఒక్కసారి పరీక్షగా చూసి కన్‌ఫర్మ్ చేసుకొని 'మయూర్, నీకేమైనా పిచ్చిపట్టిందా, ఆర్యూ మాడ్? ఇది సాధ్యమయ్యే పనేనా? మా డాడీ ఇటువంటి ఫంక్షన్స్‌కి రాడు. నేను రావడానికి కూడా ఒప్పుకోడు. రిస్కెందుకు కార్డ్‌లోని మాటర్ మార్చెయ్యి. హాయిగా ఏ సినిమాస్టార్ చేతో ఇనా(గ్రేట్ చేయించు" అంది.

"నా దృష్టిలో నువ్వే నాకు స్టార్‌వి అప్పూ. ఇందులో ఏ మార్పూ ఉండదు. మీ డాడీవాళ్లూ వస్తారు, నువ్వూ వస్తావు. నేను లాస్ట్ వీక్‌లోనే మీ డాడీ పి.ఎ.ని కన్విన్స్ చేసి అపాయింట్‌మెంట్ తీసుకున్నాను. నెక్ట్స్ వీక్‌లో ఆయనను కలువబోతున్నాను కూడా"

"నువ్వు తప్పకుండా భంగపడతావు మయూర్, మానుకో" అంది.

"నేను సాధించి తీరుతాను ఛాలెంజ్" అన్నాడతను.

"సరే, అదీ చూద్దాం మయూర్, అన్నిటికంటే నాకు నిన్ను కలుసుకోవడానికి ఇంట్లోనుండి రావాలంటే చాలా కష్టంగా ఉంది. అందుకని ఒక మార్గం ఆలోచించాను. నిన్నటినుండి బంజారాహిల్స్‌లో ఏరోబిక్స్ అండ్‌ డాన్స్ క్లాసెస్ స్టార్ట్ అయ్యాయి.

"ఇటువంటి వాటికి వెళ్తానంటే నాన్నగారు అభ్యంతరపెట్టరు. ఉదయం 7 గం॥ నుండి 8 గంటల వరకు గంటసేపు ఉంటుంది. నువ్వూ అక్కడికి రా మయూర్"

"అరే, నేను మర్చేపోయాను. లాస్ట్ సమ్మర్‌లో కూడా ఆ షామెగ్‌ధ్దావర్‌వాళ్లు ఈ క్లాసెస్ కండక్ట్ చేసినప్పుడు నేను జాయిన్ కాలేకపోయాను.

"ఈసారి వాళ్లు మళ్లీ క్లాసెస్ కండక్ట్ చేసినప్పుడు నేను తప్పకుండా జాయిన్ అవుదామనుకున్నాను. మొన్నీమధ్యనే డెక్కన్ (క్రానికల్‌లో అడ్వర్‌టైజ్‌మెంట్ కూడా చూశాను. కానీ పనుల ఒత్తిడిలో మర్చిపోయాను. థాంక్స్ అప్పూ బాగా గుర్తుచేశావు రేపట్నించి నేనూ వస్తాను" అన్నాడు.

ఆ తర్వాత మయూర్ అపూర్వకి పైన తను చేయిస్తున్న వర్కంతా దగ్గరుండి చూపించాడు. తను చేయబోయే బిజినెస్ గురించి వివరించాడు. వాళ్లు ఇలా మాట్లాడుకుంటుండగానే చాలా పొద్దుబోయింది. ఇంతలో అపూర్వ సెల్ రింగయ్యింది. ఆమె శబ్దం విని కరెంట్‌షాక్ తగిలినదానిలా ఉలిక్కిపడి పర్సులోనుండి సెల్‌తీసి రిసీవింగ్ బటన్ నొక్కింది. అవతలినుండి వైజయంతి కంఠం వినబడింది. "హలో అప్పూ ఈరోజు ఏమిటీ ఆలస్యమైంది, ఎక్కడున్నావు నువ్వు? "

"మమ్మీ నేనిక్కడ (గ్రీటింకార్డ్స్ కొరకు షాపులో ఆగాను. ఇప్పుడే ఇక్కడినుండి బయలుదేరుతున్నాను, పావుగంటలో వచ్చేస్తాను" అంది.

"అప్పూ మీ డాడీ ఈరోజు ఎందుకో త్వరగా ఇంటికి వచ్చారు. అపూర్వ కాలేజీ నుండి ఇంకా రాలేదా అని అడిగాడు త్వరగా వచ్చెయ్యి నువ్వు" అని ఫోన్ పెట్టేసింది.

అపూర్వ చెయ్యి అ(ప్రయత్నంగా గుండెలపైకి వెళ్ళింది 'మైగాడ్ డాడీ ఇంటికి అప్పుడే వచ్చారా' మనసులో అనుకొనేమాట అ(ప్రయత్నంగా పైకే అనేసింది.

వెంటనే మయూర్‌వైపు తిరిగి కంగారుగా "నేను వెంటనే వెళ్లాలి. డాడీ ఇంటికి వచ్చేశారట. మాటల్లో పడి నాకు టైమే తెలియలేదు నాకు చాలా టెన్షన్‌గా ఉంది మయూర్" అంది.

అతనికి ఆమె కళ్ళలో భయం, శరీరంలో కొద్దిగా కంపన కనబడింది.

అతనికి అపూర్వ పరిస్థితి అర్థమైంది. ఆమెని ఆ స్థితిలో చూసిన అతనికి ఆమెను దగ్గరగా తీసుకొని భయపడవద్దు అని ఓదార్చాలనిపించింది. కానీ అక్కడ పనిచేస్తున్న లేబర్‌ని చూసి అతడు అతికష్టంమీద ఆ

ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

"అప్పూ, డోన్ట్ గెట్ టెన్సడ్. నీకు టెన్షన్ తగ్గాలంటే నువ్వు కౌంట్‌డౌన్ స్టార్ట్ చెయ్యి 100 నుండి 1 వరకు. నీకు టెన్షన్ తగ్గి కూల్‌గా అవుతావు" అన్నాడు. ఆమె మనసులో 100, 99, 98 అనుకోసాగింది. 71, 70 వచ్చేసరికి కొంత టెన్షన్ తగ్గింది. 25 వరకు వచ్చేసరికి తను నార్మల్‌గా నిలదొక్కుకోగలిగింది.

"థాంక్స్ మయూర్ ఇక వెళతాను బై" అంది.

"ఓకే, బై. రాత్రి 10 గంటల తర్వాత ఆన్‌లైన్‌లో చాటింగ్ రా అప్పూ" అన్నాడు.

ఆమె సరే అంటూ వెళ్ళిపోయింది.

అపూర్వ ఇంటికి వెళ్లేసరికి ఇంట్లో ఆమె ఊహించినట్లుగా ఎలాంటి గందరగోళమూ లేదు. పైగా ఇల్లంతా ఎప్పటికంటే నిశ్శబ్దంగా ఉంది. అపూర్వ సవ్వడి కాకుండా మెల్లగా నడుచుకుంటూ కిచెన్‌లోకి వెళ్ళింది. ఆమె ఉద్దేశ్యమేమిటంటే గిరిజమ్మను సైగలతో డాడీ ఎక్కడున్నాడో కనుక్కొని అతని కంట బడకుండా ఉండాలని. అపూర్వ కిచెన్‌లోకి వెళ్లేసరికి అక్కడ గిరిజమ్మకి బదులు వైజయంతి 'టీ' రెడీ చేస్తోంది. అపూర్వని చూస్తూనే వైజయంతి "హమ్మయ్య వచ్చావా తల్లీ అప్పటినుండీ మీ నాన్నగారు 'నువ్వొచ్చావా' అని మళ్ళీ అడిగితే ఏం చెప్పాలా అని హడలి చస్తున్నాను. ఈ రోజు నేను లేచినవేళ బాగుంది కాబట్టి మీ నాన్నగారు మళ్ళీ అడగలేదు" అంది.

ఆ మాట వినగానే అప్పటివరకూ ఊపిరి బిగపట్టినట్లుగా ఉన్న అపూర్వ రిలాక్స్‌డ్‌గా మారింది. "మమ్మీ డాడీ ఎక్కడ ఉన్నారు?" అంది.

"బాక్‌యార్డ్‌లో ఉన్నారు" అంది.

"అయితే ఐదు నిమిషాల్లో ఫ్రెష్ అయ్యి వస్తాను మమ్మీ, డాడీకి టీ నేనే ఇస్తాను" అంటూ త్వరగా పైన తన గదిలోకి వెళ్ళి ఐదు నిమిషాల్లో వచ్చింది. అప్పటికి 'స్టౌ' మీద టీ కాచడం అయిపోయింది.

"మమ్మీ, నువ్వు కూడా డాడీ దగ్గరకు వెళ్లు నేను టీ అక్కడికి తెస్తాను" అంటూ వైజయంతిని పంపించి, టీ డికాషన్ కెటిల్‌లో పోసింది. మరోదాన్లో వేడిపాలు తీసుకుంది. షుగర్‌లో స్పూన్ వేసింది. ట్రేలో నీట్‌గా మూడు కప్పులు సర్దింది. ఒక గాజుప్లేట్‌లో కొన్ని మారీ బిస్కట్స్ పెట్టింది. అవన్నీ సర్వింగ్ ట్రాలీలో సర్దుకొని తనే స్వయంగా తోసుకుంటూ తీసుకెళ్ళింది.

అక్కడకు వెళ్లేసరికి చౌదరిగారు బిజినెస్ ఇండియా చదువుతూ ఉన్నారు. కాస్త దూరంగా వైజయంతి కుండీలలో మొక్కలకున్న ఎండిన ఆకుల్ని తుంచుతూ ఉంది.

ఆ దృశ్యం చూసిన అపూర్వ 'ఛ... వీళ్ళిద్దరు ఎప్పుడన్నా మనసువిప్పి మాట్లాడుకుంటారా లేదా' అనుకొని నిట్టూర్చింది.

టీ తెచ్చిన అపూర్వని చూస్తూనే "గిరిజమ్మ, వైజయంతీ లేరా అప్పూ నువ్వు తెచ్చావేం" అన్నాడు.

"ఈ టైమ్‌కి మీరెప్పుడూ ఇంట్లో ఉండరు కదా డాడీ. ఈరోజు ఉన్నారు కాబట్టి నాకు స్వయంగా టీ కలిపి ఇవ్వాలనిపించింది" అని వైజయంతి వైపు తిరిగి "మమ్మీ టీ చల్లారి పోతుంది, రా" అంటూ టీ డికాషన్, పాలు కప్పుల్లో పోసి వాళ్లకు చక్కెరెంతకావాలో అడిగి కలిపి ఇచ్చింది. చౌదరిగారు టీ కప్పు తీసుకొని మెల్లిగా సిప్‌చేశాడు. "ఓ రియల్లీ గుడ్ టీ అప్పూ" అన్నాడు.

"థాంక్స్ డాడీ" అని మళ్ళీ "డాడీ నేను రేపట్నించీ" అని నసుగుతూ ఆగిపోయింది.

"ఊ చెప్పు రేపట్నించీ ఏమిటి?" తన కళ్లద్దాలు తీసి పక్కన పెడుతూ అడిగాడు.

"ఏంలేదు డాడీ, నేను రేపట్నించీ ఏరోబిక్స్ అండ్ డాన్స్ క్లాసెస్‌కి వెళ్తాను. షామ్‌గద్దావర్ అని చాలా ఫేమస్ కొరియోగ్రాఫర్. వాళ్ల బృందం ఈ క్లాసెస్‌ని కండక్ట్‌చేస్తుంది. ఈ ఛాన్స్ ఒక నెలరోజులు మాత్రమే డాడీ, ప్లీజ్ వెళతాను"

చౌదరిగారు ఏ కళనున్నాడోగానీ వెంటనే 'సరే' అన్నాడు.

"మరి డ్రైవర్‌ని రోజూ కాస్త త్వరగా రమ్మని చెప్పండి డాడీ" అంది.

"అలాగే. గిరిజమ్మా అప్పూ డ్రైవర్‌ని రేప ట్నించి ఉదయం త్వరగా రమ్మని చెప్పు" అంటూ లేచి లోపలికి వెళ్లిపోయాడు.

"యాహూ" ఒక పనైపోయింది అని సంతోషంతో గంతులు వేస్తున్న అపూర్వని వైజయంతి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపో యింది. ఎందుకంటే చిన్నప్పటినుండి అపూర్వ ఎప్పుడూ తన ఫీలింగ్స్‌ని అంతలా ఎక్స్‌పోజ్ చెయ్యలేదు. ఈమధ్య అప్పూ చాలా మారింది అనుకుంది.



ఈ ఏరోబిక్స్ క్లాసెస్‌కి వెళ్ళి అక్కడ మయూర్‌ని ఎలాంటి ఆటంకం లేకుండా కలుసుకోగలగడం అపూర్వ ప్రాణానికి తెరిపిగా ఉంది. ఇన్ని రోజులూ తను నిర్బంధంలో ఉన్నట్లుగా అన్పించేది. చూసేవాళ్ళందరికీ కనబడే తన కంఫర్ట్స్ అన్నీ తనకు మాత్రం నిరుపయోగంగా అన్పించేవి. తన కారు డ్రైవరు తనిష్టమున్నట్లు తిరగడానికి కాదు కేవలం తను కాలేజీకి, మమ్మీతో బయటికి వెళ్ళడానికి మాత్రమే ఉపయోగపడ్తాయి. తన సెల్ ఫోన్‌తో తను ఎవ్వరికంటేవా ళ్లకు ఫోన్ చెయ్యడానికి వీలులేదు. ఆ ఫోన్ నంబరే తనకు తెలియదు. తను ఎప్పుడన్నా ఇంటికి ఆలస్యంగా వెళ్తే ఇంటి నుండి ఫోన్ చేస్తారు. తనకేమన్న ప్రాబ్లమ్ అంటే తన కారు ట్రబుల్ ఇచ్చినా లేదా తనకేదైనా చిన్న పని ఉండి ఇంటికి వెళ్లడం ఆలస్యమైతే తను ఫోన్‌చేయడానికి అను వుగా తన ఇంటి ఫోన్ నెంబరు అందులో రికార్డయ్యి ఉంటుంది. తను 1 నంబరు బటన్ ప్రెస్ చేస్తే ఆటోమేటిక్‌గా ఆ నంబరు కలుస్తుంది. తను మెసేజ్ వదిలే స్తుంది అంతే. ఆరోజు నవ్య ఇంటికి వెళ్ళిన రోజు వర్షంలో తడవడంవల్ల జ్వరం రావడ మేమోగానీ తనపట్ల తన తండ్రి మరీ దారు ణంగా ప్రవర్తిస్తున్నాడు. ఆయనమీది కోపంతో తను మయూర్‌కి ఇంకా దగ్గరగా కావాలనుకుంటోంది. ఈ ఏరోబిక్స్ క్లాసుకి అందరు స్టూడెంట్స్ వచ్చేకంటే పావుగంట ముందే వీళ్లు అక్కడికి చేరుకుంటారు. అందరూ వెళ్ళింతర్వాత 10 నిమిషాలకి వీళ్లు బయటికి వచ్చి ఎవరి పనుల మీద వాళ్లు వెళ్ళిపో తారు. బయటకు వచ్చినప్పుడు డ్రైవర్ని మభ్య పెట్టడానికి పూర్తి అపరిచి తుల్లాగే బయటికి వస్తారు.

ఒకరోజు వీళ్ల క్లాసు అయింతర్వాత వెళ్లే ముందు మయూర్ తన ముఖానికి పట్టిన చెమటని టవల్‌తో తుడుచుకుంటూ "అప్పూ నేను రేపు క్లాసుకి రావడంలేదు" అన్నాడు.

"ఎందుకు? " అపూర్వ షూ లేసులు టైట్‌గా టై చేసుకుంటూ అడిగింది.

"రేపు రాఖీపౌర్ణమి. నిరాలీ స్ట్రిక్ట్‌గా ఆర్డర్ వేసింది, రాఖీ కట్టుకొని బ్రేక్‌ఫాస్ట్ చేసేవ రకు ఎక్కడికీ వెళ్లొద్దని" అన్నాడు.

"ఓ రాఖీపౌర్ణమా! నేను ఈ పండగ గురించి వినడమూ, పుస్తకాల్లో చదవడమే గానీ ఎప్పుడూ జరుపుకోలేదు" అంది.

"అయితే అప్పూ నువ్వు రేపు తప్పకుండా మా ఇంటికి రావాలి" అన్నాడు.

"నాకూ రావాలనే ఉంది మయూర్ కానీ ఎలా మా ఇంట్లో పంపించరుకదా" అంది.

"ఆ ఐడియా, నువ్వు మామూలుగా క్లాసుకి రా. నేను బిల్డింగ్‌కి కాస్త దూరంగా బైక్ ఆపుకొని ఉంటాను. నువ్వు క్లాసు రూమ్ ఇంకో డోర్‌నుండి బిల్డింగ్ వెనుకవైపునుండి బయటికి రా. మనం డ్రైవరు కంట బడకుండా వెళ్దాం. మళ్ళీ క్లాసు అయిపోయేటైముకి నిన్ను అక్కడ వదిలివేస్తాను" అన్నాడు మయూర్.

"ఓ... గుడ్ ఐడియా మయూర్, ఒకే సీయూ టుమారో" అని బయటకు వెళ్ళిపోయింది అపూర్వ.

★ ★ ★

ఈమధ్య చౌదరిగారు సమీర ఇంటికి వెళ్లడం బాగా తగ్గించారు. అపూర్వ పెరిగి పెద్దయినప్పడినుండి అతడు సమీర ఇంట్లో ఉన్నప్పుడు బాగా ఇన్‌సెక్యూర్డ్‌గా ఫీలవుతున్నాడు. 'ఇప్పుడీ విషయం ఎక్కడైనా బయటపడితే రానురానూ అది అపూర్వ భవిష్యత్‌కి దెబ్బవుతుందేమో? తన తండ్రి ఇలాంటివాడని తెలిస్తే అపూర్వ తనని అసహ్యించుకుంటుందేమో? ఇలాంటి ఆలోచనలతో సతమతమవసాగాడు. అదీకాక ఈమధ్య సమీర కూడా తనను వేధించసాగింది. 'ఇన్నేళ్లూ మిమ్మల్నే నమ్ముకొని ఉన్నాను. నా జీవితానికి అర్థం కల్పించండి' అంటూ ఏవేవో పిచ్చిపిచ్చిగా మాట్లాడసాగింది. అసలు తను దానికేం తక్కువ చేశాడని, బిజినెస్ ట్రిప్పుల పేరిట ఎన్నిదేశాలు తిప్పాడు. ఎన్ని నగలూ, దుస్తులూ కొనిచ్చాడు. ఆఖరికి అది ఉంటున్న ఇల్లు తను కొనిచ్చిందే. ఊరిబయట సిటీ ఔట్‌స్కర్ట్స్‌లో చిన్న మామిడితోట, ఉప్పల్ దగ్గర రెంటల్ ప్రాపర్టీ ఇవన్నీ తను కొనిచ్చినవే. ఇక త్వరలోనే దానితో డీల్ సెటిల్ చేసుకొని తెగతెంపులు చేసుకోవాల్సిందే.

అతడు ఇలా ఆలోచిస్తుండగానే ఇల్లు రావడం, డ్రైవర్ పోర్టికోలో కారు ఆపడం జరిగింది. అతడు కారు దిగి ఇంట్లోకి నడిచాడు. లోపలికి వెళ్ళి మేడమెట్లెక్కి తన గదిలోకి వెళ్ళాడు. అతనికి వైజయంతీ, అపూర్వా ఇద్దరూ కన్పించలేదు. అతడు సరాసరి బాత్‌రూమ్ లోకి వెళ్ళి ఫ్రెష్ అయ్యి బాల్కనీలోకి వెళ్లాడు. అతని గది బాల్కనీ నుండి బాక్‌యార్డు కనబడుతుంది. అక్కడ వైజయంతీ, అపూర్వా షటిల్ ఆడుతున్నారు. ఆ దృశ్యం అతని కళ్లకి మనోహరంగా కన్పించింది. అతడొకసారి వైజయంతి వంక చూశాడు. ఏ తప్పూచెయ్యని ఆ నిర్మలమైన ముఖం అతనిలోని గిల్టీఫీలింగ్‌ని ఉధృతం చేసింది. లేత ఆకుపచ్చ, తెలుపు రంగులు కలిసిన చుడీదార్ కుర్తా ధరించి దుపట్టా పక్కన పెట్టి కూతురితో సమానంగా షటిల్ గేమ్ ఆడుతున్న ఆమెను నిశితంగా గమనించాడు. ట్రిమ్ చేయించుకున్న ఆమె ఒత్తయిన జుట్టును రబ్బరుబాండ్‌తో బంధించింది. స్వచ్ఛమైన చిరునవ్వుతో, అపూర్వపై గెలవాలన్న పట్టుదలతో ఆడుతోంది. అతని మనసు బాధగా మూల్గింది. తనెంత పొరపాటు చేశాడు. తన కూతురికున్న జ్ఞానం తనకు లేకపోయింది. ఆనాడు తన కళ్లకున్న అంధకారపు పొరలు ఈనాడు తెరచుకున్నట్టనిపించింది. తను కాస్త ఓపికపట్టి వైజయంతిలో ఈ మార్పుకై ప్రయత్నించి ఉంటే తన జీవితం ఇంకొకలాగ ఉండిఉండేది. క్షణికమైన తాత్కాలిక సుఖాలకోసం తను జీవితంలో చాలా పెద్ద పొరపాటు చేశాడు. దానికి తగిన మూల్యం చెల్లించుకోవాల్సిందే తప్పదు.

చౌదరిగారు లోపలికి రావడం చూసిన గిరిజమ్మ కాఫీ కలిపి తెచ్చింది. అతడు కప్పు తీసుకొని కాఫీ తాగుతూ తన జీవితాన్ని తవ్వుకోసాగాడు.

తను పుట్టిన ఏడాదికే తన తండ్రి చనిపోవడంతో తననూ, తన తల్లినీ చేరదీసి తనకేలోటూ రాకుండా కన్నతండ్రిలా పెంచి

తనడిగినంత వరకూ చదివించాడు మేన మామ. తను ఎమ్.బి.ఏ. పూర్తిచేసింత ర్వాత బిజినెస్ పెట్టుకుంటాననంటే కావల్సి నంత డబ్బు సహాయం కూడా చేసిన తన మేనమామ తన ప్రాణానికి ప్రాణమైన కూతుర్ని వివాహం చేసుకొమ్మన్నప్పుడు తను కాదనలేకపోయాడు. తన వివాహం ఒక బొమ్మల పెళ్ళిలా అన్పించింది. తనకూ, వైజయంతికీ వయసులో కూడా వ్యత్యాసం బాగా ఉంది. వైజయంతి తన కంటే దాదాపు పదకొండేళ్లు చిన్నది. ఆమె దృష్టిలో వివాహం అంటే భర్త ఎలా చెప్తే అలా నడుచుకోవాలి అది భార్యల లక్షణం అనుకునేది. నూనెరాసి, నున్నగా దువ్వి, గట్టిగా అల్లిన జడ, జడలో ఓ మల్లెదండ, ఒంటినిండా ఏదోలా దిగేసుకున్న నగలు ఇంకా పూర్తి పసితనం వదలని ఆ ముఖా నికి పెద్దరికం తేవాలన్నట్లుగా పెట్టిన పెద్ద కుంకుమ బొట్టూ అతనిలో ఎలాంటి కోర్కెలూ కలిగించలేకపోయాయి. అతనికి బాగా చదువుకున్న అమ్మాయిని వివాహ మాడాలనే కోర్కె ఉండేది. అంతేకాక భార్యంటే తన జీవిత భాగస్వామిగా తన ఫీలింగ్స్‌ని పంచుకొని చక్కని కంపెనీ ఇవ్వ గలిగేదిగా కూడా ఉండాలి. తను బాహ్య సౌందర్యానికి మరీ అంత ఇంపార్టెన్స్ ఇచ్చే వాడుకాదు. తన క్లాస్‌మేట్ నీరజ అంటే తనకు బాగా ఇష్టంగా ఉండేది. ఆమె రంగు తక్కువగా నిజం చెప్పాలంటే నల్లకలువలా ఉండేది. ఆమె అందరితో చాలా కలుపుగో లుగా చక్కగా మాట్లాడేది. తనూ, ఆమె కాలేజీలో ఉన్నప్పుడు క్లాసులు లేని సమ యాల్లో ఎన్నో కబుర్లు చెప్పుకునే వారు. ఆమెకి తెలియని టాపిక్ అంటూ లేక పోయేది. తను ఆమెకున్న నాలెడ్జ్‌కి అబ్బు రపడే వాడు. ఆ అమ్మాయితో ఆ విషయం పైకే అన్నాడు. తన తండ్రి తనకు ఎన్నో మంచి బుక్స్ కొని పెడతాడనీ తనకు బుక్ రీడింగ్ హాబీ అనీ దానివల్లనే తన నాలెడ్జ్ ఇంప్రూవ్ అయిందనీ చెప్పేది.

అతడు అప్పుడే డిసైడ్ చేసుకున్నాడు తనకు పెళ్లై పిల్లలు పుట్టింతర్వాత వాళ్లకు బుక్ రీడింగ్ అలవాటు చెయ్యాలని.

వివాహం గురించి అలాంటి కలలుగన్న చౌదరిగారికి వైజయంతి పట్ల రానురానూ అసంతృప్తి పెరిగిపోయింది. ఆఖరికి "హనీ మూన్‌కి ఎక్కడికెళ్దాం కులూ మనాలీ అయితే బాగుంటుందేమో" అంటే అదేంటీ అంటూ ఎదురు ప్రశ్నించగలిగేటటువంటి పెళ్లాన్ని అతడు ఏమాత్రం భరించలేకపో యాడు.

సరిగ్గా అటువంటి సమయంలోనే తన ఆఫీస్‌లో వర్క్‌లోడ్ ఎక్కువవడంతో ఇంకో సెక్రెటరీని అప్పాయింట్ చేసుకున్నాడు. ఆమె ఈ సమీర. చాలీచాలని జీతంలో లిమిటెడ్ లైఫ్ బతికేకంటే రెండో పెళ్లి వాడైనా సరే బాగా డబ్బున్న వాణ్ణి నమ్ము కుని అద్దాలమేడలో బతకాలని కోరుకునే సమీర చౌదరిగారి బలహీనత తెలుసుకొని తన అందంతో వాక్చాతుర్యంతో అతన్ని లోబర్చుకునే ప్రయత్నాలు చేసింది. ఒక బిజినెస్ ట్రిప్పులో ఒక బలహీన క్షణంలో చౌదరిగారు తొందరపడ్డాడు. ఒకసారి జరి గిన తప్పే పదేపదే చేయడం జరుగుతూ పరిస్థితి ఇంతవరకూ వచ్చింది. ఇంక లాభంలేదు తన గత జీవితానికి తెర దించాల్సిందే. కానీ తను తొందరపడగూ డదు. సరిఅయిన సమయం కోసం వేచి చూడాల్సిందే.

ఇలా ఆలోచనలో మునిగిపోయిన చౌద రిగారు గదిలో ఏదో చప్పుడవడంతో ఉలిక్కి పడి ఇటు తిరిగాడు వైజయంతి గదిలోకి వచ్చినట్లుంది. లైటు వేసి ఇటువైపే వస్తోంది. అతడు తిరిగి బాక్‌యార్డ్‌వైపు చూశాడు. అక్కడ చీకటి పడి ఉంది. అతని చేతిలోని కప్పులో కాఫీ బాగా చల్లారి పోయి మీగడ తరకలు కట్టిఉంది.

"సారీ మీరెప్పుడొచ్చారో చూడనేలేదు.

కాఫీ తాగుతారా" అంటూ అతని చేతిలోని కప్పు వంక చూసింది.

"అరె తాగేశారా" అంటూ కప్పు చేతిలోకి తీసుకోబోయి అందులో చల్లారిన కాఫీ చూసి "ఇదేమిటీ చల్లారిన కాఫీ? ఉండండి మళ్లీ చేసి తీసుకొస్తాను" అంటూ ఆ కప్పు తీసుకొని వడివడిగా కిందికి వెళ్లిపోయింది వైజయంతి.

ఆమెను తనెంత నిర్లక్ష్యం చేసినా ఇదేం అన్యాయం అని ఒక్కనాడూ తనను నిలదియ్యకుండా ప్రతిక్షణం తన బాగోగులు చూసే ఆ మహా ఇల్లాలుని చూస్తూ ఇక నుంచయినా తను వైజయంతికి న్యాయం చెయ్యాలి అనుకున్నాడతడు నిశ్చయంగా.

వైజయంతి కూడా ఈమధ్య చౌదరి గారిలో వచ్చిన మార్పును స్పష్టంగా పసిగట్టింది. అతను తన పట్ల ఒకలాంటి శ్రద్ధను చూపించడం గమనించింది. ముందుగా అది తన పట్ల జాలి వల్లనేమో అనుకుంది. కానీ అతనికి తన పట్ల జాలి ఉండటం అన్న విషయాన్ని తను భరించలేదు. తను అతని నియంతృత్వాన్నయినా భరించగలదు గానీ జాలి మాత్రం తను భరించలేదు. కానీ ఈమధ్యన అతను ఇంటికి త్వరగా రావడం. అతను ఇంట్లోకి రాగానే తనని వెతుక్కోవడం అతని కళ్లలో తనను చూడగానే వచ్చే వెలుగు ఆమె దృష్టిని దాటిపోలేదు. ఏ స్త్రీ అయినా తన భర్తకు తన పట్ల ఆకర్షణ ఉందో లేదో అన్న విషయాన్ని తేలికగా గ్రహించగలదు. అపూర్వ తనను ఎడ్యుకేట్ చేయడం మొదలు పెట్టినప్పటినుండి ఒక్కొక్క స్టేజ్‌లో తనలో వచ్చిన మార్పుని అతడు గమనిస్తున్నాడని అతని కళ్లలోని ప్రశంసలు చూసి అర్థం చేసుకుంది. అతడు తనను గమనిస్తున్నాడు అన్న ఫీలింగ్ తనకు ఇన్స్‌పిరేషన్ అయి పట్టుదల వచ్చి ఇంత త్వరలో అన్నీ నేర్వగలిగిందేమో! అతడింట్లో ఉన్నంత సమయం అతనున్న పరిసరాల్లో తనేదన్నా పనిమీద తిరుగుతుంటే ఒక లాంటి కుతూహలంలో అతడు తన వంక చూడటం, ఏదైనా అవసరముంటే పని వాళ్లకు బదులుగా తననే పిలవడం ఆమె దృష్టిని దాటిపోలేదు.

ఆరోజు సాయంకాలం కంట్రీక్లబ్‌లో సొసైటీ ఎగ్జిబిషన్ ఉంటే అపూర్వ, తనూ వెళ్తుంటే ఇంట్లోనే ఉన్న చౌదరిగారు వీళ్లని చూస్తూ

"ఎక్కడికి వెళ్తున్నారు" అనడిగాడు.

"సొసైటీ ఎగ్జిబిషన్ డాడీ" అన్నది అపూర్వ.

"కాసేపుండండి నేనూ వస్తాను" అంటూ పైకి వెళ్లి ఐదు నిమిషాల్లో రెడీ అయి కిందకి దిగిన అతన్ని కళ్లింతలు చేసుకొని ఆశ్చర్యంగా చూడసాగారిద్దరూ. ఎందుకంటే అది రోజూ అతను క్లబ్‌కి వెళ్లే సమయం.

"ఏంటీ అలా చూస్తున్నారు. నేను రావడం మీకేమైనా ఇబ్బందిగా ఉందా" నవ్వుతూ అడిగాడు.

"నోనో డాడీ అదేంకాదు. మీకు ఇలాంటి ప్లేసెస్‌కి రావడం అంతగా ఇష్టం ఉండదు కదా అని నేను ముందుగా మిమ్మల్ని అడగలేదు. ఐ యామ్ సారీ" అంది.

అక్కడ వైజయంతీ, అపూర్వ జువెలరీ స్టోర్‌లో ఏవో నగలు చూస్తుంటే కాస్త దూరంగా ఉన్న స్టాల్‌లో చౌదరిగారు ఆ స్టాల్ ముందు హాంగ్ చేసిన మెరూన్ కలర్ రాజస్థానీ చీరను చూపిస్తూ షాపతన్ని ఏదో అడుగుతున్నాడు. అది చూసి వీళ్లిద్దరూ అటు వెళ్లారు.

"ఈ చీర త్వరగా ప్యాక్ చెయ్యి" షాపతనితో అంటున్నాడు.

"డాడీ ఆ చీర నాకొద్దు డాడీ. అంత హెవీశారీ నేను కట్టలేను" అంది అపూర్వ.

"నో అప్పూ అది నీకు కాదు వైజయంతికి. ఆ కలర్ తనకు బాగా సూటవుతుంది" అన్నాడు చౌదరి.

వైజయంతీ, అపూర్వ ముఖాలు చూసుకున్నారు. ఇద్దరి పెదాలపై చిరునవ్వు ఉద

# ఏరిన ముత్యాలు

✤ మనకి ఉన్న మంచి స్నేహితులు ఎవరంటే?... మనలోని ప్రతిభను గుర్తించి, దానిని వెలికితీసి, రాణింపుకి తేవడానికి ప్రయత్నించేవారు.

– హెన్రీఫోర్డ్

✤ గొప్పవాళ్ళు కావడానికి కొంతమంది విధి రాతను ఆశ్రయిస్తే, ఎక్కువమంది దృఢచిత్తంతో కృషిని నమ్ముకుంటారు.

– జిగ్‌జిగ్లర్

✤ మనిషి స్వభావంలో బలమైన బలహీనత తను చేసే ప్రతీపనికీ పదిమంది వద్దనుంచీ ప్రశంసలను అందుకోవాలని ఆరాటపడటం.

– విలియం జేమ్స్

✤ మనిషి మనసులో ఉత్సాహం అణగారితే, దాన్ని మించిన పేదరికం లేనేలేదు ఈ ప్రపంచంలో.

– హెచ్.డబ్ల్యు.ఆర్నాల్డ్

✤ అసాధ్యాలని సుసాధ్యం చేసుకునే వారినే ప్రపంచంలో అందరూ అమితంగా ఇష్టపడతారు

– గాంధీ

✤ ఇష్టపడేవారు లేకుంటే కోటీశ్వరుడైనా కటిక పేదవాడే

– ఫోర్బ్స్

✤ తాను ఓడిపోతానని భయపడే మనిషి తప్పనిసరిగా అపజయం పాలవుతాడు.

– నెపోలియన్

✤ ప్రపంచంలో పైకి వచ్చిన ప్రతివారూ కలలుగని, కలలని నిజం చేసుకోవడానికి శ్రమించినవారే.

– ఒ.ఎస్.మార్టెన్

✤ మనిషి జీవితంలో శక్తినీ, నిరంతర పరిశ్రమనీ మించిన ప్రతిభా విశేషాలు లేనేలేవు.

– మిచెల్

✤ ఆశయసాధనకోసం మనిషి తనకి అనువైన మార్గాన్ని వెతుక్కోవాలి, అది సాధ్యపడనపుడు తానే సృష్టించుకోవాలి.

– హనిబుల్

✤ మన విజయానికైనా, మన అపజయానికైనా, మనమూ, మన ఆలోచనలూ, మన పనులూ కారణాలవుతాయి.

– ఎపిక్టెటస్

సేకరణ: టి. మహి

యించింది. భర్త నోటి వెంట వచ్చిన ఆ చిన్న కాంప్లిమెంట్ కే ఆమె మనసు పురివిప్పిన నెమలిలా మారింది. కానీ అపూర్వ మనసులో ఒకసారి డాడీ మమ్మీతో నీకు చీర నచ్చిందా అని అడిగి కొంటే ఇంకా బాగుండేది అనుకుంది. మమ్మీ ఎక్కడో దూరంగా ఉంటే తనకు నచ్చే వస్తువు కొని గిఫ్ట్ ఇవ్వడం వేరు. కానీ పక్కనే ఉన్నప్పుడు అడిగి కొనచ్చుగా. అన్నీ తనకే తెలుసన్న అహంకారమా, లేదా మేల్ ఈగోనా.

ఒకవేళ తనూ, మయూర్ కలిసి ఎటయినా వెళ్తే ఇలాంటి సందర్భాలలో మయూర్ అయితే ఏం చేస్తాడు. ఉన్నట్లుండి పరధ్యానంలోకి వెళ్లిన కూతుర్ని ఆశ్చర్యంగా చూస్తూ.

"అప్పూ ఇక వెళ్దామా నువ్వింకేమయినా చూస్తావా" అన్నారిద్దరూ.

"వెళ్దాం" అంటూ బయల్దేరింది వాళ్లతో పాటుగా.

కారు సరాసరి ఇంటికి వెళ్లకుండా తాజ్ కృష్ణా ముందు ఆగింది. "ఈ రోజు ఇక్కడ థాయ్‌ఫుడ్ ఫెస్టివల్ ఉంది అప్పూ. డిన్నర్ ఇక్కడే చేసి వెళ్దాం" అన్నాడు చౌదరి.

ఆ రాత్రి వాళ్లు ఇంటికి వెళ్లేసరికి పదకొండయ్యింది. అపూర్వ త్వరగా పైకి వెళ్లి డ్రెస్ ఛేంజ్ చేసుకొని బెడ్ పైకి ఎక్కింది. ఎందుకంటే రేపుదయాన్నే లేచి తను త్వరగా తయారై ఏరోబిక్ క్లాసుకు వెళ్లాలి. అక్కడ్నించి మయూర్ ఇంట్లో రాఖీ పౌర్ణమి సందర్భంగా బ్రేక్‌ఫాస్ట్‌కి వెళ్లాలి. ఉదయాన్నే మెలుకువ రావాలని ఆమె అలారం పెట్టుకొని నిద్రలోకి జారిపోయింది.

చౌదరిగారు పైకి వెళ్లి నైట్‌సూట్ వేసుకొని వచ్చి టీవీ స్విచ్ ఆన్ చేశాడు. ఎప్పటిదో పాత క్రికెట్ మ్యాచ్ హైలైట్స్ వస్తున్నాయి. ఇంతలో డ్రెస్సింగ్ రూమ్‌లోంచి వైజయంతి బయటికి వచ్చింది. అప్పుడే ముఖం కడుక్కోవడంవల్ల ఆమె కడిగిన ముత్యంలా ఉంది. చిక్కని జుట్టు వదిలివేయడంతో అది వీపంతా పరుచుకొని కదిలే నల్లటి మేఘంలా ఉంది. నల్లటి ఒత్తైన కనుబొమల మధ్య చిన్న చుక్కలాంటి బొట్టు ఆమె ముఖానికి వింతైన అందాన్నిస్తోంది. వైజయంతి బెడ్ పైకి వెళ్లి పడుకొని కాళ్లవద్దనున్న రగ్గు నడుం వరకూ కప్పుకొని నిద్ర వస్తున్నట్లుగా కళ్లు మూసుకుంది.

వైజయంతి వెళ్లి పడుకున్న కాసేపటికి చౌదరి టీవీ ఆఫ్‌చేసి బెడ్ దగ్గరగా వచ్చి లైట్ ఆఫ్ చేస్తూ మళ్లీ ఒకసారి ఆమె నిర్మలమైన ముఖంలోకి తదేకంగా చూశాడు. అతడిక నిగ్రహించుకోలేకపోయాడు. ఆమె గులాబి రంగు పెదాలను అందుకోవాలని ముందుకు వంగాడు. అప్పటివరకూ నిద్ర నటిస్తున్న వైజయంతి తన గుండె స్పందనల వేగం పెరగడంతో తట్టుకోలేక చటుక్కున కళ్లు తెరిచింది. అతడు పట్టుబడ్డట్లుగా ఆమెవైపు చూశాడు. ఇద్దరి కళ్లూ కలుసుకున్నాయి. ఆ క్షణంలో ఆమె మనసులో తాళి అనే దానికి ఇంత బలమైన శక్తి ఉందా అనుకుని తన మెడలోని తాళిబొట్టును అపురూపంగా స్పృశించింది.

ఆమె ఈమధ్య తన భర్త స్పర్శలోని తేడా గమనించింది. ఆ తాళి తన మెడలో ఉండటం వల్లేగదా తను అతని తిరస్కృతినీ, నిర్లక్ష్యాన్ని మౌనంగా భరించి ఈ ఇంట్లో ఉంది.

ఆఖరికి ఇన్నేళ్లకయినా తను అతని మనసుని జయించగలిగింది. ఆమె హృదయంలోని భావాలు గమనించినట్లుగా అతను ఆమెని మరీ దగ్గరకు తీసుకున్నాడు.

★ ★ ★

ఆ రోజు త్వరగా లేచి రోజూ ఏరోబిక్ క్లాసుకి వేసుకునే ట్రాక్ సూట్‌కి బదులుగా మెరూన్‌కలర్ మంగళగిరి చూడీదార్ కుర్తా వేసుకొని అదే కలరు జరీ పనితనంతో ఉన్న దుపట్టా వేసుకుంది. చిన్న మెరూన్‌కలర్ రంగు బొట్టుపెట్టుకుంది. చిక్కని జుట్టును వదిలేయకుండా రబ్బర్‌బాండ్‌తో

బంధించింది. కాస్త పక్క పాపిటి తీయడంతో ఆ ముఖం నాజూగ్గా ముద్దుగా కనబడ్తోంది. ఆమె వెళ్లేసరికి మయూర్ ఆమె కొరకు ఎదురు చూస్తూ బైక్ పట్టుకొని నిలబడి ఉన్నాడు. ఆ డ్రెస్‌లో ఆమెని చూస్తూనే అపూర్వ ఏ డ్రెస్ వేసుకున్నా ఆ డ్రెస్‌కే అందమొస్తుంది అనుకున్నాడు. వీళ్ల ఇంటికి వెళ్లేసరికి నిరాలీ పూజ గదిలో దేవుని ముందు దీపం వెలిగించింది. ఆయమ్మ సాయంతో దేవుడి పటాలకు పూలదండలు అలంకరించింది. మంగళహారతి పళ్లెంలో దీపాలు ఉంచి రాఖీలు రెడీగా ఉంచింది. ఆయమ్మ టేబుల్‌పై బ్రేక్‌ఫాస్ట్ రెడీ చేసి ఉంచింది. బాగా పొంగిన వేడివేడి పూరీలు, వేడిగా పొగలు కక్కుతున్న చోళే నోరూరిస్తున్నాయి. రెండు మూడు రకాల స్వీట్స్ ప్లేట్లల్లో సర్ది ఉన్నాయి. నవ్య, నవ్య అన్నయ్య రాకేశ్, ఇంకా మయూర్ ఫ్రెండ్స్ ఉన్నారు. వీళ్లు రాగానే నిరాలీ దేవుడి ముందు పెట్టిన మంగళహారతి పళ్లెం తెచ్చి అందులో ఉంచిన కుంకుమభరిణిలో నుండి బొటనవేలితో ఎర్రటి కుంకుమ తీసి మయూర్ నుదుటిపై నిలువుగా దిద్దింది. రాఖీ తీసి మయూర్ కుడి చేతికి కట్టి కొంచెం స్వీట్ నోట్లో పెట్టి మంగళహారతి ఇచ్చింది. మయూర్ తన జేబులో నుండి కొత్త వెయ్యి రూపాయిల నోటు తీసి హారతి పళ్లెంలో నిరాలీకి కానుకగా పెట్టాడు. ఆ తర్వాత అందరూ లేచి బ్రేక్‌ఫాస్ట్ చేయసాగారు. మయూర్ ఫ్రెండ్ మనోజ్‌సింగ్ ఆయమ్మని ఈ రాఖీ కట్టడానికి అర్థం ఏమిటి అనడిగాడు.

"రాఖీని రక్షాబంధనం అంటారు. సోదరి తన సోదరునికి ఈ రక్షాబంధనాన్ని కట్టి ఎల్లవేళలా తనకు రక్షణగా ఉండాలని కోరడం అన్నమాట" అని చెప్పింది.

అపూర్వ ఒక విషయాన్ని కనిపెట్టింది. తను అంత కలిమిలో పుట్టి పెరిగినా కూడా నిరాలీ, నవ్యా వాళ్లు ఇళ్లలో పొందుతున్న ఆప్యాయతా అనురాగాలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ తనకెప్పుడూ లేవన్పించసాగింది. మయూర్‌ని వివాహం చేసుకొని అటువంటి జీవితాన్ని సొంతం చేసుకోవాలని దృఢంగా నిశ్చయించుకుంది.

అందరూ బ్రేక్‌ఫాస్ట్ చేయగానే మయూర్ అపూర్వకి క్లాసు టైమైందని గుర్తుచేసి మళ్లీ వెళ్లి ఆమెని అక్కడ డ్రాప్ చేసి వచ్చాడు. ఆ రోజు మయూర్ పట్టు కుర్తా పైజామాలో నుదుట నిరాలీ దిద్దినతిలకంతో ఎప్పటి కంటే డిఫ్రెంట్‌గా కనబడసాగాడు. ఆ తిలకం కారణంగా అతని ముఖం ఎంతో తేజోవంతంగా కన్పించసాగింది. ఆ రోజు అపూర్వ మయూర్‌ని వదల్లేక వదల్లేక బలవంతంగా వెళ్లింది. మయూర్‌కి కూడా అందంగా తయారై తన నట్టింట్లో కలుపుగోలుగా తిరుగుతున్న అపూర్వని అలాగే ఉంచెయ్యాలన్పించింది. అపూర్వ ఆ రోజు క్లాసు దగ్గర నుండి ఇంటికి వెళ్లిన తరవాత నాలుగైదు రోజులవరకు తన స్టడీస్ బిజీలో ఉండిపోయింది. మయూర్ కూడా తన షోరూమ్ ఓపెనింగ్ డేట్ దగ్గరకి రావడంతో చాలా బిజీగా అయ్యాడు.

ఆ రోజు మయూర్‌కి చౌదరిగారి దగ్గర అపాయింట్‌మెంట్ ఉంది. మయూర్ తన మాటల చాకచక్యంతో చౌదరిగారి పిఎస్‌ని మంచి చేసుకొని అతికష్టం మీద అపాయింట్‌మెంట్ తీసుకోగల్గాడు. కానీ మయూర్‌కి తెలుసు తన షాపు ఓపెనింగ్‌కి చౌదరిగారిని ఒప్పించడం కష్టమని. అందుకే కాస్త టెన్షన్‌గా ఉన్నాడు. సరిగ్గా 11.00 గంటలకు మయూర్‌ని లోపలికి పిల్చారు. టెన్షన్ తగ్గడానికి మయూర్ తన అలవాటు ప్రకారం రివర్స్‌లో కౌంట్‌డౌన్ స్టార్ట్ చేసుకుంటూ చౌదరిగారున్న సౌండ్ ప్రూఫ్ గదిలోకి ఎంటర్‌అయ్యాడు.

డోర్ తెరుచుకున్నప్పుడు వచ్చేది ఎవరా అని చౌదరిగారు అటువైపు చూసి అకస్మాత్తుగా తనవైపు వస్తున్న అబ్బాయి వంక

చూసి ఆశ్చెరుపొందాడు. అబ్బా ఎవరితడు ఎంత అందంగా హుందాగా ఉన్నాడు అను కోకుండా ఉండలేకపోయాడు. మయూర్ దగ్గరగా రాగానే కూర్చోమని సైగచేసి అపా యింట్‌మెంట్ లిస్ట్‌లో వివరాలకోసం చూశాడు. అక్కడ కేవలం మయూర్ ప్రొఫెషన్ బిజినెస్ అని రాసుంది. వివరా లేమీ లేవు. చౌదరిగారు ప్రశ్నార్థకంగా తన పిఎస్ వైపు చూశాడు. సర్ అతను తన వివరాలు అంతే చెప్పాడు కానీ బాగా రిక్వెస్ట్ చేయడంతో అపాయింట్‌మెంట్ కన్‌ఫర్మ్ చేశాను అని నసిగినట్లుగా చెప్పాడు. ఇక చేసేదేం లేక కోపాన్ని అణు చుకుంటూ మయూర్‌వైపు తిరిగి పనేంటన్న ట్లుగా చూశాడు.

వెంటనే మయూర్ అతనితో తన బిజి నెస్ గురించి షాపు గురించి వివరించి దాని ఓపెనింగ్ ఛీఫ్ గెస్ట్‌గా రమ్మని కోరాడు. మొదట చౌదరిగారు మయూర్ చెప్పే విష యాన్ని వింటూనే ముఖం చికాగ్గా పెట్టాడు. కానీ అతని చెప్పే స్టయిలూ అతని ఇంగ్లిషు భాషా పరిజ్ఞానం అతన్ని ఇంప్రెస్ చేశాయి. కానీ అంతా విన్న తరు వాత "ఈమాత్రం దానికి నేను చీఫ్‌గెస్ట్‌గా రావడం ఏమిటి. ఇలాంటి వాటి పబ్లిసిటీకి సినిమాస్టార్‌నో లేదా చోటా మోటా రాజ కీయ నాయకుణ్ణో ఆహ్వానించాల్సింది. అయినా నీకు నేను సలహా ఇవ్వటమేమిటి నా టైమంతా వృధా చేశావు" అంటూ వాచ్ వైపు చూసుకొని మయూర్‌నిక వెళ్ళచ్చన్న ట్లుగా లేచి నిలబడ్డాడు.

"సర్ ప్లీజ్ మీరెందరో నాలా కొత్తగా బిజినెస్‌లో ఎంటరయ్యే వారికి మీరెంత గానో సహాయం చేస్తారని విన్నాను. యంగ్‌స్టర్స్‌కి మీరు కావల్సిన ఇన్వెస్ట్‌మెం ట్‌కి క్యాపిటల్ అమౌంట్ ఇస్తారనీ లోన్ కూడా ఇప్పిస్తారనీ విన్నాను. కానీ నాకవేవీ వద్దు ప్లీజ్ సర్ మీరు నా షాపుకు రావ డమే నాకొకపెద్ద అసెట్ అవుతుంది" అన్నాడు.

త్వరగా వెళ్లడానికి లేచిన చౌదరి గారు ఆ మాట వింటూనే ఒక్కక్షణం ఆగి "క్వయిట్ ఇంట్రెస్టింగ్. అదెలా? హౌ ఈజ్ ఇట్ ఎన్ అసెట్! నేను రావడమే అసెట్ ఎలా అవుతుంది" అడిగాడు ఆశ్చ ర్యంగా.

మయూర్‌కి ఈమాత్రం అవకాశం చాలు తను అనుకున్న పని సాధించడానికి.

అతడు గుక్క తిప్పుకోకుండా మాట్లాడసా గాడు. "సర్ నేను నగరంలో ఉన్న అందరు బిజినెస్ వాళ్లకు క్లబ్బులకి, ఫిలిమ్ ఇండ స్ట్రీలో పేరున్న వాళ్లకీ, రాజకీయ వేత్తలకూ అందరికీ ఇన్విటేషన్స్ ఇవ్వాలనుకుంటు న్నాను. నా షాపుకి ఛీఫ్ గెస్ట్‌గా మీరొస్తు న్నారంటే మీలాంటి బిజినెస్ టైకూన్ అందుకు ఒప్పుకున్నాడంటేనే అక్కడేదో స్పెషాలిటీ ఉందనుకుంటారు. మీరొస్తున్నా రన్న సెన్సేషన్ న్యూసే నా షాపుకి పెద్ద అడ్వర్‌టైజ్‌మెంట్‌లాగా అవుతుంది. అందరూ ఫంక్షన్‌కి తప్పకుండా అటెండవు తారు. అక్కడ షోరూంలో నేను డిస్‌ప్లే చేసిన పార్టీ పాటన్స్‌ని చూస్తారు. దానివల్ల ఇంకా తేలికగా నాక్కావల్సిన ఆర్డర్స్ రావచ్చు" ఇలా ఏకధాటిగా చెప్పుకుంటూ వెళ్తున్న మయూర్‌ని చూస్తుంటే చౌదరిగా రికి కోపం రాలేదు. అతడు తదేకంగా మయూర్ వైపు అలాగే చూస్తూండిపో యాడు. మయూర్‌కి అతని పనిపట్ల ఏకా గ్రత, నమ్మకం, అతని మెరుస్తున్న కళ్లలో కార్యదీక్షా కనిపెట్టిన చౌదరిగారికి ఆ వయ సులో తనూ అలాగే ఉండేవాడినని స్ఫుర ణకొచ్చింది.

ఈ కుర్రవాడు జీవితంలో చాలా అభివృ ద్ధిలోకి వస్తాడు అనుకుంటూనే తన పిఎ స్‌తో మయూర్ దగ్గర వివరాలడిగి ప్రోగ్రాం ఫిక్స్ చెయ్యమని చెప్పి మయూర్ వైపు తిరిగి "ఒకే యంగ్‌మాన్. సీయూ లేటర్" అంటూ లేచాడు. మయూర్ అత

నికి థాంక్స్ చెప్పి బయటకు వచ్చి పిఎస్‌తో చెప్పి డైరీలో డేట్, టైము నోట్ చేయించి బయటకు వచ్చాడు. అతనికి ఈ విషయం అపూర్వతో ఎప్పుడు చెప్పాలా అన్నంత ఆతృతగా ఉంది. కానీ ఇప్పుడు అపూర్వ, నవ్య ఇద్దరు కాలేజీలో ఉంటారు. ఇక ఏం చెయ్యాలో తోచక షాపులో పని ఎలాగు ఉంది కాబట్టి అక్కడికే బయలుదేరాడు.

అతడు షాపుకెళ్లేసరికి అక్కడ నవ్య, అపూర్వ కంగారుపడుతూ కూర్చొని ఉన్నారు. వాళ్లని చూసి ఆశ్చర్యపోతూ "అదేంటి మీరిద్దరూ ఇక్కడున్నారు? అయినా అప్పూ నీ కారేదీ ఎలా వచ్చారు" అని అడిగాడు త్వరత్వరగా.

"ఏం లేదు మయూర్ అపూర్వ కంగారు చూడలేక, నువ్వెళ్లిన పని అయిందో లేదోనని కాలేజీనుంచి ఫోన్ చేశాం కానీ నువ్వు సెల్ లేపలేదు. మేం అప్పూ డ్రైవర్‌ని తప్పించుకొని చాటుగా కాలేజీ బయటకు వచ్చి ఆటోలో ఇక్కడికొచ్చాము. ఇంతకీ నువ్వెళ్లిన పని ఏమయింది మహాశయా. ఈవిడిగారు నన్ను టెన్షన్‌తో చంపేసిందనుకో" అంది నవ్య.

అతడు జేబులోంచి సెల్ తీసి చూసుకుంటూ "ఇంతకీ టెన్షన్ ఎందుకు. అరే నేను చౌదరిగారు దగ్గరకు వెళ్తున్నప్పుడు డిస్టర్బ్ కాకూడదని సెల్ రింగ్ కాకుండా ఆపేశాను. మళ్లీ ఆన్ చెయ్యడం మరిచినట్లున్నాను" అంటూ బటన్ ప్రెస్ చేశాడు.

"ఇంతకీ వెళ్లిన పని ఏమయింది మయూర్ అది చెప్పు ముందు" విసుగ్గా చేతిలోంచి సెల్ లాక్కుంటూ అడిగింది అపూర్వ. ఆమె కళ్లల్లో కంగారు కొట్టొచ్చినట్లుగా కనబడుతోంది.

"అరే అంత కంగారెందుకు అప్పూ మీనాన్నగారు ఫంక్షన్‌కి రావడానికి ఒప్పుకున్నారు" అని మయూర్ అంటుండగానే ఆమె కళ్లలో కంగారు స్థానాన్నే సంతోషాన్ని ప్రకటిస్తూ "థాంక్‌గాడ్! హమ్మయ్య ఇప్పటిదాకా టెన్షన్‌తో చచ్చిపోయాననుకో అన్నిటి కంటే మా డాడీ ఒప్పుకుంటారో లేదో అన్నది సమస్యకాదు. అక్కడ నువ్వు ఎలాంటి అవమానం పాలవుతావోనని కంగారుపడ్డాను"

అలా అంటున్న అపూర్వ వైపు అతడు తదేకంగా చూశాడు. ఎప్పుడూ ఫ్రెష్‌గా వెలిగిపోయే అపూర్వ అలిసినట్లుగా ఉంది. ఎండన పడి ఆటోలో వచ్చినందువల్ల కాస్త రేగిన జుట్టు ఎండకు ఎర్రగా కందిన బుగ్గలతో గమ్మత్తుగా అన్పించింది.

మయూర్ వెంటనే అక్కడ పని చేసే కుర్రవాడిని పిలిచి చల్లటి మినరల్ వాటరూ, కూల్‌డ్రింక్ తెప్పించాడు. అందరూ ఒక పది నిమిషాలు రిలాక్స్ అయింతర్వాత నవ్యా, అపూర్వ వెళ్తామని లేచారు.

"అప్పూ ఫంక్షనుకు వైజయంతి ఆంటీని ఇన్వయిట్ చెయ్యడానికి నన్ను ఇంటికి రమ్మంటావా" అని అడిగాడు.

"వద్దు మయూర్! మమ్మీని నేను తీసుకు వస్తాను"

"అదెలా మీరిద్దరూ ఎందుకు వస్తున్నారని చౌదరిగారడిగితే ఏం చేస్తావు"

"నవ్య వాళ్ల అన్నయ్య నీ బిజినెస్ పార్ట్‌నరనీ నన్నూ మమ్మీని నవ్య ఆహ్వానించిందనీ చెప్పి ఎలాగో అలా మేనేజ్ చేస్తానులే మయూర్. ఇక వెళ్లాలి కాలేజీ వదిలే టైమ్ అవుతుంది"

"ఎలా వెళ్తారు. ఒక్క నిమిషం ఆగు" అంటూ పని కుర్రాడికి చెప్పి ఆటో తెప్పించాడు. వెళ్లేముందు ఆటోలో కూర్చున్న అపూర్వ చెయ్యి పట్టుకొని

"అప్పూ నువ్వెప్పుడు కూడా నా గురించి ఇంతలా వర్రీ కావద్దు. ఇలాంటి శ్రమ తీసుకోవద్దు. ఏదైనా ఎలా జరిగేదుంటే అలా జరుగుతుంది. ఓకే" అంటూ ఆమె చేతిని ఫ్రెండ్లీగా సున్నితంగా నొక్కి వదిలేసి

"మళ్లీ మనము ఫంక్షన్ రోజే కలుద్దాం.

ఎందుకంటే ఇంకా చెయ్యాల్సిన వర్క్ చాలా ఉంది. ఇన్విటేషన్స్ కూడా చాలా ఇవ్వాలి. ఏదన్నా ఉంటే నవ్యతో ఫోన్ చేయిస్తాను. ఓకే సీయూ బై" అంటూ ఆటో అతనికి భవన్స్ కాలేజీ అడ్రస్ చెప్పి పంపించాడు.

★ ★ ★

ఆఖరికి ఆ రోజు రానే వచ్చింది. మయూర్ షోరూమ్ ఓపెనింగ్ ఫంక్షను చాలా గ్రాండ్‌గా జరిగింది. అనుకున్న వాళ్లందరూ వచ్చారు. అక్కడ డిస్‌ప్లే చేసిన మినీయేచర్ పార్టీసెట్స్, కలర్ పెయింటింగ్స్, ఫ్లవర్ అరేంజ్‌మెంట్స్ అందరికీ చాలా నచ్చాయి. అక్కడికక్కడి కొందరు తమ ఇళ్లల్లో, హోటల్స్‌లో జరిగే పార్టీలకు ఆర్డర్స్ బుక్ చేసుకున్నారు. చౌదరిగారు మొట్టమొదట బోణీగా తన కూతురు అపూర్వ బర్త్‌డే పార్టీ అరేంజ్‌మెంట్ ఆర్డర్ చెయ్యడంతో అక్కడ ఉన్న ఇంకొందరు బిజినెస్ పీపుల్ కూడా కొన్ని ఆర్డర్స్ ప్లేస్ చేశారు. మొట్టమొదట రోజే మయూర్‌కి చాలా ఎంకరేజింగా అన్పించింది. ఆ రోజు షాపు ఓపెనింగ్‌కి రిబ్బన్ కట్ చేసిన అపూర్వకి మయూర్ అందంగా ప్యాక్ చేసిన గిఫ్ట్‌బాక్స్‌ని అందజేశాడు.



కానీ ఆ రోజు చౌదరిగారికి ఒక విషయం మాత్రం అర్థమయ్యింది. తను కారు దిగి వస్తున్నప్పుడు తనను రిసీవ్ చేసుకుంటున్న మయూర్ కళ్లు తన వెనకాల నిల్చున్న అపూర్వని చూసి తళుక్కున మెరవడం, అతని పెదాలు పలకరింపుగా నవ్వడం, ఆ తర్వాత అక్కడ అందరి దృష్టీ చౌదరిగారి కూతురూ, అపరంజి బొమ్మలాంటి అపూర్వ మీద నిలిస్తే అపూర్వ చూపులు మాత్రం మయూర్‌ని వెతుక్కోవడం ఇవన్నీ చౌదరి గారి నిశిత దృష్టిని దాటి పోలేదు. వాళ్లిద్దకీ ముందు నుంచే పరిచయం ఉందన్న అనుమానం వ్యక్తమయ్యింది.

ఇంటికి వెళ్లింతర్వాత చౌదరిగారు అపూర్వ డ్రైవర్‌ని పైకి పిలిపించి ఈ అబ్బాయిని అపూర్వ ఎప్పుడైనా కలిసిందా అని అడిగాడు. అపూర్వ చాలాసార్లు అతని షాప్‌కి వెళ్తుందనీ ఆ రోజు అపూర్వ ఫామ్ హౌజ్‌కి, రన్‌వే నైన్‌కి వెళ్లిన గ్రూప్‌లో ఈ అబ్బాయి కూడా ఉన్నాడనీ చెప్పాడు. అతనికి పట్టరానంత కోపం వచ్చింది కానీ ఆ కోపం వ్యక్తం చేయడానికిది సమయం కాదని దిగమింగుకుని ఆలోచనలోపడ్డాడు. సరే ఇంకెన్ని రోజులు అపూర్వ బర్త్‌డే అతి దగ్గరలోనే ఉంది ఆ రోజుతో అన్ని సమస్యలూ తీరుతాయి. ఆ బర్త్‌డే పార్టీ అరేంజ్‌మెంట్స్ మయూర్‌కే ఆర్డరివ్వడం మంచిదయింది. ఆ రోజు తన లెవలేంటో వాడి బతుకేంటో తెలుస్తుంది. ఇక అప్పు వైపు కళ్లెత్తి చూసే ధైర్యం కూడా ఎవరూ చెయ్యలేరు అనుకొని సంతృప్తి పడ్డాడు.

**ఆ** రోజు అపూర్వ ఇంటికి వెళ్లింతర్వాత తన రూమ్‌లోకెళ్లి బట్టలు మార్చుకొనే ముందు ఒక్కసారి తననుతాను అద్దంలో చూసుకుంది.

తెల్లటి ఫ్రెంచ్ షిఫాన్ దుస్తులపై సిల్వర్ త్రెడ్ ఎంబ్రాయిడరీ, మెడకు, చేతులకూ, చెవులకీ సన్నటి డైమండ్ జ్యూవెలరీతో తన కుతానే ఎంతో అందంగా కన్పించింది.

అక్కడ మయూర్ ఎవరికీ వినబడకుండా తను మాత్రమే వినేట్లుగా 'యూ ఆర్ లుకింగ్ సో బ్యూటిఫుల్ మై ఏంజిల్' అన్న మాటలు ఇంకా తన చెవుల్లో గింగురుమంటూనే ఉన్నాయి. ఆమెకు అప్పుడే బట్టలు మార్చుకోవడం ఇష్టం లేనట్లుగా మంచంపై కూర్చుండిపోయింది. తను మయూర్‌ని వదిలి వచ్చే ప్రతీసారీ తన మనసునూ, ప్రాణాన్నీ అక్కడే వదిలి వచ్చినట్లుగా నిస్సత్తువగా అన్పిస్తుంది.

అపూర్వ గట్టిగా నిర్ణయించుకుంది. తన బర్త్‌డే పార్టీరోజు మయూర్ ఎలాగో పార్టీ అరేంజ్‌మెంట్స్ అజమాయిషీకి వస్తాడు. అదేరోజు అందరిముందూ తన తండ్రి వేరొక వ్యక్తిని కాబోయే భర్తగా డిక్లేర్ చేయకముందే మయూర్‌ని తన కాబోయే భర్తగా పరిచయం చేయాలి. అప్పుడు డాడీ ఏమీ చేయలేరు. కోపం వచ్చినా అందరికీ నిజం తెలిసిపోతుంది కాబట్టి ఏమీ చెయ్యలేడు. ఇలా ఆలోచిస్తూ ఆమె మయూర్ ఇచ్చిన గిఫ్ట్ బాక్స్‌ని ఓపెన్ చేసింది. దానినిండా మయూర్ ఎప్పటినుండో కలెక్ట్ చేసిన పాటల సీడీలు, కాసెట్లూ ఉన్నాయి. వాటిని చూసి అపూర్వ ఆశ్చర్యపోయింది. అవి మయూర్ ప్రాణం... వాటిని అతడో ట్రెజర్‌లాగా చూసుకుంటాడనీ ఎవ్వరడిగినా ఇవ్వడనీ ఒకసారి నవ్య తనతో చెప్పింది. ఈ మధ్యనే తనొకసారి మయూర్‌తో 'మయూర్... నువ్వు పాడే ప్రతీ పాటా ఎంతో బాగుంటుంది. నీ దగ్గరున్న పాటల కలెక్షన్ నాకొకసారి చూపించవా?' అనడిగింది. ఆ మాత్రందానికే మొత్తంగా తనకివ్వడమంటే తన మాటకెంత విలువిస్తున్నాడో అర్థమైంది. ఇంతలో గది తలుపులు ఎవరో తడుతున్నట్లుగా శబ్దం వచ్చింది. అపూర్వ కంగారుగా లేచి ఆ బాక్స్‌ని తీసి భద్రంగా కప్‌బోర్డ్‌లో పెట్టి తాళంవేసి వెళ్ళి డోర్ తెరిచింది.

ఎదురుగా కాఫీ కప్పుతో గిరిజమ్మ నిలబడి ఉంది. "అమ్మగారు కాఫీ ఇచ్చి రమ్మన్నారు" అంది సంజాయిషీగా.

"అక్కడ పెట్టి వెళ్ళు" అంది అపూర్వ చిరాగ్గా.

డోర్ వేసుకుని అంతసేపయినా బట్టలు మార్చుకోకుండా ఉన్న అపూర్వని చోద్యంగా చూస్తూ, 'అవునూ ఇంతసేపు అమ్మాయిగారు బట్టలు మార్చుకోకుండా ఏం చేస్తున్నట్లో...' మనసులో అనుకుంటూ వెళ్ళిపోయింది గిరిజమ్మ. ఎందుకంటే ఆమెకు తెలుసు అపూర్వ బయటినుండి వచ్చిన తర్వాత ఐదు నిమిషాలు కూడా ఆగకుండా వెళ్ళి కంఫర్టబుల్‌గా ఉండే మెత్తటి కాటన్ దుస్తులు వేసుకుంటుందని.

★ ★ ★

రెండు మూడు రోజులుగా నవ్య కాలేజీకి రావడంలేదు. కారణం తెలుసుకుందామని అపూర్వ నవ్య ఇంటికి ఫోన్ చేసింది. ఫోన్ రింగవుతోంది. ఎవరూ తియ్యడంలేదు. ఏం చేయాలో తోచక అపూర్వ బుక్స్ ముందర వేసుకొని కూర్చుంది. ఏమిటో ఈ మధ్య వారంరోజులుగా మయూర్ కూడా ఫోన్ చేయడంలేదు అనుకుంది.

గిరిజమ్మ వచ్చి అపూర్వని అమ్మగారు భోజనానికి రమ్మంటున్నారని పిల్చింది. అపూర్వ కిందికి డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. ఈరోజు చౌదరిగారు ఇంటికి త్వరగా వచ్చినట్లున్నారు. ముందుగానే టేబుల్ దగ్గరవచ్చి కూర్చుని ఉన్నాడు. అపూర్వ అన్యమనస్కంగానే ఏదో భోజనం అయినట్లుగా కాస్తంత ఎంగిలిపడి లేచింది. ఆమె తినే విధానం చూసి చౌదరిగారూ, వైజయంతీ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

మర్నాడు ఉదయం అపూర్వ మామూలుగానే కాలేజీకి వెళ్ళింది. ఆరోజు కూడా నవ్య వస్తుందో రాదో అనుకుంటూనే వెళ్ళింది. క్లాస్‌రూంలో తనకంటే ముందుగానే వచ్చి కూర్చున్న నవ్యని చూస్తూనే సంతోషంగా

వెళ్ళి పలకరించింది. "ఏంటి నవ్యా ఇన్నాళ్ళుగా రాలేదేం" అనడిగింది.

"ఏంలేదు అపూర్వా. నాకు పెళ్ళిచూపులు జరిగాయి. పెళ్ళికూడా కుదిరింది. నిన్ననే సింపుల్‌గా ఎంగేజ్‌మెంట్ కూడా జరిగింది. అతను అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. పదిరోజుల్లోగా అమెరికా వెళ్ళాలట. వారంలో పెళ్ళి జరిపించమన్నారు. వచ్చే వారమే పెళ్లి" అంది కాస్త సిగ్గుపడుతూ.

"ఓ... కంగ్రాట్స్ నవ్యా. ఈ నాలుగు రోజుల్లో ఇన్ని విషయాలు జరిగాయా? మై గాడ్ నాకు ఫోన్ చేసి చెప్పచ్చుగా" అంది.

"నేను ఫోన్ చేశాను ఎంగేజ్‌మెంట్‌కి ఇన్వైట్ చేద్దామని. మయూర్ కూడా చేసి చూశాడు. కానీ మీ ఇంట్లో నువ్వు లేవని చెప్పారు. వాళ్ళు కావాలనే ఇలా నీకు ఫోన్ కాల్ వచ్చిందని తెలియనివ్వలేదేమో అనిపించింది. ఈరోజు నిన్ను పెళ్ళికి స్వయంగా ఆహ్వానిద్దామని వచ్చాను" అంటూ వెడ్డింగ్ కార్డ్ తీసి ఇచ్చింది.



వెడ్డింగ్ కార్డయితే తీసుకుంది కానీ ఆమెకు మతి పోయినట్లుగా అయ్యింది. తనకు వచ్చిన ఫోన్ కాల్స్ గురించి తనకు చెప్పకపోవడమేంటి?

"అపూర్వా ఆ విషయం గురించి ఎక్కువగా ఆలోచించకు. పెళ్ళికి తప్పకుండా రావాలి. పెళ్ళికంటే ఒకరోజు ముందు మా వాళ్ళు మెహంది ఫంక్షను చేస్తారు. అంటే మీ దాంట్లో పెళ్ళికూతుర్ని చేయడంలాగన్న మాట. నువ్వు తప్పకుండా రావాలి. ఇంకా ఈరోజు మిగతా ఫ్రెండ్సనీ, లెక్చరర్స్‌నీ కూడా కలిసి కార్డ్స్ ఇచ్చి లంచ్ తర్వాత వెళ్ళిపోతాను" అని చెప్పింది. ఇంతలో క్లాసులోకి లెక్చరర్ వచ్చారు. క్లాసు జరిగినంతసేపూ అపూర్వ చాలా రెస్ట్‌లెస్‌గానే కూర్చుంది.

నవ్య అందరికీ కార్డ్స్ ఇచ్చి లంచ్ అవర్లో వెళ్ళగానే అపూర్వ కూడా ఇంటికి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళగానే ఆపరేటర్‌ని నిలదీసింది తనకొచ్చిన ఫోన్ కాల్స్ ఎందుకు కనెక్ట్ చేయలేదని.

"సారీ మేడమ్! మీకు చదువు డిస్టర్బ్ అవుతుందని ఫోన్‌కాల్స్ వస్తే ఇవ్వొద్దని సార్ చెప్పారు" అంది నసుగుతూ.

ఆ మాట విన్న అపూర్వకి అంత పెద్ద భవంతి ఇరుకుగా జైలు గదిలా అనిపించింది. అసలు తను ఆ ఇంట్లోనుండి ఎప్పుడు బయటపడతానో అనుకుంది నిస్పృహగా.

కానీ తను అసలు తొందరపాటు లేకుండా ఈ సమస్యను పరిష్కరించుకోవాలి. దానికి మయూర్ సహాయం కావాలి. అలాగయితే తను నవ్య పెళ్ళికి తప్పకుండా వెళ్ళగలగాలి. వెళ్ళి అక్కడ మయూర్‌ని కలిసి తన సమస్యకు పరిష్కారం ఏమిటో ఆలోచించాలి. ఇలా ఆలోచిస్తూనే ఒళ్ళంతా చికాగ్గా అనిపించడంతో బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తలారా స్నానం చేసి నైటీ వేసుకొని తల తుడుచుకుంటూ అలాగే కిందికి వెళ్ళింది. బయట లాన్లో చౌదరిగారు క్లబ్బుకి వెళ్ళడానికి రెడీ అయి టీకోసం వెయిట్ చేస్తూ కూర్చున్నాడు. ఇంతలో గిరిజమ్మచేత ట్రేలో టీ కప్పులు పెట్టించుకుని బయటకొచ్చింది వైజయంతి. నవ్య పెళ్ళికి వెళ్ళడానికి పర్మిషన్ అడగాలంటే ఇదే మంచి సమయం అనుకుంటూ అపూర్వ "గిరిజమ్మా నాక్కూడా ఒక కప్పు టీ ఇవ్వు" అంటూ చౌదరిగారికి ఎదురుగా వెళ్ళి కూర్చుంది. రెండు క్షణాలు ఆగి మెల్లిగా "డాడీ..." అని ఆగింది.

ఏమిటన్నట్లుగా చూశారు చౌదరిగారు.

"మరేంలేదు డాడీ. ఒక విషయంలో మీ పర్మిషన్ కావాలి" అంది వినయంగా.

"దేనికి?"

"అదీ... మరేమో అదీ...!" నసిగింది.

"ఏ విషయం?" అసహనంగా అన్నాడు.

"ఏం లేదు నాన్నా. అదీ... నా క్లోజ్ ఫ్రెండు పెళ్ళి సెటిలయ్యింది డాడీ. నాకు వెళ్ళాలని ఉంది. ఈ ఒక్కదానికీ పంపించండి డాడీ. మళ్ళీ మిమ్మల్నెప్పుడూ ఏమీ అడగను" అంది బెదురుతూ.

ఒక్కసారి అతడు అపూర్వవైపు చూశాడు.

అప్పుడే తల స్నానం చేసి తెల్లటి నైటీలో కడిగినముత్యంలా ఉన్న అపూర్వ కళ్ళల్లో బెదురు చూసిన అతనికి నిజంగానే జాలేసింది. ఈ ఒక్కసారికే అంటోందికదా. సరే... వెళ్ళనిస్తే ఏమవుతుంది అనుకుంటూ.

"సరే వెళ్ళు. ఇంతకీ పెళ్ళెప్పుడు?" అన్నాడు.

"వచ్చే శనివారం డాడీ. ముందురోజు కూడా వెళ్ళాలి డాడీ. ఆరోజు పెళ్ళికూతుర్ని చేస్తారు" అంది.

"సరే... అయితే ఆ టైమూ అదీ చూసుకొని డ్రైవర్‌కి చెప్పి ఉంచు" అన్నాడు. ఆ తర్వాత టీ తాగి అతను క్లబ్బుకి వెళ్ళాడు.

ఎంత తెలివైన వాళ్ళయినా ఒక్కొక్కసారి పప్పులో కాలేస్తారు. అదే అతను పెళ్ళివరి

దని ఒక్క ప్రశ్నవేసుంటే అతడు అపూర్వని వెళ్ళనిచ్చేవాడేకాదు.

★ ★ ★

ఆరోజు నవ్యా వాళ్ళింట్లో మెహందీ ఫంక్షన్‌కి అపూర్వని సాయంత్రం 4 గంటలకల్లా రమ్మన్నారు. పార్టీ రాత్రి వరకూ ఉంటుందన్నారు.

ఆరోజు అపూర్వ కారు నవ్య ఇంటి ముందు ఆగగానే గేటు దగ్గర నిలబడి లైట్లు అలంకరించే పనిని పర్యవేక్షిస్తున్న మయూర్ కారుడోర్ తీసి పట్టుకొని తమాషాగా కిందికి వంగి ఒక చెయ్యి స్వాగతం చెప్తున్నట్లుగా చాపి, "వెల్‌కం టు మై ఏంజిల్" అంటూ చిరునవ్వుతో ఇంకో చెయ్యి ఆమెకందించాడు.

మయూర్‌ని చూడగానే ఆమెకు ప్రాణం లేచివచ్చినట్లయింది. డ్రైవరున్నాడని కూడా మరిచి ఆ చెయ్యందుకొని కారు దిగింది.

మయూర్ అపూర్వవైపు రెప్ప ఆర్పకుండా చూడసాగాడు. గ్రీన్, రస్ట్ కలర్‌ల కాంబినేషన్ కలిగిన చాందినీ మెటీరియల్‌పై చమ్కీ వర్క్ చేసిన అందమైన గాగ్రాచోళీ వేసుకొని కుందన్ వర్క్ నగలు పెట్టుకొని కుందనపు బొమ్మలా ఉన్న అపూర్వపైనుండి అతడు దృష్టి మరల్చలేకపోయాడు.

అపూర్వ తనే ముందుగా తేరుకొని "లోపలికి వెళ్దామా మయూర్?" అంది. మయూర్ అపూర్వని చెయ్యిపట్టుకుని అలాగే లోపలికి తీసుకెళ్ళి నవ్యముందు నిలబెట్టాడు.

నవ్య అపూర్వవైపు ఆశ్చర్యంగా చూస్తూ ఆమెను గట్టిగా హత్తుకుంది. "నువ్వు రాలేవనే అనుకున్నాను అప్పూ. థాంక్ గాడ్, రాగలిగావు" అంటూ తన పక్కనే కూర్చోబెట్టుకుంది. "నువ్వు రావనే అనుకున్నాం. కానీ నువ్వు తప్పకుండా వస్తావని మయూర్ నాతో బెట్ కూడా కట్టాడు" అంది మళ్ళీ నవ్య నవ్వుతూ.

అపూర్వకి అక్కడ వాతావరణం కొత్తగా, గమ్మత్తుగా అన్పించింది. నవ్యా వాళ్ళింట్లో ఫ్లోర్‌పైన అందరూ కూర్చోడానికి కార్పెట్లు పరిచారు. వాటిపైన అక్కడక్కడా గ్రూపులుగా చేరి రకరకాలుగా అలంకరించుకున్న ఆడవాళ్ళు, పిల్లలూ కూర్చున్నారు. ప్లాస్టిక్ పేపర్‌తో తయారుచేసిన కోన్‌లలో గోరింటాకు ముద్దలు వేసి ఐదారుగురు అమ్మాయిలు ఎంతో నైపుణ్యంగా వాళ్ళ చేతులకు చక్కటి డిజైన్‌లతో గోరింటాకు అద్దుతున్నారు. అపూర్వ నవ్య చేతులవైపు చూసింది. నవ్య చేతులకు గోరింటాకు వెయ్యడమూ, తియ్యడమూ రెండూ అయినట్లున్నాయి. ఎర్రగా పండిన నవ్య చేతులు చూస్తూ అనుకుంది అపూర్వ.

"నాకు రాత్రే వేశారు అప్పూ. ఒక రాత్రంతా గోరింటాకు అలాగే ఉంచుకుంటేనే ఎర్రగా పండుతుందన్నారు" అంది.

ఇంతలో నిరాలీ వచ్చి తన చేతులు చూపిస్తూ "ఇంతకీ నా డిజైన్ ఎలా ఉంది అపూర్వా దీదీ" అంది.

ఆ చిన్నచిన్న తెల్లటి చేతులకు తీగలుగా వేసిన డిజైను చాలా బాగా నప్పింది.

ఇంతలో నవ్య ఖాళీగా ఉన్న అమ్మాయిని పిల్చి అపూర్వ చేతులకి కూడా గోరింటాకు వెయ్యమని చెప్పింది.

ఆ అమ్మాయి డిజైన్ బుక్ చూపించి ఏ డిజైను వెయ్యమంటారు అనడిగింది. అందులోంచి అపూర్వ ఒక డిజైన్ సెలెక్ట్ చేసి చూపించింది. అపూర్వ చేతులు గోరింటాకు వేయించుకుంటున్నా కళ్ళు మాత్రం మయూర్‌కోసం వెతుకుతున్నాయి.

ఇంతలో మయూర్ లోపలికి వచ్చి ఫ్రిజ్ దగ్గరకు వెళ్ళి నీళ్ళ బాటిల్ తీసుకొని నీళ్ళు తాగుతున్నాడు. అపూర్వ వెంటనే గోరింటాకు పెట్టించుకోవడం ఆపి ఒక్క ఉదుటున లేచి మయూర్ దగ్గరకు వెళ్ళింది.

"మయూర్ నేను అర్జంటుగా నీతో ఒక విషయం మాట్లాడాలి" అంది కాస్త లోగొంతుకతో.

"ఇక్కడా... ఎలా? అసలు విషయమేమిటి? " అన్నాడు మయూర్ అక్కడికి కాస్త దూరంగా కూర్చున్న వాళ్ళవైపు కాస్త ఇబ్బందిగా చూస్తూ.

"మయూర్ ఐ యామ్ సీరియస్ ఎబౌట్ ఇట్. నేనీరోజు నీతో చాలా మాట్లాడాలి. నేను ఈ రోజిక్కడికి చాలా కష్టంగా రాగలిగాను. మా నాన్నగారికి ఈరోజు నేనిక్కడికి వచ్చినట్లు డ్రైవర్ ద్వారా తప్పకుండా తెలుస్తుంది. నేను రేపు పెళ్ళికి రాలేకపోవచ్చు. పోనీ ఇక్కడ అందరూ ఉన్నారనుకుంటే నీ ఇంటికి వెళ్ళి మాట్లాడుకుందాం" అంది.

మయూర్ ఒక్క క్షణం ఆలోచించి "నువ్వు తప్పదంటే సరే. కానీ ఇలా ఉన్నపళంగా వెళ్ళలేం. నువ్వు అదును కనిపెట్టి ముందుగా వెళ్ళు. ఇవిగో నా ఇంటి తాళాలు. ఇంట్లో ఎవరూ లేరు. కానీ నువ్వు వెళ్ళేటప్పుడు నాకు చిన్న హింట్ ఇవ్వు. నువ్వు వెళ్ళిన కాసేపటికి నేను వస్తాను" అంటూ అక్కడ్నించి వెళ్ళాడు.

ఆ తర్వాత టైమంతా చాలా త్వరగా గడిచిపోయింది. వియ్యాలవారొచ్చేసరికి నవ్యకి కొత్తదుస్తులు వేసి నగలలంకరించి జడ నిండా పూలుచుట్టి అందంగా అలంకరించారు. బయట షామియానాలో స్నాక్స్ భోజనాలకు త్వరత్వరగా ఏర్పాట్లు చేయసాగారు. ఈ నార్త్ ఇండియన్స్ ఈ మెహందీ పార్టీ అంటే మన తెలుగువాళ్ళు పెళ్ళికూతుర్ని చేసే పద్ధతే కానీ వాళ్ళ దాంట్లో పెళ్ళికూతురితోపాటు ఫంక్షన్‌కి వచ్చిన పిల్లలకీ, స్నేహితులకీ కూడా గోరింటాకు పెట్టిస్తారు. వెనుకటి మన సాంప్రదాయం కూడా అమ్మాయిన్ని పెళ్ళికూతురిగా చేసినరోజు ముత్తైదువులకీ, పడుచుపిల్లలకీ గాజులు వేయించడం ఆచారంగా ఉండేది.

కాకపోతే వీళ్ళదాంట్లో గోరింటాకు సంబరంలో మగపెళ్ళివారిని భోజనానికి ఆహ్వానిస్తారు. వాళ్ళు వచ్చి కాబోయే కోడల్ని దీవించి దుస్తులు, నగలు బహూకరిస్తారు.

సుమారు ఆరుగంటల ప్రాంతంలో వియ్యాలవారొచ్చారు. అక్కడంతా చాలా సందడిగా అయిపోయింది. వియ్యాలవారికి మర్యాదలు చేయడం, ఆ తర్వాత యువతీ యువకులు, చిన్నాపెద్దా అందరూ కలిసి పాటలు పాడుతూ, డాన్సులు చేయడం జరుగుతుంది.

అపూర్వ ఇదే అదనుగా భావించి మెల్లిగా లేచి మయూర్ గమనించేటట్లుగా అతని ముందునుంచే వెళ్ళింది.

ఆమె ఆ చీకట్లో తన డ్రైవర్ కంటబడకుండా గబగబా నడుచుకుంటూ మయూర్ ఇంటికి వెళ్ళి తాళంతీసి లోపలికి వెళ్ళింది. ఆమె ఒక్కసారి ఇల్లంతా కలయచూసింది. ఇదే ఇక ముందునుండీ తను ఉండబోయే తన స్వతంత్ర సామ్రాజ్యం అన్నంత ఇదిగా చూస్తూ ఎవరన్నా సడన్‌గా వస్తే కింద ఇంట్లో ఉంటే కనబడతానన్న భయంతో పైన మయూర్ గదిలోకి వెళ్ళి కూర్చుంది.

కాసేపటికి కిందనుండి మయూర్ మృదు గంభీరమైన గొంతు వినపడింది "అప్పూ వేర్ ఆర్ యూ మై ఏంజిల్" అంటూ.

అపూర్వ గొంతు పూడుకుపోయినట్లుగా మాటే రాలేదు. అతడే వెతుక్కుంటూ పైకి వచ్చాడు.

అతడు లోపలికి రాగానే ఆమె అతన్ని ఒక్క ఉదుటున వచ్చి గట్టిగా హత్తుకుపోయి ఏడవసాగింది.

అనుకోకుండా జరిగిన ఈ సంఘటనతో అతనికి ఏం చేయాలో తోచలేదు. "అప్పూ ఏమిటిది? ఏం జరిగిందసలు? " అంటూ ఆమె భుజాలు పట్టుకొని తననుంచి వేరు చేయడానికి ప్రయత్నించాడు.

"మయూర్ ప్లీజ్ నన్నిక్కడే ఉండనియ్యి. నేను మా ఇంటికి వెళ్ళను. నేను ఇంక ఆ జైలు జీవితానికి స్వస్తి చెప్పాలనుకుంటున్నాను. నువ్వు సరే అంటే నేను కారు డ్రైవర్ని పంపించేస్తాను. ఆ తర్వాత మా డాడీ వచ్చినా నన్ను తీసుకెళ్ళలేరు" అంది

వెక్కిళ్ళమధ్య.

"అప్పూ... నువ్వు చాలా ఆవేశంలో ఉన్నావు. ముందు నువ్వు రిలాక్స్ అవు. ఆ తర్వాత ఏం జరిగిందో వివరంగా చెప్పు" అంటూ ఆమెను పక్కనే ఉన్న మంచంపై కూర్చోబెట్టాడు.

అక్కడే టేబుల్ పైన ఉన్న వాటర్ బాటిల్లోనుండి గ్లాసులోకి నీళ్ళు వంపి ఇచ్చాడు.

ఆమె నీళ్ళు తాగిన తర్వాత కాస్త రిలాక్స య్యింది.

"ఇప్పుడు చెప్పు అసలేం జరిగింది? " అన్నాడు.

"మా డాడీ నా బర్త్ డే రోజు నాకు నిశ్చయించిన వరుడ్ని అందరిముందూ డిక్లేర్ చేస్తారట. ఆరోజే అతనితో నా మ్యారేజ్ ఫిక్స్ అయినట్లుగా నాచేత అతనికి ఎంగేజ్ మెంట్ రింగ్ తొడిగిస్తారుట. అంతా డిసైడ్ అయిపోయింది మయూర్. ఆ తర్వాత మనమేమీ చేయలేం"

ఈ మాటలు వింటూనే అతడు కాస్త ఆలోచించి, "నీ బర్త్ డేకి ఇంకా పదిహేను రోజుల టైముంది కదా. అప్పటివరకూ వెయిట్ చేద్దాం" అన్నాడు.

"నేనూ అదే అనుకున్నాను మయూర్. కానీ ఈరోజు నేను ఇంటికి వెళ్ళానంటే నా బర్త్ డేరోజు తప్ప నిన్ను నేను మళ్ళీ చూడలేను. ఇంట్లో నాకు ఫోన్ కాల్స్ కూడా ఇవ్వడంలేదు. అదీకాక నాకు డాడీ ముందు నోరెత్తే - ధైర్యంలేదు. ఈరోజు ఇక్కడికి వచ్చానని తెలిస్తే నన్ను కాలేజీకి కూడా పంపరు.

"మయూర్ నన్ను మళ్ళీ ఆ ఒంటరితనంలోకి పంపకు. అసలే నాకీమధ్య పీడకలలు చాలా వస్తున్నాయి. నేను అక్కడికి వెళ్తే మళ్ళీ నీ దగ్గరకు రాలేనేమో అని భయం వేస్తోంది. నన్ను నీ దగ్గర్నుండి పంపించకు ప్లీజ్" అంటూ అతన్ని గట్టిగా కరుచుకుపోయింది.

అతడు కూడా ఆమెని వారించే ప్రయత్నం చేయలేదు.

ఉన్నట్లుండి అక్కడ నిశ్శబ్దం ఆవరించింది. ఒక అరగంట తరువాత మయూరే ముందు తేరుకున్నాడు. అతడు అపూర్వకి ఎన్నోవిధాల నచ్చచెప్పాడు.

అపూర్వ బర్త్ డే పార్టీరోజు తను అక్కడే ఉంటాననీ చౌదరిగారికంటే ముందే మనం పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్న విషయం అనౌన్స్ చేద్దాం అనీ ప్రామిస్ చేశాడు. అయినా కూడా అపూర్వ అయిష్టంగానే అక్కడినుంచి వెళ్లింది. ఆమె నవ్యావాళ్ళింటికి వెళ్ళకుండా సరాసరి చౌదరిగారింటికే వెళ్ళింది.

ఆమె వెళ్ళిన కాసేపటికి మయూర్ నవ్యావాళ్ళింటికి వెళ్ళి ఏమీ జరగనట్లుగా ఆ గ్రూప్‌లో కలిసిపోయాడు. అక్కడ నవ్య అపూర్వ గురించి చూస్తుంటే మాత్రం చౌదరిగారు త్వరగా రమ్మని ఫోన్ చేస్తే తనకు చెప్పి ఇంటికి వెళ్ళిపోయిందని చెప్పాడు మయూర్.

★ ★ ★

ఆ తర్వాత పదిహేను రోజులూ పదిహేను యుగాలుగా గడిచాయి అపూర్వకి. ఆరోజు రానేవచ్చింది. ఆరోజు చాలా హడావిడిగా ఉంది. ఉదయంనుండే పార్టీ అరేంజ్ మెంట్స్ జరుగుతున్నాయి. చౌదరిగారు ఇంకా ఆహ్వానితులకు ఫోన్లు చేస్తూనే ఉన్నారు. సుమారు 8 గంటలకు పార్టీ స్టార్ట్ అయ్యింది, వచ్చేవాళ్ళు వస్తున్నారు. మయూర్‌వాళ్ళు పార్టీ అరేంజ్ మెంట్స్ చాలా బాగా చేశారు. ఆ ఫ్లోరల్ డెకరేషన్, లైటింగ్ అరేంజ్ మెంట్స్ చూసి అందరూ బాగుందని పొగుడుతున్నారు. ఆరోజు అపూర్వా, వైజయంతీ, చౌదరిగారు, స్పెషల్‌గా డిజైన్ చేసిన దుస్తులూ, నగలూ వేసుకున్నారు. ఇంతలో అక్కడికి అపూర్వకి కాబోయే వరుడిగా నిర్ణయించిన అబ్బాయి వినయ్, అతని తల్లితండ్రులూ వచ్చారు.

చౌదరిగారూ, వైజయంతీ వాళ్ళను సాదరంగా రిసీవ్ చేసుకొని కూర్చోబెట్టారు. అపూర్వ తను చూడకుండానే తనకు తన తండ్రి నిర్ణయించిన వరుడెలా ఉన్నాడోనని ఓరకంట చూసింది.

'ఫర్వాలేదు బాగున్నాడే' అనుకుంది. మయూర్ తన జీవితంలోకి రాకుండా ఉంటే ఇతను తనకన్నివిధాలా తగినట్లుగానే ఉన్నాడు. కానీ పాపం డాడీ మొండిపట్టుదలవల్ల ఈరోజు అనవసరంగా ఆ అబ్బాయి అవమానం పాలౌతున్నాడు. తను మయూర్‌ని పెళ్ళి చేసుకోబోతున్న విషయం అనౌన్స్ చేయగానే చిన్నబోయే అతని ముఖం తల్చుకుని కాస్త బాధపడింది అపూర్వ. కేక్ కట్ చేయడానికి ఇంకా పది నిమిషాలు టైముంది. అప్పటికి ఆహ్వానితులు అందరూ వచ్చారు. కేక్ కట్ చేయగానే డాడీ వినయ్‌ని అందరికీ పరిచయం చేసి తన కాబోయే వరునిగా అనౌన్స్ చేస్తాడు. అందుకే ఈ లోపలే మయూర్, తనూ కలిసి డయాస్‌పైకి వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. 'అదిగో మయూర్ లేచి డయాస్ పైకి వెళ్తున్నట్లున్నాడు' అనుకుంటూ అపూర్వ తను కూర్చున్నచోటు నుండి లేవబోయింది.

ఇంతలో కాస్త దూరంగా ఏదో గొడవ జరుగుతున్నట్లుగా అన్పించింది. అందరూ అటువైపు తిరిగారు. సుమారు పన్నెండు, పదమూడేళ్ళ వయసున్న అబ్బాయి లోపలికి పరుగెత్తుకొచ్చినట్లున్నాడు. అతన్ని వాచ్‌మెన్ పట్టుకున్నాడు. ఆ అబ్బాయి చౌదరిగార్ని చూస్తూ, "డాడీ ఇతను నన్ను లోపలికి రానివ్వడంలేదు చూడు. మమ్మీ ఏమో ఈ రోజునుండి నువ్వు మీ డాడీ ఇంట్లో ఉండు. నేనిక్కడినుండి వెళ్ళిపోతున్నాను అని చెప్పి పంపించింది" అని అంటుండగానే చౌదరిగారి ముఖం రౌద్రంగా మారిపోయింది.

"యూ డర్టీ డెవిల్, నువ్వన్నంత పనీ చేశావన్నమాట. ఉండు ఇప్పుడే నీ అంతు చూస్తాను" అంటూ ఆ అబ్బాయిని పక్కకు తోసి కోపంగా పోర్టికోవైపువెళ్ళి తనే స్వయంగా కారు నడుపుకుంటూ వెళ్ళిపోయాడు.

అతడు తోయడంతో కిందపడ్డ ఆ అబ్బాయి ఏడ్చుకుంటూ లేచి నిలబడి, "డాడీ! మమ్మీ నీకో లెటరియ్యమంది" అని వెళ్ళే కారువైపు చూస్తూ అన్నాడు. కానీ అప్పటికే ఆ కారు బుల్లెట్‌లా బయటకు దూసుకుపోయింది.

అనుకోకుండా జరిగిన ఆ సంఘటనతో అక్కడున్నవారంతా ఏమీ అర్థంకాక నోట మాట రానట్లుగా నిలబడిపోయారు. అందరిలో ముందుగా వైజయంతి కోలుకొని ఆ అబ్బాయి దగ్గరకు వెళ్ళి తీసుకొచ్చి కూర్చోబెట్టింది. గిరిజమ్మతో కూల్‌డ్రింక్ తెప్పించి తాగించింది. ఆమె కొంతవరకూ పరిస్థితి అర్థం చేసుకుంది.

"నీ పేరేంటి బాబూ, నువ్వెవరు? " అనడిగింది.

"నా పేరు ఆదిత్య ఆంటీ. ఆ వెళ్ళినతను మా డాడీ" అన్నాడు.

"మీ మమ్మీ పేరేంటి? " ఆమె స్వరం కాస్త వణికినట్లుగా అయ్యింది.

"సమీర" అన్నాడు.

వైజయంతికి ఆశ్చర్యమేమీ కలగలేదు. ఆమె కాస్త ఊహించగల్గింది. ఆమె ఆదిత్య చేతినుండి ఉత్తరం తీసుకుని మనసులోనే నిశ్శబ్దంగా చదువుకుంది.

శ్రీయుతులు చౌదరిగార్కి,

నేను మిమ్మల్ని మొదట్లో ఏ కారణంగా దరిచేరినా ఇప్పుడు మన అబ్బాయి చి.ఆదిత్యకు సంఘంలో గౌరవం కల్పించమని అడిగాను. మీరు అది తప్ప నాకు అన్నీ ఇచ్చారు.

కానీ నాకు నా కుమారుని భవిష్యత్తే ముఖ్యం. వాడికి ఇప్పుడు తల్లిగా నా అవసరం కంటే తండ్రిగా మీ అవసరమే ఎక్కు

వగా ఉంది. నేను నిన్నటివరకూ వానికి సమాజంలో గుర్తింపు నివ్వమని వేడు కుంటూ వచ్చాను. కానీ నా మాటకు మీరు విలువనివ్వలేదు. అందుకే నేను ఈ నిర్ణ యానికి వచ్చాను.

వాడు మీ కొడుకే అని అందరికీ తెలిసే సమయానికి నేను ఈ లోకంలోనే ఉండను. మీరు వాణ్ణి కొడుకుగా ఆదరిస్తారో లేక అనా థగా విసిరి పారేస్తారో మీ ఇష్టం.

ఇట్లు
సమీర

ఆ ఉత్తరం చదివిన వైజయంతి కాసేపు స్తబ్దంగా నిలబడింది. పార్టీకి వచ్చిన వాళ్లం దరూ తనవంకే చూస్తున్నారని గ్రహిం చింది. అంతలో తన కర్తవ్యం గుర్తుకు వచ్చి వెంటనే చౌదరిగారి పిఏని పిలిచి పార్టీకి వచ్చిన వాళ్లందర్నీ ఉద్దేశించి పార్టీ కాన్సిలయిందని అనౌన్స్ చేయించింది. అందరికీ కలిగించిన ఇబ్బందికి మన్నించా ల్సిందిగా కోరింది. గెస్టులందరూ వెళ్లేవరకూ ఓపికగా అక్కడే నిలబడిపోయింది. అందరూ వెళ్లిపోయారు. ఆ ప్రదేశమంతా నిశ్శబ్దంగా మారింది. వైజయంతీ, అపూర్వా అచేతనంగా నిలబడిపోయారు. మయూర్ కూడా చేసేదేం లేక అపూర్వ వైపు చూసి కళ్లతోనే వీడ్కోలు చెప్పి వెళ్లిపోయాడు.

అపూర్వ వైజయంతి దగ్గరకు వచ్చి "ఏమ య్యింది మమ్మీ అసలేమిటిదంతా" అనడి గింది. దానికి సమాధానంగా ఆమె సమీర రాసిన ఉత్తరం అపూర్వ చేతిలో పెట్టింది. అపూర్వ ఆ ఉత్తరాన్ని చదివి తదేకంగా ఆది త్యవైపు చూసింది. కానీ వాణ్ణి చూస్తుంటే అపూర్వకి చాలా జాలికల్గింది. తనలాగే వాడూ తన తండ్రికి పుట్టిన వాడే వాడికెం దుకీ శిక్ష. ఈ చిన్న వయసులో ఈ సంఘ టన వాడి మనసులో ఎంత అలజడి రేపు తుందో అనుకుంటూ "మమ్మీ పద. లోపలి కెళ్దాం" అంటూ ఆదిత్యను చెయ్యి పట్టుకొని నడిపించుకుంటూ లోపలికి తీసికెళ్లింది.

జరిగింది చిన్న విషయమేమీ కాదని అందరికీ తెలుసు. ఎవ్వరూ ఒకరి ముఖా ల్లోకి ఒకరు చూసుకో లేకపోతున్నారు. ఏమి చెయ్యాలో తెలియని పనివాళ్లు అలాగే నిలబడిపోయారు. వైజయంతీ, అపూర్వా ఆదిత్యని గిరిజమ్మకి అప్పగించి తినడానికే దయినా పెట్టమని చెప్పి పై గదుల్లోకి వెళ్లి పార్టీ దుస్తులు మార్చుకొని కిందికి వచ్చారు. ఇంకా అక్కడే ఉన్న చౌదరిగారి పిఏని పిల్చి పార్టీకని వండిన భోజనం, బర్త్‌డే కేకూ తీసికెళ్లి అక్కడెక్కడన్నా స్లమ్ ఏరియాకి తీసికెళ్లి పనివాళ్ల సాయంతో పంచిపెట్టమని కోరింది. మిగతా నౌకర్లంద రినీ చేసే పనులు చేసుకొని భోంచేసి వెళ్ల మంది. ఇంతలో గిరిజమ్మ వచ్చి ఆ బాబు ఏమీ తినడం లేదని చెప్పింది.

"నేను మా మమ్మీ దగ్గరకు వెళ్తాను. అంటీ అక్కడే భోంచేస్తాను" అన్నాడు ఆదిత్య.

"మీ మమ్మీ దగ్గరకు డాడీ వెళ్లాడు కదా! మనం రేపు వెళ్లి మీ మమ్మీని ఇక్కడికి తీసుకొని వద్దాం సరేనా" అంది అపూర్వ.

"అమ్మా! మీరిద్దరు కూడా తినండమ్మా అలా ఉపవాసముండటం మంచిది కాదు" అంటూ గిరిజమ్మ వైజయంతినీ, అపూర్వను బతిమిలాడి దగ్గరుండి వడ్డించింది.

ఆమె మాట తీసివెయ్యలేక ఏదో తిన్నా మన్పించి లేచారు.

ఇంతలో ఫోన్ రింగయ్యింది. అక్కడే నిలబడి ఉన్న పిఏ రామ్మూర్తి ఫోన్ తీసు కున్నాడు "హలో ఆ అలాగా ఎక్కడా ఇప్పు డెక్కడున్నారు. ఆ బయలుదేరుతున్నాం" అంటూ ఫోన్ పెట్టేసి కంగారుగా వైజయం తితో "మేడమ్ సార్‌కి యాక్సిడెంట్ అయ్యిందట. కారు వేగంగా నడుపుతూంటే లారీకి తగిలిందట. అయ్యగారికి బాగా దెబ్బలు తగిలి అపోలో హాస్పిటల్‌లో ఉన్నారంట"

వైజయంతీ, అపూర్వా గిరిజమ్మతో ఆది

త్యను జాగ్రత్తగా చూసుకొమ్మని చెప్పి రామ్మూర్తితో కలిసి త్వరగా హాస్పిటల్ కి వెళ్లారు.

అక్కడ చౌదరిగారి పరిస్థితి ఏమీ బాగా లేదు. ఒళ్లంతా బాగా దెబ్బలు తగిలాయి. ఇంటెన్సివ్ కేర్ లో ఉంచారు. చూడడానికి ఎవ్వరినీ అనుమతించలేదు. చౌదరి గారు సమీర ఇంటికి వెళ్తుంటే దోవలోనే ఆక్సిడెంట్ అయింది. తప్పంతా చౌదరిగారిదే. కారు చాలా వేగంగా నడుపుతుండడంతో అదుపు తప్పి లారీని కొట్టుకుంది.

చౌదరిగారు సమీర దగ్గరకు వెళ్లలేదని అర్థమయిన వైజయంతి రామ్మూర్తిని సమీర ఇంటికి పంపించింది. కానీ అక్కడ ఇంకా ఘోరం జరిగింది. సమీర స్లీపింగ్ పిల్స్ మింగి ఆత్మహత్య చేసుకుంది. తన చావుకి ఎవరూ బాధ్యులు కారనీ తనకే జీవితేచ్ఛ నశించిందనీ అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాననీ ఉత్తరం రాసి పెట్టింది.

డాక్టరుగారు వైజయంతితో చెప్పారు "ఆయనకింకా స్పృహ రాలేదు. ఎప్పటికొస్తుందో కూడా తెలియదు. తలకు బాగా గాయం అయింది ఏమీ చెప్పలేం" అన్నాడు.

"మేడమ్ మీరూ అపూర్వ గారు ఇంటికి వెళ్లండి. ఇక్కడ నేనుంటాను. సార్ కి స్పృహ రాగానే నేను ఫోన్ చేస్తాను" అన్నాడు రామ్మూర్తి.

"నేను కూడా ఇక్కడే ఉంటాను. నువ్వు డ్రైవర్ తో ఇంటికి వెళ్లు అపూర్వా. అక్కడ ఆదిత్యను చూసుకో" అంది.

అపూర్వ వెళ్లగానే "రామ్మూర్తీ సమీర తరపు బంధువు లెవరన్నా ఉన్నారేమో కనుక్కొని ఆమె చావు కబురు చెప్పి పంపించు. సమీర అంత్యక్రియలు చేసే బాధ్యత మనదేకదా! ఈ పరిస్థితిలో ఆదిత్యను శ్రద్ధగా కాపాడాలి అంది'

ఆ మాటలంటున్న వైజయంతిపై అతనికి ఎంతో గౌరవం కలిగింది. ఆమె దేవతలా కనబడింది. ఆ మరునిమిషం నుండి అతను ఆ పనిమీదే ఉన్నాడు.

**మూ**డు రోజుల తరువాత హాస్పిటల్ నుండి వైజయంతి ఇంటికి ఫోన్ చేసి నాన్నగారికి స్పృహ వచ్చిందనీ ఆమెను త్వరగా రమ్మని ఫోన్ చేసింది. అపూర్వ ఆతృతగా అక్కడకు వెళ్లింది.

"అప్పూ డాడీకి స్పృహ వచ్చింది. కానీ డాడీ నిన్నొక కోరిక కోరారు నాన్నా" అంది.

"ఏమిటది మమ్మీ"

"నీ పెళ్లి జరగాలని కోరుతున్నాడు. నువ్వు పెళ్లి చేసుకొని పెళ్లి బట్టల్లో వరునితో సహా నిన్ను చూడాలని కోరుతున్నారు అప్పూ" అంది.

"ఈ సమయంలో పెళ్లా అదెలా సాధ్యం" అంది.

"ప్లీజ్ అప్పూ కాదనకు. నాన్నగారి పరి



స్థితి ఏమీ బాగాలేదు. ఇదే ఆయన కోరే ఆఖరి కోర్కె కావచ్చు" అంటూ రెండు చేతులలో ముఖం కప్పుకుని ఏడవసాగింది వైజయంతి.

"సరే మమ్మీ... డాడీ కోరిక నా పెళ్లి జరగాలనీ. వధూవరులను పెళ్లి బట్టల్లో చూడాలనే అయితే నేను మయూర్‌ని పెళ్లి చేసు



కుంటాను. నువ్వు సరే అంటే నేను మయూర్‌ని ఇక్కడికి పిలిపిస్తాను" అంది.

అందుకు ఒక్క క్షణం ఆలోచించి సరే అంది వైజయంతి.

అపూర్వ మయూర్‌కి ఫోన్ చేసింది. కానీ రెస్పాన్స్ లేదు. ఎన్నోసార్లు ట్రై చేసింది కానీ కలవలేదు. మమ్మీ నేనే వెళ్లి తీసుకొస్తాను అంటూ గబగబా వెళ్లిపోయింది.

అపూర్వ షాప్‌కి వెళ్లేసరికి అక్కడ మయూర్ లేడు. అప్పుడే ఇంటికి వెళ్లాడని చెప్పారు. ఆమె నేరుగా డ్రైవర్ని కారు మయూర్ ఇంటికి పోనివ్వమంది. పావుగంటలో కారు అక్కడ ఆగింది. ఆమె చటుక్కున కారుడోర్ తెరుచుకొని దిగి ఇంట్లోకి వెళ్లింది. కింద ఎవరూ లేరు. పైన ఏవో మాటలు వినబడుతున్నాయి. పైన ఉన్నాడనుకొని గబగబా మెట్లెక్కింది. రూమ్ ముందరికి వచ్చేసరికి మాటలు క్లియర్‌గా వినబడుతున్నాయి.

"ఒరేయ్ ఏమయింది. ఎందుకలా డల్‌గా ఉన్నావు" అంటున్నారెవరో.

"ఆ ఏముంది నిన్నటివరకూ అపూర్వతో పెళ్లి జరుగుతుంది అని సరదాగా ఉన్నాను. కానీ ఏమిటో అది కానిపని అన్పిస్తోంది" అంటున్నాడు మయూర్ హిందీలో.

"ఏం ఎందుకని అపూర్వంటే నీకిష్టమేగా"

"ఏమో కోటీశ్వరుడి ఏకైక వారసురాలు ఏ బాదరబందీ ఉండదనుకున్నాను. పెళ్లయితే ఆస్తంతా నాదే అనుకున్నాను. యే బచ్చీకో అఖల్ కమ్‌హై తోడా"

'ఎంతసేపూ ఇల్లు వదిలి వస్తాను. పెళ్లి చేసుకో అంటుంది. నేను కోటలో పాగా వెయ్యాలనుకుంటే ఇదెక్కడి గోలరా బాబూ. ఇంకా అక్కడ ఒక లిటిగేషన్ మొదలయింది.

ఆ అమ్మాయికి ఒక తమ్ముడు కూడా ఉన్నట్టున్నాడు.

ఇంక నేనేం పెళ్లి చేసుకోవాలి. అప్పటి నుండీ ఫోన్ చేస్తున్నట్టుంది తప్పించుకోవడానికి ఆఫ్ చేస్తున్నాను" అంటున్నాడు మయూర్

ఆ మాటలు వింటున్న అపూర్వకి భూమి రెండుగా చీలి తను అందులోకి వెళ్లిపోతే బాగుండునన్పించింది. కానీ తనేం తప్పు చేసిందని తను ముఖం చాటేసుకోవడం. తనకు మేక వన్నె పులిలాంటి అతని నిజ స్వరూపం బయటపడిందని అతనికి తెలియాలి అనుకుంటూనే గదిలోకి వెళ్లింది.

అపూర్వని చూస్తూనే మంచంపై కూర్చొన్న అతనూ అతని స్నేహితులూ గబుక్కున లేచి నిలబడ్డారు.

మయూర్‌ని చూసిన అపూర్వ ఏమీ మాట్లాడలేక పోయింది. కానీ ఎంతో కసిగా అతని చెంపపై గట్టిగా లాగి ఒక దెబ్బవేసి అతని వైపు చూస్తేనే పాపం అన్నట్లుగా గిరుక్కున వెనక్కు తిరిగి వచ్చేసింది. ఆ తర్వాత మళ్లీ తన జీవితంలో ఇన్నేళ్లు అతడెక్కడా తారసపడలేదు. సుమారు పదకొండేళ్ల తర్వాత ఇక్కడ ఇలా చూసింది.

ఆ రోజు మయూర్ దగ్గర నుండి వచ్చేసింతర్వాత వైజయంతి జరిగిన విషయం తెలుసుకొని తన వివాహం వినయ్‌తో జరిపించింది.

పసుపు బట్టల్లో వధూవరులను చూసిన చౌదరిగారు తృప్తిగా కన్నుమూశారు. అతని వీలునామా ప్రకారం ఆస్తి తన స్వార్జితం కాబట్టి అంతా అపూర్వకే చెందాలనీ ఆ ఆస్తిని ఏం చెయాలనుకున్నా అన్ని హక్కులూ అపూర్వకున్నాయని లాయరుగారు వెల్లడించారు. కానీ అపూర్వ తనకి సంక్రమించిన ఆస్తిలో సగభాగం ఆదిత్యకు రాసింది. అతడు పెరిగి పెద్దవాడయ్యేవరకు ఆ ఆస్తి సంరక్షకురాలిగా అతని ఆలనాపాలనా చూసే బాధ్యత వైజయంతికి అప్పగించింది. చౌదరిగారి పిఏస్ రామ్మూర్తి సహాయంతో వైజయంతిని బిజినెస్ వ్యవహా

రాలు చూసుకోవాలని కోరింది.

మయూర్ జ్ఞాపకాలను మరచిపోవడానికి తనకు చాలాకాలం పడ్తుందనీ వినయ్‌తో పాటు హయ్యర్‌స్టడీస్‌కి విదేశాలకు వెళ్లిరావాలనుకుంటున్నాననీ వైజయంతితో చెప్పింది.

ఆ తర్వాత అపూర్వ భర్తతో కలిసి లండన్ వెళ్లి టెక్స్‌టైల్ డిజైనింగ్ కోర్సు చేసి కొన్నేళ్ల తర్వాత ఇండియాకి తిరిగి వచ్చింది. ఆమె స్వంతంగా డిజైనర్ వేర్ ఇండస్ట్రీని లాంచ్ చేసి టెక్స్‌టైల్ బిజినెస్‌లో కొత్త ఒరవడిని సృష్టించి చౌదరిగారి కలల్ని నిజం చేసింది. ఇన్నేళ్లలో ఆమె ఎన్నడూ గతంలోకి తొంగిచూడలేదు కానీ మళ్లీ ఇప్పుడు మయూర్ కంటబడటంతో తీపి, చేదు జ్ఞాపకాలుగల తన గతాన్ని నెమరువేసుకోవాల్సి వచ్చింది. ట్రైన్ ఏదో స్టేషన్‌లో ఆగినట్లుంది. అపూర్వ తన రేడియం డయల్ వాచ్‌లో టైమ్ చూసుకుంది. రాత్రి 3 గంటలయ్యింది. అబ్బా తను హైదరాబాద్ చేరాలంటే ఇంకా నాలుగు గంటలు గడవాలి అనుకుంది విసుగ్గా. ఆమె బెర్త్‌పై నుండి లేచి బాటిల్‌లో నుండి కొన్ని నీళ్లు తాగి మళ్లీ పడుకుంది. బాగా అలిసిపోయి ఉండటంతో ఈసారి ట్రైను కదలగానే బాగా నిద్రపట్టింది మళ్లీ. ట్రైను సికింద్రాబాద్ స్టేషన్‌లో ఆగింతర్వాత ఆమెకు మెలుకువ వచ్చింది. ప్లాట్‌ఫాం మీద ట్రైన్ ఆగీఆగగానే అపూర్వ డ్రైవర్ లగేజీ కోసం కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చేశాడు. అపూర్వ ట్రైన్ కిటికీలోంచి చూసింది. కింద తన తమ్ముడు ఆదిత్య, కొడుకు అనురాగ్ నిలబడి ఉన్నారు.

ఆమె ట్రైన్ దిగగానే మమ్మీ అంటూ అనురాగ్ వచ్చి ఆమె నడుమును వాటేసుకున్నాడు. వాళ్లిద్దరు తెల్లవారగానే జాగింగ్‌కి వెళ్లొచ్చినట్లున్నారు. ట్రాక్‌సూట్‌తోనే వచ్చారు.

"ట్రైన్‌జర్నీ కంఫర్టబుల్‌గానే ఉందా అక్కయ్యా! ఒక రోజు ఆగి ఫ్లయిట్‌లోనే రాలేకపోయావా" అన్నాడు ఆదిత్య.

"పని అయింతర్వాత నాకక్కడ ఒక్క నిమిషం ఉండాలనిపించలేదు. అవునూ ఈ చలిలో వీణ్ణెందుకు తీసుకొచ్చావు. నేనే లాగూ ఇంటికే వచ్చేదాన్నికదా" అంది అనురాగ్ తలను దగ్గరగా తీసుకుంటూ.

వాళ్లిద్దరి మధ్యా సంభాషణ సాగుతోంది గానీ అపూర్వ చూపులు మాత్రం మళ్లీ మయూర్ కనబడతాడేమోనని అతడొక్కడే వచ్చాడా లేక వెంట అతని ఫ్యామిలీ ఉందా అన్న కుతూహలంతో వెతుకుతున్నాయి.

ఇంతలో వీళ్ల పక్కనుండే ట్రైన్ కంపార్ట్‌మెంట్ వైపు వెళ్తున్న ఒక అమ్మాయిని చూస్తూ "హాయ్ నీరూ హౌకమ్ యూ ఆర్ హియర్" అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు ఆదిత్య.

సడెన్‌గా పక్కనుండి ఆదిత్య గొంతు వినబడటంతో ఉలిక్కిపడి ఇటు తిరిగిన ఆ అమ్మాయి ఇతన్ని చూస్తూనే నవ్వుతూ "ఓ నువ్వా ఆదీ సారీ నేను చూడలేదు. అన్నయ్య వైజాగ్ నుండి ఈ ట్రైన్‌లో వస్తున్నాడు కానీ ఏ కంపార్ట్‌మెంటో నంబరివ్వలేదు వెతుక్కోవాలి" అంటూనే అక్కడికి కాస్త దూరంలో ఉన్న వ్యక్తిని చూస్తూనే సంతోషంతో భయ్యా అంటూ చెయ్యి ఊపింది. ఆ అమ్మాయి వేవ్ చేసిన వైపు చూసింది అపూర్వ. అక్కడ నిలబడ్డ వ్యక్తిని చూసి ఆమె ఊపిరి తీసుకోవడం కూడా మర్చినట్లుగా అయింది. అతడెవరోకాదు మయూర్. అంటే ఈ అమ్మాయి నిరాలీయా అనుకుంటూ అప్పుడు పరీక్షగా చూసింది. అప్పుడు పదేళ్లున్న నిరాలీ కాస్త తెల్లగా బొద్దుగా ఉండేది. ఇప్పుడు సుమారు ఇరవై రెండేళ్లున్న ఈ అమ్మాయి నిరాలీయేనా? తెల్లగా నాజూగ్గా భుజాలవరకు వదిలేసిన జుట్టుతో పూర్తిగా మారిపోయింది. కానీ ఆ నీలికళ్లు చూస్తే మాత్రం అప్పటి నిరాలీకి దగ్గరగా అన్పిస్తుంది.

అబ్బా ఎంత యాదృచ్ఛికం, తన ఒక ప్పటి ప్రేమికుడు ఇన్ని ఏళ్ల తరువాత తారస పడటం, అతని చెల్లెలు తన తమ్ము డికెలా తెలుసు. ఆమె మదిలో ఈ ప్రశ్న ఉత్పన్నమైందని తెలిసినట్లుగా ఆదిత్య "అక్కా తను నా ఫ్రెండ్ నిరాలీ" అంటూ పరిచయం చేశాడు. అప్పటికి వీళ్ల దగ్గరగా వచ్చిన మయూర్‌ని కూడా నిరాలీ ఆదిత్యకీ అపూర్వకీ తన అన్నయ్యగా పరిచయం చేసింది. కానీ అపూర్వని చూసిన నిరాలీ అడగనే అడిగింది. "మీరు నవ్యా దీదీ ఫ్రెండ్ అపూర్వకదూ" అని.

అవునన్నట్లుగా తల వూపి "హౌఆర్‌యూ' అనడిగింది అపూర్వ. "ఫైన్ థాంక్యూ" అని కాస్త ముభావంగానే అని నిరాలీ ఆదిత్య దగ్గర సెలవు తీసుకొని వెళ్లిపో యింది మయూర్‌తో. కానీ మయూర్ వెళ్తూ వెళ్తూ తదేకంగా అపూర్వ పక్కనే నిల్చున్న అనురాగ్‌నే చూస్తూ వెళ్లాడు. అపూర్వ అనాలోచితంగా అనురాగ్‌ను తనకు మరీ దగ్గరగా జరుపుకుంది వెళ్తున్న ఆ అన్నాచెల్లెళ్లను చూస్తూ.

"నేనీ రోజు వస్తున్నట్లు నీకెలా తెలుసు" అన్నాడు నిరాలీతో మయూర్.

"మనోజ్ భయ్యా ఫోన్ చేసి చెప్పాడు. 'ఇంకా రెండ్రోజులు ఉండమన్నా వినక నువ్వొంటరిగా ఉంటావు అంటూ మయూర్ ఈ రోజు బయలుదేరాడు. వైజాగ్ నుండి ఫ్లయిట్ కాన్సిలయ్యిందనీ ట్రైన్ టిక్కెట్ కూడా దొరకలేదనీ అయినాగానీ నువ్వు స్టేషన్‌కి వచ్చి ఏ కంపార్ట్‌మెంట్లో ఎక్కడ దొరికినా ట్రైన్ ఎక్కి హైదరాబాద్ చేరుకో వాలంటూ స్టేషన్‌కి వెళ్లావనీ' చెప్పాడు.

అదిగాక నాకు నీ సంగతి తెలుసుగా నువ్వనుకున్నది చేసి తీర్తావని. నువ్వెలాగ యినా టికెట్ సంపాదించి ట్రైన్‌లో వస్తా వని నాకు తెలుసు. అయినా ఎందుకింత కష్టపడటం హాయిగా రేపో ఎల్లుండో రావ చ్చుగా" అంది పార్కింగ్ లాట్‌లో ఉన్న కారుని రివర్స్ తీస్తూ.

"నాన్నగారు పోయినప్పటినుండీ నాకు నిన్నూ, ఆయమ్మనీ మగదిక్కు లేకుండా ఒంటరిగా వదలి ఎక్కడికీ వెళ్లబుద్ధికా దమ్మా. ఎంతో తప్పని సరయితే వెళ్లి నా పని కాగానే ఒక్క నిమిషం ఉండాలనిపిం చదు" అన్నాడు పక్కసీట్లో కూర్చున్న మయూర్.

కారు స్టేషన్ నుండి సికింద్రాబాద్‌లోని మహేంద్రా హిల్స్ వైపు వెళ్లసాగింది. ఈ పదేళ్లలో మయూర్ బిజినెస్ బాగా పెరి గింది. అతడికి బయట రాష్ట్రాల నుండి కూడా బాగా ఆర్డర్స్ రాసాగాయి. మయూర్ తండ్రి పోయింతర్వాత అతడు పార్సీగల్లీలోని ఆ ఇల్లు ఖాళీ చేసి ఆ తర్వాత సికింద్రాబాద్‌లోని పోష్ కాలనీలో ఒకటైన మహేంద్రాహిల్స్‌లో ఇల్లు కొను క్కొని అక్కడికి షిఫ్ట్ అయ్యాడు. నిరాలీ తన డిగ్రీ పూర్తి చేసి ఎమ్‌బిఎ కోర్సులో చేరింది. మయూర్ బిజినెస్‌లో బాగా సక్సెస్ అయ్యాడు. ఎంతో డబ్బు సంపాదిం చాడు. అన్నీ ఉన్నా అతని కళ్లలో మాత్రం ఆ పూర్వపు వెలుగు లేదు. ఏదో కోల్పోయి నట్లుగా ఉంటాడు. అతని స్నేహితులెంత నిలదీసినా దానికి కారణం మాత్రం చెప్పడు.

★ ★ ★

వైజాగ్ నుండి వచ్చిన రెండు రోజుల తర్వాత ఆదిత్య అపూర్వ గదిలోకి వచ్చి "అక్కయ్యా నువ్వు ఫ్రీగా ఉన్నానంటే నీతో ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు.

ఒక్క నిమిషం అంటూ ఆమె గది బయ టకు వచ్చి అక్కడ గది ముందు ఉన్న సిటౌట్‌లోకి వచ్చి కూర్చుంది. అప్పుడు అతడు కూడా వచ్చి ఆమె ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుని ఆమె ముఖం వైపు చూసి చెప్పే ధైర్యం లేనట్లుగా తల వంచు కున్నాడు.

"త్వరగా చెప్పు ఆదీ నేను వెళ్లాలి" అంది.

"ఒక్క నిమిషం అక్కయ్యా మమ్మీని కూడా పిలుస్తాను" అంటూ మమ్మీ అని అరిచాడు. పక్కగదిలోనే ఉన్న వైజయంతి అప్పుడే స్నానం చేసినట్లుంది, తల తుడ్చు కుంటూ బయటకు వచ్చింది.

"అదేం లేదు మమ్మీ! నేను మీ ఇద్దరితో చాలా రోజుల నుండి ఒక విషయం చెప్పా లనుకుంటున్నాను. నేను నా క్లాస్‌మేట్ నిరాలీని ప్రేమించాను. మీరొప్పుకుంటే పెళ్లి చేసుకోవాలని" ఆ మాట పూర్తి కాకముందే

"ఒప్పుకోకుంటే పెళ్లి చేసుకోవా" కఠినంగా వినబడ్డ అపూర్వ మాటలు విని అతడు ఆశ్చర్యంగా ఆమె వంక చూశాడు. అతని ముఖ కవళికల్ని గమనించిన అపూర్వ "నేను నిరాలీతో కాస్త మాట్లాడాలి" అంది గొంతులోకి కాస్త మృదుత్వాన్ని తెచ్చుకొని.

"సరే అక్కయ్యా సాయంత్రం కాలేజీ అయ్యాక నీరూని ఇక్కడికి తీసుకొస్తాను" అని అతడు వెళ్లిపోయాడు.

అపూర్వ కాసేపు అచేతనంగా అలాగే ఉండిపోయింది. ఆ రోజు స్టేషన్‌లో నిరా లీని చూసినప్పుడే తను కొంతవరకు ఊహించింది. కాబట్టి మరీ షాకవలేదు. కానీ ఇదేమన్నా మామూలు విషయమా అనుకుంది.

సాయంత్రం ఐదు గంటల ప్రాంతంలో ఆదిత్య, నిరాలీ వచ్చారు. అపూర్వ పూల్ సైడ్ లాన్‌లో కూర్చుంది. వాళ్లని అక్కడికే రమ్మని చెప్పి పంపింది. వాళ్లు రాగానే ఆది త్యతో "ఆదీ అర్జంటుగా ఈ పేపర్స్ మన చార్టెడ్ అకౌంటెంట్ గారికి ఇవ్వాలి. సమ యానికి నమ్మకమైన మనుషులెవరూ లేరు. కాస్త నువ్వెళ్లి ఇచ్చి రావాలి" అంది అపూర్వ.

"నేనా" తెల్లబోతూ ఒక వంక నిరాలీ వైపు చూస్తూ అర్థోక్తిలో ఆగిపోయాడు.

"అవును నువ్వే" ఖచ్చితంగా అని "నిరా లీని నేను ఎంగేజ్ చేస్తాను వెళ్లిరా" అని అంది.

చేసేదేం లేక నిరాలీ వైపు క్షమార్పణగా చూసి ఆ పేపర్స్ తీసికొని వెళ్లిపోయాడు.

అతడు వెళ్లిన తర్వాత రెండు క్షణాలు మౌనంగా గడిచాయి. అపూర్వ నిరాలీ వైపు చూసింది. సాయంకాలపు నీరెండ ఆమె ముఖంపై పడుతుంటే గులాబి రంగులో మెరిసే ఆ చర్మం, ముద్దుగా ఉన్న ఆ ముఖం పైనుండి ఆడదైన తనే కళ్లు మర ల్చుకోలేకపోతోంది. 'ముఖ్యంగా ఆ నీలికళ్లు, ఎందుకు ఆ కళ్లు తమ కుటుంబాల్ని ఇంతలా వెంటాడుతున్నాయి. తనూ ఆనాడు ఆ ఆకర్షణకే మయూర్‌కి లొంగిపో యింది. ఈనాడు మళ్లీ తన తమ్ముడు కూడా' ఇక ఆలోచించలేకపోయింది.

"నీకు ఆదిత్య కోట్లకు పడగలెత్తిన శక్తి గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ చౌదరి గారబ్బాయని, నాకు తమ్ముడనీ ముందే తెలుసా" అంది.

"నాకవేవీ తెలియవు. ఆదిత్య నా క్లాస్ మేట్ అనే తెలుసు. మొన్న స్టేషన్‌లో మిమ్మల్ని కలిసినప్పుడే వివరాలు తెలి సాయి" అంది ఎలాంటి బెరుకూ లేకుండా.

"ఓ ఫర్వాలేదే నువ్వు మీ అన్నయ్యలా డబ్బు చూసి ప్రేమించలేదన్న మాట. అయితే ఫరవాలేదే" అంది వ్యంగ్యంగా.

"చూడండీ నాకు డబ్బు చూసి ప్రేమించే అగత్యం పట్టలేదు. అసలు ప్రేమ గురించీ, ప్రేమించే మనసు గురించీ మీకేం తెలుసు. కేవలం డబ్బు లేదన్నకారణంగా ప్రేమించిన మా అన్నయ్యను కాదని వేరే అతన్ని పెళ్లి చేసుకొని అతని జీవితాన్ని, అతని మన సునూ ముక్కలు చేసారు. ఇప్పటికీ మా అన్నయ్య జీవితంలో ఇంకో స్త్రీవైపు కన్నెత్తి చూడలేదు. అతని పేరెత్తే అర్హత కూడా మీకులేదు" ఆవేశంగా అంది నిరాలీ.

"ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లా డుతున్నావా నువ్వు" అంది అపూర్వ.

"తెలిసే మాట్లాడుతున్నాను. అసలు ఆదిత్య మీ తమ్ముడని తెలిసుంటే నేనతని

# ఏరినముత్యాలు

- తన ఇంట్లో తన పెత్తనమే చెల్లుతుందని చెప్పే మగవాడు, ఆ తర్వాత ఏమి చెప్పినా అవన్నీ పచ్చి అబద్ధాలే

– సిడ్నీస్మిత్

- కన్నీళ్లు కడిగిన కళ్లే స్పష్టంగా చూడగలుగుతాయి.

– డాక్టర్ లూయిస్ ఎల్‌మాన్

- ఎంతటి భోగభాగ్యాలు కలవారైనా గడచిపోయిన తమ జీవితాన్ని తిరిగి సంపాదించుకోలేరు.

– ఆస్కార్ వైల్డ్

- మనం ఓ పాపం చేసిన తర్వాత మనలని శిక్షించేది మరెవరో కాదు- ఆ పాపమే.

– ఎబ్బర్ట్ హబ్బర్డ్

- పొగ తాగడం ఆపెయ్యడానికి అత్యుత్తమైన పద్ధతి తడిసిన అగ్గిపుల్లలని దగ్గరుంచుకోవడం.

– పీటర్ బీగ్స్

- జీవితంలో అనుభవం అనేదే మనిషికి అసలైన గురువు.

– ఎలిన్ వెలింగ్టన్ రోలిన్స్

- దిగులువల్ల ఎంత చిన్న వస్తువుకైనా ఎంతో పెద్ద నీడ ఉన్నట్లు కనిపిస్తుంది.

– స్వీడన్ సామెత

- బలహీనమైన మనస్సు ఎల్లప్పుడూ మాట్లాడాలని ఉబలాట పడుతుంది. ఐతే దృఢమైన మనసు మాత్రం మౌనంగా ఉండాలని అభిలషిస్తుంది.

– జెనో

- ఈ ప్రపంచంలో సముద్రం కంటే సారాయి ఎక్కువమంది మనుషులను ముంచేసింది.

– పబ్లియస్ సైరన్

- ప్రపంచంలో మంచి మాటలు ఎంతో కొరతతో కూడినవి. అందుచే వాటిని వ్యర్థంగా పాడుచెయ్యకూడదు.

– షేక్స్‌పియర్

- రకరకాల చెడు ఆలోచనలు మనిషి శాంతికి, విజయాలకు ప్రధాన శత్రువులు.

– స్వెట్ మార్డెన్

- ఆలోచన లేకుండా అధ్యయనం చేయడం పరమదండగ. అధ్యయనం చేయకుండా వూరకే ఆలోచించడం శుద్ధ దండగ.

– కన్‌ఫ్యూషియస్

సేకరణ: టి. మహి

ముఖం చూసేదాన్ని కాదు. మీరు మా అన్నయ్యని ఎంత గాయపరిచారో ఇప్పటికీ పెళ్లి చేసుకోకుండా ఉన్న అతని జీవితమే సాక్ష్యం. అసలు మీలాంటి వాళ్లతో నాకు మాటలనవసరం" అంటూనే చకచకా నడుస్తూ గేటు బైటకు వెళ్లిపోయింది.

ఆ మాటలు ప్రత్యక్షంగా విన్న అపూర్వ తోపాటు అంతకుముందే అక్కడికి వచ్చి కాస్త వెనకాల నిలబడి ఆ మాటలు పరోక్షంగా విన్న వైజయంతీ ఇద్దరూ అవాక్కైపోయారు.

ఏమిటీ మయూర్ ఇంతవరకూ పెళ్లి చేసుకోలేదా. అయితే ఆ రోజు తన గురించి మాట్లాడినదంతా ఏమిటి? ఏమో ఇందులో ఏదో రహస్యం దాగి ఉంది. ఎలాగైనా బయటకు లాగాలి. ఇలా ఆలోచించసాగింది. ఇంతలో ఆదిత్య రానే వచ్చాడు.

"అక్కయ్యా నిరాలీ ఏదీ" అనడిగాడు ఆశ్చర్యంగా.

"నేను చెప్తాను ఆదీ. అలాగే ఎన్నో ఏళ్లుగా నా గుండెల్లో దాచుకున్న రహస్యం కూడా వెల్లడించే సమయం వచ్చింది. అసలు ఆ అవసరం రాదనే అనుకున్నాను. కానీ ఇంకో జీవితం బలవుతుంటే నిప్పులాంటి ఆ నిజాన్ని ఇంకా దాచటం నా అవివేకం" అంటూ గతంలో జరిగిన విషయం చెప్పసాగింది.

★ ★ ★

ఆరోజు చౌదరిగారికి యాక్సిడెంట్ అయి హాస్పిటల్‌లో ఉన్నప్పుడు చౌదరిగారికి స్పృహ రాగానే వైజయంతి గురించి అడుగుతున్నాడని నర్స్ వచ్చి లోపలికి తీసుకెళ్ళింది.

అపూర్వ పెళ్ళి వినయ్‌తో జరగాలనీ, ఒకవేళ అపూర్వ పెళ్ళి తను నిర్ణయించినవాడితో జరగకపోతే ఆమెను డిసోన్‌చేసి తన ఆస్తి అంతా అనాథ ఆశ్రమానికి చెందేలా, తను వీలునామా ఆ విధంగానే రాస్తాననీ చెప్పాడు.

అంతేకాక డ్రైవరు ద్వారా అపూర్వ మయూర్‌తో తిరగడం తెలుసుకున్న చౌదరిగారు అపూర్వకు అతనిపట్ల మనసు విరిగేటట్లు చెయ్యాలనీ లేకపోతే ఆమె వినయ్‌తో పెళ్ళికి ఒప్పుకోదనీ వైజయంతిని కోరాడు.

అప్పటికప్పుడు లాయర్‌ను పిలిపించి అతనికీ విషయం వివరించి తననుకున్నట్లుగానే వీలునామా తయారు చేయించాడు.

ఒకవేళ అపూర్వ మయూర్‌ని చేసుకుంటే ఇల్లుతోసహా ఆస్తంతా అనాథాశ్రమం పాలవుతుంది. తనూ, అపూర్వా, ఆదిత్యా, రోడ్డున పడతారు.

ఆమెకేం చేయాలో అర్థంకాలేదు. ఇంతలో చౌదరిగారికి జరిగిన యాక్సిడెంట్ సంగతి తెల్సి మయూర్ హాస్పిటల్‌కి వచ్చాడు. వైజయంతి ఈ విషయమంతా అతనికి చెప్పింది. తన భర్త కోరిక నెరవేర్చమని ప్రాధేయపడింది. అతడు కాసేపు ఆలోచించి తను చౌదరిగారిని చూడాలని అడిగాడు. ఆమె అతన్ని లోపలికి తీసుకెళ్ళింది. అతడు స్పృహలోనే ఉన్న చౌదరిగారి దగ్గరకు వెళ్ళి,

"మీరనుకున్నట్లుగానే జరుగుతుంది, నిశ్చింతగా ఉండండి, అపూర్వని మీరు నిర్ణయించిన వరునితో పెళ్ళికి సిద్ధం చేస్తాను" అన్నాడు.

ఏమనుకున్నాడో ఏమో చౌదరి మయూర్‌కి రెండుచేతులూ ఎత్తి నమస్కరించాడు. వైజయంతితో చౌదరిగారి దగ్గరికి వెళ్ళేముందు మయూర్ ఆమెను ఒక్కప్రశ్న అడిగాడు.

"వైజయంతీ ఆంటీ! చౌదరిగారు అపూర్వని డిసోన్‌చేస్తే తనకు ఆస్తి రాకపోయినా ఫరవాలేదు. నేను ఆమెని పెళ్ళిచేసుకొని ఏ లోటూ రాకుండా చూసుకోగలను. నా పైన నమ్మకం ఉంచి కనీసం మీరయినా మా వివాహానికి ఒప్పుకోండి" అని అడిగాడు.

"చూడు మయూర్... అపూర్వని నువ్వు పెళ్ళిచేసుకోవడం నాకిష్టంలేదు. ఎందుకంటే

అపూర్వ వినయ్‌ని పెళ్ళి చేసుకుంటే తన కోరిక నెరవేరిందన్న సంతోషంతో నా భర్త ఆరోగ్యం బాగుపడుతుందేమో. ఆ మనిషిని బతికించే శక్తి నీకే ఉంది.

ఒకవేళ చౌదరిగారికి జరగరానిదేమన్నా జరిగినా అతని చివరి కోర్కె తీర్చినవాడివి నువ్వే అవుతావు"



అంటూ ప్రాధేయపడింది.

ఇక చేసేదేంలేక మయూర్ అంతటి త్యాగానికి ఒడికట్టాడు. "అప్పూ! ఈ విషయంలో తప్పంతా నాదే, నన్ను క్షమించు. ఇప్పటికే నేను చేసిన పాపానికి తగిన శిక్ష అనుభవిస్తున్నాను. పెళ్ళయిన ఏడాదికే విడాకుల పాలైన నీ మోడు వారిన జీవితం చూస్తూ తట్టుకోలేకపోతున్నాను. అప్పూ... మళ్ళీ ఇప్పుడీ విషయం ఇంకా దాచి మళ్ళీ రెండు నిండు జీవితాల్ని బలి తీసుకోలేను" అంటూ ఏడవసాగింది వైజయంతి.

ఈ విషయం విన్న అపూర్వ తట్టుకోలేక షాక్‌తో స్పృహ కోల్పోయింది. ఆదిత్య, వైజయంతీ స్పృహ తప్పి కిందపడబోతున్న

అపూర్వను పట్టుకొని లోపలికి తీసుకెళ్ళారు. ఆదిత్య డాక్టరుగారికి ఫోన్‌చేసి కంగారుతో అటూఇటూ పచార్లు చేస్తున్నాడు. ఇంతలో క్రికెట్ కోచింగ్ క్లాస్‌నుండి తిరిగివచ్చిన అనురాగ్ అపూర్వని చూస్తూ మమ్మీకేమ యిందని అడిగాడు.

"మమ్మీకి జ్వరం వచ్చింది నాన్నా, ఇప్పుడు డాక్టరుగారు వచ్చి మందులిస్తే బాగవుతుంది. నువ్వు గిరిజమ్మతో వెళ్ళి స్నానంచేసిరా" అంటూ ఆదిత్య అనురాగ్‌ని గిరిజమ్మకి ఒప్పచెప్పాడు. ఆమె బాబుని తీసుకొని లోపలికి వెళ్ళిపోయింది.

★ ★ ★

అపూర్వతో గొడవపడి అక్కడినుండి కోపంగా బయటికివచ్చిన నిరాలీ తిన్నగా ఇంటికి వెళ్ళింది. ఇంట్లోకి వెళ్తూనే అక్కడే హాల్లో సోఫాపైన బోర్లాపడుకొని ఏడవసాగింది. అది చూసిన ఆయమ్మ మయూర్ దగ్గరికివెళ్ళి నిరాలీ ఎందుకో ఏడుస్తోంది అని చెప్పింది. అతను వెంటనే కిందికి దిగివచ్చి ఏడుస్తున్న నిరాలీని ఏం జరిగిందని అడిగాడు.

"ఐ యామ్ సారీ భయ్యా, నీకు తెలియకుండా నేను చాలా తప్పుచేశాను. ఆదిత్య అపూర్వదీదీ తమ్ముడని నాకు తెలియదు, నేనతన్ని ప్రేమించాను. ఆదిత్య ఈరోజు నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. అక్కడ నన్ను అపూర్వ దీదీ నానా మాటలూ అంది. మీరు డబ్బున్నవాళ్ళనే ప్రేమిస్తారా అని నిలదీసింది భయ్యా, నాకైతే చచ్చిపోవాలన్పించింది. ఆ కోపంలో నేను కూడా ఆమెను నానా మాటలూ అన్నాను. నువ్వే మా అన్నయ్యని డబ్బు లేదని మోసం చేశావని కూడా అన్నాను. ఆదిత్య నీ తమ్ముడని తెలిసుంటే ప్రేమించేదానిని కాదని తెగేసి చెప్పాను. కానీ ఆదిత్య లేకుండా నేను ఉండలేను భయ్యా" అంటూ ఏడవసాగింది.

"చాలా పొరపాటు చేశావు నీరూ, నువ్వు అపూర్వను అంతలేసి మాటలు అని చాలా పెద్ద తప్పుచేశావు. నా విషయంలో అపూర్వది ఎలాంటి తప్పులేదు. అయినా తెలిసీ తెలియని విషయాలను గురించి ఎప్పుడూ మాట్లాడవద్దు. సరే జరిగిందేదో జరిగిపోయింది, వెంటనే బయల్దేరు, ముందు అపూర్వ దగ్గరకు వెళ్ళి క్షమాపణ చెప్పి వద్దాం పద" అంటూ ఆమె చెయ్యి పట్టుకొని బయటకు వచ్చాడు.

"కానీ భయ్యా... అప్పుడు నీ ఫ్రెండ్స్ అందరూ అలాగే ఊహించారు. వాళ్ల మాటలు విన్న నేనూ అదే నిజం అనుకున్నాను"

"అందులో అపూర్వ తప్పేమీలేదమ్మా. వాళ్ళ మమ్మీ, డాడీల కోరిక ప్రకారం నేను అప్పూకి దూరమయ్యాను. అంతే ఇంక వివరాలేమీ చెప్పలేను" అంటూ కారు స్టార్ట్ చేశాడు మయూర్.

ట్రాఫిక్ టైమ్ కాబట్టి వాళ్ళు అపూర్వ ఇంటికి వెళ్ళేసరికి నలభై నిమిషాలు పట్టింది. కానీ సెక్యూరిటీవాళ్ళు గేటు ఓపెన్ చెయ్యలేదు. నిరాలీ ఆదిత్య సెల్‌కి ఫోన్ చేసింది. అతడు సెక్యూరిటీకి ఆ కారుని లోపలికి వదలమన్నాడు. వీళ్ళు లోపలికి రాగానే ఆదిత్య వాళ్ళని మర్యాదపూర్వకంగా రిసీవ్ చేసుకున్నాడు. వాళ్ళు వెళ్ళేసరికి అపూర్వకి స్పృహవచ్చింది. నిరాలీ వెళ్ళి తనకు జరిగిన విషయాలేవీ తెలియవనీ, తన తెలివితక్కువ తనానికి మన్నించమనీ వేడుకుంది. మయూర్ కూడా తన చెల్లెలి తరపున క్షమాపణ వేడుకున్నాడు. ఆ తర్వాత వాళ్ళు ఒక పావుగంట ఉండి వెళ్ళిపోయారు. కానీ మయూర్ అక్కడున్నంతసేపూ అతని దృష్టంతా అనురాగ్ పైనే ఉంది. ఆ బాబుని పిలిచి మాట్లాడాలనీ, వాడితో ఆడుకోవాలనీ మయూర్‌కి చాలా అన్పించింది. వాడెంత ముద్దుగా ఉన్నాడు, ఆ తెల్లటిరంగూ, ఒత్తైన నల్లటి జుట్టూ, ముఖ్యంగా మెరిసే ఆ నీలికళ్ళూ అతని మస్తిష్కంలో ముద్రపడ్డాయి. అలా అను

కుంటూ ఒక్కసారే ఉలిక్కిపాటు. అవును బాబుకి ఆ నీలి కళ్ళు ఎలా వచ్చాయి. అటు అపూర్వకికానీ, వినయ్‌కికానీ అలాంటి కళ్ళు లేవే. కానీ వాడికి... వాడ్ని చూస్తుంటే తనకు ఎవరో గుర్తుకు వస్తున్నారు. అతని కిక శక్తి లేనట్లుగా సడెన్ బ్రేక్‌వేసి కారు ఆపాడు.

"భయ్యా ఏం జరిగింది? " కంగారుగా అంది నిరాలీ.

"నీరూ కాస్త కారు నువ్వు డ్రైవ్ చెయ్యి" అంటూ అతడు కారు దిగి సీటు మారాడు.

ఇంటికి చేరగానే అతడు ఒక్కక్షణం ఆగ లేనట్లుగా గబగబా లోపలికి వెళ్ళి డెస్క్‌లో ఉన్న ఒక పాత ఆల్బమ్ తీసి అందులో ఉన్న ఫొటోలు చూశాడు. తన పది, పద కొండేళ్ళ ప్రాయంలోని ఫొటోలు అవి. వాటిల్లో తనకీ, అనురాగ్‌కీ స్పష్టమైన పోలి కలు. అంటే అనురాగ్ తన బిడ్డా? అదెలా సాధ్యం? అతని జ్ఞాపకపు పొరల్లో ఆనాడు నవ్య ఇంట్లో మెహందీ పార్టీ తర్వాత అపూర్వ తన ఇంటికి వెళ్ళడం, ఆపైన తనూ అక్కడికి వెళ్ళడం ఆ తరు వాత జరిగిన సంఘటనలు ఒకదాని వెనక ఒకటి ఫిలిం రీలులాగా కళ్ళముందు తిరగ సాగింది. అతడు నిస్సత్తువగా అక్కడే మోకాళ్ళమీద కూర్చుండిపోయాడు.

మయూర్‌ని ఆ స్థితిలో చూసిన నిరాలీకి ఏం చెయ్యాలో తోచని పరిస్థితి ఎదురైంది. వాళ్ళిద్దరూ అక్కడ ఆ హాల్లో మూగగా అలాగే చాలాసేపు ఉండిపోయారు.

★ ★ ★

అపూర్వకి స్పృహ వచ్చిన మరునిమిషం నుండి ఆమె వైజయంతితో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. అసలు ఆమెని చూడ డానికి ఇష్టపడలేదు. దీనికంతటికీ తన తల్లే కారణం అన్న నిజం ఆమె జీర్ణించుకోలేకపో యింది. ఆరోజు బయట ఉరుములూ, మెరుపులతో కూడి పెద్ద వర్షం కురు స్తోంది. అపూర్వ మనసంతా అలాగే అల్లక ల్లోలంగా ఉంది. ఎటూ వెళ్ళాలన్పించలేదు. ఆఫీసుకు ఫోన్ చేసి తను రావడంలేదనీ, ఏవన్నా సంతకాలు అవసరముంటే ఫైల్స్ ఇంటికి పంపించమనీ చెప్పింది.

ఆమె లేచి వెళ్ళి కిటికీకి ఉన్న పరదా పక్కకు లాగి బయట జోరున కురుస్తున్న వర్షాన్ని చూస్తూ నిల్చుంది. ఇంతలో అక్క డికి వైజయంతి వచ్చింది. అపూర్వ ఆమె రాకను గమనించినట్లుగా ముఖం పక్కకు తిప్పుకుంది.

వైజయంతి అపూర్వ దగ్గరగా వచ్చి భుజంమీద చెయ్యి వేస్తూ, "నిన్నటినుండి పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టలేదు రా అపూర్వా... కింద ఆదిత్య నీకోసం వెయిట్ చేస్తున్నాడు. కలిసి బ్రేక్‌ఫాస్ట్ చేద్దాం" అంది.

ఆమె రివ్వున వైజయంతివైపు తిరిగింది. ఆ చూపులు మెరిసే కత్తుల్లాగా ఉన్నాయి. "నేను నా ప్రేమకు హాని నాన్నగారినుండి కలుగుతుందనుకున్నాను. కానీ నీవల్ల ఇలా జరుగుతుందని ఊహించలేదు. కొన్ని గంటల్లో ప్రాణం పోయే మనిషి కోరిక తీర్చాలనుకున్నావు కానీ రెండు నిండు జీవి తాలను గురించి ఆలోచించలేకపోయావు. నువ్వు తాతయ్య గురించీ, డాడీ గురించీ ఆనాడు చెప్పావు కానీ నీదీ ఆ రక్తమే అని నేను ఆలోచించి ఉంటే నిన్ను కూడా నమ్మి ఉండేదాన్ని కాదు.

డాడీ లేకపోవడం నాకూ తీరని లోటే, డాడీ అంటే నాకూ ఇష్టమే. కానీ నువ్వు హాస్పిటల్‌కి పిలిపించి నా పెళ్ళి విషయం ప్రస్తావించినప్పుడు కూడా నేను మయూ ర్‌ని వివాహం చేసుకుంటానని చెప్పాను. నాకెట్టి పరిస్థితిలోనూ మయూర్‌ని వదులు కోవాలని లేదు అని నీకు ఖచ్చితంగా తెల్సిన తర్వాత కూడా ఇటువంటి ఘోరం ఎందుకు చేశావు మమ్మీ. నాకసలు ఈ ఇంట్లో ఒక్క క్షణం కూడా ఉండాలనిపించడంలేదు. ఇది నా పుట్టినిల్లుకాదు, శత్రుస్థావరంలాగుంది"

అంటూ ఇక వైజయంతిని చూడడం కూడా ఇష్టం లేనట్లుగా విసురుగా తన గదిలోకి వెళ్ళి తలుపు వేసేసుకుంది. అపూర్వ చూపిన విసురుకు ఆమె మనసు ఉండేలు దెబ్బ తగిలిన కుందేలులా విలవిలలాడింది. అప్పుడే అపూర్వని బ్రేక్‌ఫాస్ట్ చేయడానికి పిలిచేందుకు పైకి వచ్చిన ఆదిత్య ఆ దృశ్యం చూసి అపూర్వని పలకరించే ధైర్యంలేక తనూ అభోజనంగా అలాగే కాలేజీకి వెళ్ళి పోయాడు.

★ ★ ★

ఆదిత్యా, నిరాలీ కాలేజీలో లంచ్ అవర్ వరకు ముళ్ళమీద కూర్చునట్లుగా ఉన్నారు. లంచ్ అవర్లో కాలేజీ కాంటీన్‌కి వెళ్ళకుండా బయట కాలేజీకి దగ్గర్లోనే ఉన్న రెస్టారెంట్‌కి వెళ్ళి ఒక మూలన ఉన్న టేబుల్ వద్దకు వెళ్ళి కూర్చున్నారు. ఏం మాట్లాడు కోవాలో తోచక చిన్నబోయిన ముఖాలతో అలాగే కూర్చున్నారు. ఆదిత్యే ముందుగా మాట్లాడాడు.

"నాకు మా ఇంట్లో పరిస్థితి చూస్తే ఎక్కడికైనా పారిపోవాలన్పిస్తోంది. అపూర్వక్కయ్యని చూసి తట్టుకోలేకపోతున్నాను నీరూ. ఆమెకు చాలా అన్యాయం జరిగింది. మా మమ్మీ, డాడీ ఆమెకు ఆ బలవంతపు వివాహం చేసినమాట నిజమే కానీ తనకు పెళ్లయిన ఏడాదికే డైవర్సు కూడా అయిపోయాయి. తన ఆశలన్నీ నామీదా, అనురాగ్ మీదా పెట్టుకొని తన గత జీవితం గుర్తుకు రాకుండా ఉండాలని ఒక్క నిమిషం తీరిక లేకుండా బిజినెస్ పనుల్లో మునిగి ఉంటుంది. ఏదో ఓ మాదిరిగా గడిచిపోతున్న మా జీవితాల్లో మళ్ళీ తుపాను చెలరేగినట్లుగా అయ్యింది" అన్నాడు.

ఈ విషయం విన్న నిరాలీ ఆశ్చర్యంతోనే, "అపూర్వ దీదీ వెనుక ఇలాంటి బాధ ఉన్నదని నేను అనుకోలేదు ఆదీ. కానీ నువ్వేమనుకోనంటే ఒక విషయం అడుగుతాను. తనకు డైవర్సు ఏ కారణంవల్ల జరిగిందో తెలుసుకోవచ్చా? "

"నాకూ తెలియదు. అక్కయ్య బాధ పడుతుందని మేం ఎప్పుడూ అడగలేదు. అక్కయ్య పెళ్ళవగానే హయ్యర్ స్టడీస్‌కి లండన్ వెళ్ళింది. ఐదారు నెలల తర్వాత మమ్మీ అక్కయ్య డెలివరీకోసం లండన్ వెళ్ళి అనురాగ్‌ని ఇక్కడికే తీసుకొని వచ్చింది. అక్కయ్య చదువుకు డిస్టర్బ్ అవుతుందనీ అందుకే వాడిని తీసుకొచ్చాననీ అంది. ఆ తర్వాత అక్కయ్య చదువు పూర్తి చేసుకొని ఇక్కడికే వచ్చి బిజినెస్ చూసుకుంటూ ఉండిపోయింది. నాకు తెలిసినంత వరకూ జరిగింది ఇదే"

"కానీ నాకు మాత్రం మీ అక్కయ్య పెళ్లీ, డైవర్సు విషయంలో ఏదో సీక్రెట్ ఉందని పిస్తోంది. అదెలాగైనా తెలుసుకోవాలి. ఆ... ఐడియా ఇప్పుడు నవ్యాదీదీ ఇక్కడే ఉంది. తను పోయినవారమే వాళ్ళ నాన్న గారికి ఆరోగ్యం బాగోపోతే చూడడానికని అమెరికా నుండి వచ్చింది. తనూ, అపూర్వ దీదీ క్లోజ్ ఫ్రెండ్స్. బంధువులతో చెప్పలేని విషయాలు కొన్ని ఫ్రెండ్స్‌తో చెప్పుకుంటారు. ఎలా వర్కవుట్ అవుతుందోగానీ ట్రై చేద్దామా? " అంది నిరాలీ.

"సరేకానీ ఒక్క విషయం. నవ్య అక్కయ్య తనంత తానుగా మా ఇంటికి వచ్చినట్లుగా ఉండాలి. కానీ మనం పంపించినట్లుగా తెలియకూడదు" అన్నాడు ఆదిత్య.

ఆ తర్వాత వాళ్ళు మరో అరగంట ఉండి అక్కడినుంచి వెళ్ళిపోయారు.

★ ★ ★

ఆరోజు ఆదివారం అపూర్వ ఇంట్లోనే ఉండి అనురాగ్‌తో బిలియర్డ్స్ రూమ్‌లో గేమ్ ఆడుతోంది. ఇంతలో సెక్యూరిటీ గార్డు "ఎవరో నవ్యా మేడమ్ మిమ్మల్ని కలవాలని వచ్చింది పంపమంటారా మేడమ్? " అన్నాడు ఇంటర్‌కమ్‌లో.

"నవ్య అబ్బా ఎన్నేళ్ళ తర్వాత" అనుకుంటూ పంపించమని చెప్పింది.

లోపలికి వచ్చిన నవ్యని చూస్తూనే అపూర్వ ఎంతో ఆత్మీయంగా ఆహ్వానించింది. మధ్యలో ఎక్కడా కూడా మయూర్ టాపిక్ రాకుండా జాగ్రత్తపడింది నవ్య.

తను ఈ పదేళ్ళలో అమెరికానుండి రావడం ఇది మూడోసారని, ముందు వచ్చిన రెండుసార్లూ తను వారం పదిరోజులకొరకే భర్తతో కలిసి రావడంవల్ల బిజీగా ఉండి అపూర్వని కలవలేకపోయాననీ, ఈసారి తను ఒక్కతే వచ్చిందనీ, చౌదరిగారు పోయారని మాటల సందర్భంలో ఎవరో చెప్పడంవల్ల తెల్సిందనీ అందుకే ప్రత్యేకంగా కలవడానికి వచ్చాననీ చెప్పింది.

ఆ తర్వాత వాళ్ళు కొద్దిసేపు ఏదో పిచ్చాపాటి విషయాలు మాట్లాడుకున్నారు. అపూర్వ అనురాగ్‌ను, ఆదిత్యను నవ్యకి పరిచయంచేసింది. ఆ తర్వాత ఆమెను తన గదిలోకి తీసుకెళ్లింది.

"మరి మీవారిని పరిచయం చెయ్యలేదేం" అనడిగింది

"లేరు"

"అంటే ఔట్ ఆఫ్ స్టేషనా"

"కాదు అసలు రారు" ఇక అప్పటి వరకు ఉగ్గబట్టుకున్న అపూర్వ ఆపుకోలేకపోయింది. ఒక్కసారిగా రెండు చేతులతో ముఖం కప్పుకుంటూ ఏడవసాగింది. అసలు నవ్యని చూడగానే ఆమెని పాత జ్ఞాపకాలు చుట్టుకున్నాయి.

నవ్య లేచి అపూర్వ దగ్గరగా వెళ్ళి, ఆమె భుజాలు పట్టుకొని "అపూర్వా, ఏదైనా బాధ ఉంటే ఇతరులతో చెప్పుకుంటే తగ్గుతుందంటారు. అసలేం జరిగింది నాతో చెప్పు. ఒక్కసారి చెప్పుకుంటే నీ హృదయభారం తగ్గుతుంది" అంటూనే వెళ్ళి అక్కడ టేబుల్ పై ఉన్న వాటర్ జగ్గులోనుండి నీళ్ళు గ్లాసులోకి వంపి తీసుకెళ్ళి అపూర్వతో తాగించింది.

కాసేపటికి అపూర్వ తేరుకొని చెప్పసాగింది.

నాన్నగారు హాస్పిటల్‌లో ఉన్నప్పుడు తను మయూర్ ఇంటికి వెళ్ళటం, మయూర్ తనను కాదనడం. తను ఆ షాక్‌లో ఇంటికి ఎలా చేరిందో కూడా తెలియలేదనీ, తను ఆ షాక్‌లోనుండి కోలుకోకముందే పెళ్ళి ఏర్పాట్లు జరిగిపోవడం, విధిలేక తను తలొంచి వినయ్‌తో తాళి కట్టించుకోవడం, పెళ్ళయిన మొదటిరోజే తను తన మనసునీ, తనువునీ మయూర్ కర్పించిన విషయం చెప్పి వినయ్‌తో తను ప్రేమించిన మయూర్ తనను మోసం చేశాడనీ, అయినా తను అతని జ్ఞాపకాలను మరవలేననీ కాకపోతే ఇక వీలులేని పరిస్థితిలో తన తల్లి బలవంతంమీద తాళి కట్టించుకున్నాననీ, కొద్దిరోజులు పోయాక ఇద్దరికీ అభిప్రాయ భేదాలొచ్చాయని, డైవోర్స్ తీసుకుందామనీ కోరింది. అతడు అపూర్వ పరిస్థితికి జాలిపడి అందుకు ఒప్పుకున్నాడు.

అపూర్వ అతడితోపాటు తనూ చదువుకోవడానికి లండన్ వస్తాననీ ఇద్దరం ఫ్రెండ్స్‌లా ఉందామనీ కోరింది.

అలా వాళ్ళిద్దరూ లండన్ వెళ్లిన తర్వాత కొద్దిరోజులకే అపూర్వ గర్భవతి అని తెలిసింది. అపూర్వకి బిడ్డ పుట్టిన ఐదారు నెలలకు ఇద్దరూ డైవోర్స్ తీసుకున్నారు. ఆ తర్వాత అతను తనకు నచ్చిన అమ్మాయిని చేసుకొని అక్కడే స్థిరపడ్డాడు.

"నేను విరాగిలా ఇలా ఉన్నాను. నవ్యా ఇదంతా కేవలం మయూర్ పొరపాటువల్లనే జరిగింది. అతడు ఒక్కమాట నాతో చెప్పవల్సింది. నేను జన్మలో అతన్ని క్షమించలేను" అంది.

ఆ తర్వాత ఆ గదిలో చాలాసేపు నిశ్శబ్దం ఆవరించింది. ఇదంతా నవ్యతో చెప్పినతర్వాత అపూర్వ మనసు తేలికపడింది. మూడురోజులుగా అదేపనిగా పడ్తున్న వర్షం కూడా వెలిసినట్లుంది.



మబ్బుల చాటునుండి సూర్యకిరణాలు ఏటవాలుగా ప్రసరిస్తూ కిటికీలోనుండి సరాసరి వచ్చి గదిలోని గ్లాస్ టాప్ ఉన్న టేబుల్ పై పడుతున్నాయి. అలా పడ్డ కిరణాలు గాజు కింద ఉన్న చెక్కకు తగిలి మళ్ళీ వెనక్కు తిరిగి సూర్యుడ్ని చేరుకున్నట్లుగా అన్పించ సాగాయి. ఆ కిరణాల్నే దీర్ఘంగా చూస్తూ నవ్యకి ఏదో స్ఫురణ కొచ్చినట్లుగా దీర్ఘంగా నిశ్వసించింది. ఆ తర్వాత ఆమె వైజయంతిని కూడా పరామర్శించి "అధైర్యపడవద్దు ఆంటీ, పరిస్థితులు వాటంతట అవే చక్కబడతాయి" అని పెద్ద ఆరిందాలా చెప్పి వెళ్ళిపోయింది.

అక్కడ మయూర్ ఇంట్లో సోఫాల్లో ఎదురెదురుగా నవ్యా, మయూర్ కూర్చొని ఉన్నారు. వాళ్ళు అక్కడ చాలా సేపట్నించి కూర్చున్న సూచనగా నాలుగు ఖాళీ కప్పులున్నాయి. మయూర్ దీర్ఘాలోచనలో మునిగి ఉన్నాడు.



నవ్య "మయూర్ అపూర్వ నిన్నెంతగా ఇష్టపడ్డదంటే ఇప్పటికీ ఆమె గదిలో నీ జ్ఞాపకాలే ఉన్నాయి. ఆమె డ్రెస్సింగ్ టేబుల్ పై నువ్విచ్చిన గాజుపువ్వులు, ఆమె మ్యూజిక్ సిస్టంలో నీ కలక్షన్‌లోని పాటలు, ఆమె మనసు పొరల్లో నీ జ్ఞాపకాలు ఏ ఒక్కటీ చెరిగిపోలేదు.

ఆమె కన్నతండ్రి చావుబతుకుల్లో ఉన్నా కూడా అతన్నీ, అతని కోట్ల ఆస్తినీ కాదనుకొని నీ దగ్గరకొచ్చింది. కానీ నువ్వు కనీసం ఆమెతో ఒక్క మాటన్నా చెప్పకుండా నువ్వు అంత పెద్ద నిర్ణయం తీసుకోవడం, తనను కాదనటం ఆమె ఆత్మాభిమానాన్ని దెబ్బతీసింది. రెండో విషయం తను ఎంతగానో నమ్మిన తన తల్లి తన నమ్మకాన్ని వమ్ము చేయడం ఆమె తట్టుకోలేకపోయింది. ఈ సమస్యను కాలమే పరిష్కరించాలి. నువ్వు అపూర్వ చెయ్యందుకోవడానికి సిద్ధంగా ఉన్నా ఆమె సిద్ధంగాలేదు. సమాజం దృష్టిలో ఒక వివాహిత స్త్రీ భర్తకు డైవర్సిచ్చి మళ్ళీ పాత ప్రేమికుడ్ని వివాహం చేసుకుందన్న అపవాదుకు అపూర్వ భయపడకపోయినా, దెబ్బతిన్న ఆత్మాభిమానం ఆమెను ముందుకు రానివ్వటంలేదు. ఆరోజు నీ తిరస్కారంతో విలవిలలాడి చెదిరిన ఆమె మనసింకా కుదురుకోలేదు. చౌదరిగారి ఆఖరి కోర్కెకూ, వైజయంతిగారి బాధకూ విలువ ఇచ్చిన నువ్వు మనసా, వాచా, కర్మణా నీదైన ఆమె ప్రేమకివ్వలేదన్న బాధనుండి ఇంకా ఆమె కోలుకోలేదు. ప్రేమకంటే త్యాగం గొప్ప అనుకున్నావు నువ్వు. ప్రేమతప్ప తల్లీ, తండ్రీ, ఆస్తీ ఏదీ వద్దనుకుంది అపూర్వ. నీ తిరస్కారం ఆమెని రాయిని చేసింది మయూర్... నువ్వు చాలా పెద్ద తప్పుచేశావు మయూర్" అంది.

"లేదు నవ్యా... నేనానాడు సరైన నిర్ణయమే తీసుకున్నాను. నేను చౌదరిగారి ఆఖరి కోర్కె తీర్చడమన్నది ప్రశ్నకాదు, అతని ప్రాణం నిలబడుతుందేమోనన్న ఆశ. నేనప్పటి పరిస్థితిలో అపూర్వని పెళ్ళిచేసుకుంటే ఆమె తండ్రి ఇచ్చినటువంటి జీవితం నేనామెకు ఇవ్వలేననుకున్నాను. నావల్ల ఒక కుటుంబం రోడ్డు పాలవద్దు అనుకున్నాను.

ఇప్పుడు అపూర్వకి బాధ కల్గినా తరువాత తను అన్నీ మర్చిపోయి సుఖంగా కాపురం చేసుకుంటుందనుకున్నాను"

"అదే... అదే. పొరపాటు మాట్లాడుతున్నావు మయూర్. అయితే నువ్వు అపూర్వది ప్రేమకాదు ఆకర్షణ అనుకున్నావు, ఆ పొరపాటుకు నువ్వెప్పటికీ క్షమార్హుడవు కాదు"

"సరే నవ్యా! జరిగిందేదో జరిగింది. అపూర్వ జ్ఞాపకపు పొరల్లో నేనున్నానన్న ఒక్క ఆధారంతో ఈలోకమేమనుకున్నా, ఆ దేవుడే అడ్డొచ్చినా నేను దేనికీ వెరవను. మళ్ళీ అపూర్వని నాదాన్ని చేసుకొని తీరుతాను. ఎంతకాలమైనా పట్టనీ నేను సాధించి తీరుతాను" అన్నాడు.

ఆమె అతనివైపు ఆనందంగా చూసింది. అతని కళ్ళల్లోకి పూర్వపు మెరుపు తీక్షణత్వం తిరిగి వచ్చాయన్పించింది. అతడన్నంత పనీ చేయగలడని ఆమెకు నమ్మకం కుదిరింది. స్నేహితురాలి జీవితంలో తిరిగి వసంతం వెల్లివిరుస్తుందన్న ఆశతో ఆమె సంతృప్తిగా వెళ్ళిపోయింది.

మయూర్ తన పర్సు తెరిచి అందులో ఉన్న అపూర్వ ఫొటోవైపు చూస్తూ 'ఓ ఏక్ లడకీకో దేఖాతో ఐసాలగా, ఖిల్ తా గులాబ్ జైసీ, షాయర్ కీ క్వాబ్ జైసీ...'

ఒకమ్మాయిని చూశాక ఎలా అన్పించిందంటే విచ్చుకుంటున్న గులాబీ లాగ, కవి కన్న స్వప్నం లాగా.

ఆనాటి పాట అతని కంఠంనుండి చాన్నాళ్ళ తర్వాత బయటికి వెలువడింది.

అప్పుడే బయటినుండి లోపలికి అడుగు పెడ్తున్న నిరాలీ ఆశ్చర్యపోయింది. తన జీవితంలోనుండి అపూర్వ దూరమైన నాటి నుండి మూగపోయిన అతని కంఠం మళ్ళీ ఇన్నాళ్ళకు ఇలా విప్పుకుంది.

★ ★ ★

ఆరోజు నవ్య తన దగ్గరకు వచ్చినప్పుడు ఆమెతో జరిగిందంతా చెప్పుకొని తన హృదయభారాన్ని దింపుకున్న అపూర్వ మనస్సు కాస్త తేలికపడింది. నవ్య వెళ్ళేటప్పుడు అపూర్వకి మరీ, మరీ చెప్పింది. "అప్పూ ఈ విషయంలో వైజయంతీ ఆంటీని నువ్వు చాలా ఘోరంగా శిక్షిస్తున్నావు. వద్దు, అప్పూ ఎంతయినా ఆమె నీ కన్నతల్లి. ఈ లోకంలో ఏ తల్లికీ తన కూతురు జీవితం నాశనం చేయాలన్న ఆలోచన కలలో కూడా కలగదు. ఆరోజున అనుకోకుండా జరిగిన సంఘటనలతో ఆమె మనసు చెదిరిపోయి ఉంటుంది. ఏం చేయాలో తోచని పరిస్థితిలో ఆమె అటువంటి నిర్ణయం తీసుకుని ఉంటుంది. ప్లీజ్ ఆమె మనసు కష్టపెట్టకు"

అపూర్వ ఒక్కక్షణం ఆలోచించి "కానీ నేను మయూర్‌ని మాత్రం ఎప్పటికీ క్షమించలేను. అతడు ఇతరులకోసం నన్నూ, నా ప్రేమనూ ఘోరంగా తిరస్కరించాడు" అంది.

అద్దంముందు నిలబడి ఆఫీసుకి వెళ్ళడానికి తయారవుతున్న అపూర్వ ఆ సంభాషణను పునరావృతం చేసుకొని ఆరోజునుండి వైజయంతితో కాస్త సవ్యంగానే మెలగడానికి నిర్ణయించుకుంది.

★ ★ ★

కాలేజ్‌కి వెళ్ళడానికి తయారైన ఆదిత్యా, ఆఫీసుకు వెళ్ళడానికని సిద్ధమైన వైజయంతీ తమకంటే ముందుగానే బ్రేక్‌ఫాస్ట్ చేయడానికి సిద్ధంగా డైనింగ్ టేబుల్‌పై కూర్చున్న అపూర్వను చూస్తూనే తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

కానీ అపూర్వ వీళ్లతో పొడిపొడిగానే మాట్లాడి త్వరగా ఏదో తిన్నాననిపించి ఆఫీస్‌కి వెళ్తున్నానని బై చెప్పి వెళ్లిపోయింది.

అపూర్వ కారు స్టార్టయిన శబ్దం, ఆ తర్వాత కారు వెళ్లిన శబ్దం దూరమైం తర్వాత ఆదిత్యా, వైజయంతీ చాలాసేపు మాట్లాడుకొని ఒక నిర్ణయానికొచ్చారు.

రెండ్రోజుల తర్వాత అపూర్వ తన ఆఫీస్ రూంలో కూర్చుని లాప్‌టాప్‌లో తన ఫైల్ వర్క్ చేసుకుంటోంది. ఆపరేటర్ ఫోన్‌లో "మేడమ్ రామ్మూర్తిగారు మిమ్మల్ని కలవడానికి వచ్చారు" అంది.

"సరే పంపించు" అంది అపూర్వ.

కొన్నిక్షణాల తర్వాత వైజయంతి పిఎస్ రామ్మూర్తి లోపలికి వచ్చాడు.

"మేడమ్ నేను ఒక నెలరోజులు లీవ్ పెట్టి టూర్ వెళ్దామనుకుంటున్నాను" అన్నాడు.

"నెల రోజులా నువ్వు లేకుంటే మమ్మీకి కష్టమవుతుందేమో అదీకాక నా పనులు కూడా కొన్ని నువ్వు చూస్తున్నావు మరి. వాటి సంగతేమిటి" అన్నది.

"వైజయంతిగారు లీవ్ శాంక్షన్ చేశారు మేడమ్. నేనొచ్చేటంత వరకు ఈ పనులన్నీ మీకెవరికీ కష్టం కాకుండా ఉండేటట్లుగా నాకు బాగా తెలిసిన వ్యక్తిని టెంపరరీగా అపాయింట్ చేశాను. అతనికి మీ వర్క్ కూడా ఎక్స్‌ప్లయిన్ చేశాను. మరేం పర్వాలేదు. అంతా సవ్యంగా జరుగుతుంది" అన్నాడు రామ్మూర్తి.

"ఉంటాను మేడమ్. ఈ విషయం చెప్పడానికే వచ్చాను" అంటూ వెళ్లిపోయాడు.



ఆ మర్నాడు అపూర్వ ఆఫీసుకు వస్తూనే ఆపరేటర్‌తో "కాస్త మమ్మీ దగ్గర కొత్తగా అపాయింట్ అయిన పిఎస్‌ని పంపించు నాక్కాస్త పనుంది" అని చెప్పింది.

కాసేపటికి "ఎస్ మేడమ్ పిలిచారట" అన్న చిరపరిచితమయిన కంఠం వింటూనే చివ్వున తల పైకెత్తింది. తన ఎదురుగా మయూర్ నిల్చున్నాడు చిరునవ్వుతో.

ఆమె మొదట నమ్మలేనట్లుగా చూసింది. ఆ తర్వాత విసురుగా తల తిప్పుకొని "నేను రమ్మన్నది మమ్మీ పిఎస్‌ని" అంటూనే మళ్లీ ఆపరేటర్‌కి కలిపి "నేనెవర్ని పంపమంటే నువ్వెవరిని పంపావు" అన్నది కోపంగా.

"అతనే వైజయంతి మేడమ్‌గారి పిఎస్‌గా అపాయింట్ అయ్యారు మేడమ్"

అపూర్వ కోపంగా రిసీవర్ పెట్టేసి "తమరు వెళ్లచ్చు" అన్నది మయూర్ వైపు తిరస్కారంగా చూస్తూ.



అతడు వెళ్లగానే ఆమె వైజయంతికి ఫోన్ కలిపింది. ఆమె ఆఫీస్ కాబిన్‌లో లేదు అని చెప్పారు. సెల్‌కి రింగ్ చేసింది. ఫోన్ స్విచాఫ్ అని వస్తుంది.

అపూర్వ కర్థమయింది. ఇదంతా కావాలనే చేస్తున్నారని.

అంటే తననీ విధంగా సాధిస్తున్నారన్న మాట. ఆనాడు అలా చేసింది చాలక మళ్లీ ఈనాడు మయూర్‌ని తన ముందుకు తీసుకొచ్చినంత మాత్రాన తను అతన్ని వరిస్తుందా. తనకు మాత్రం మనసులేదా. వాళ్లు వద్దనుకున్నప్పుడు కాదనుకోవడం. వాళ్లు కావాలనుకున్నప్పుడు ఒప్పుకోవడం అంతా వాళ్లిష్టా ఇష్టాలేనా. తనకు మనసూ, ఆత్మాభిమానం లేవా. తనెన్నడూ వాళ్లిష్టానికి లొంగకూడదు. దృఢంగా నిశ్చయించుకుంది అపూర్వ. తన మనసులోకి చిరునవ్వుతో పదేపదే వస్తున్న మయూర్ రూపాన్ని బలవంతంగా తోసివేస్తూ.

అపూర్వ ఆ రోజు మధ్యాహ్నమే తల నొప్పిగా ఉండడంతో ఇంటికి వెళ్లింది. భోజనం కూడా చెయ్యకుండా సరాసరి గదిలోకి వెళ్లిపడుకుంది. తిరిగి ఆమెకు మెలకువ వచ్చేసరికి సాయంత్రం ఐదయింది. అబ్బా ఎంతసేపు నిద్రపోయాను అనుకుంటూ కాఫీ తాగడానికి కిందికి వచ్చి గిరిజమ్మతో కాఫీ చెయ్యమని చెప్పి బాక్‌యార్డ్‌లోకి వెళ్లిన ఆమెకు ఒక వింత దృశ్యం ఎదురయింది.

అక్కడ వైజయంతి కూర్చొని ఉంది. ఆదిత్య, అనురాగ్, మయూర్ క్రికెట్ ఆడుతున్నారు. మయూర్ అనురాగ్‌కి బాట్ పట్టుకునే విధానం చూపుతున్నాడు. వంగి బాట్ పట్టుకొని నిల్చున్న అనురాగ్ వెనకాల నిలబడి వానిపైనుండి కాస్త వంగి రెండు చేతులూ వాడి భుజాల మీదుగా

వేసి బాట్‌తో బాల్‌ను పర్‌ఫెక్ట్‌గా ఎలా ఫేస్ చెయ్యాలో చూపిస్తున్నాడు. అలా చూపడంతో ఎంత దగ్గరితనం, ఎంత ఆప్యాయత కనబడుతున్నాయంటే ఇక అపూర్వ భరించలేకపోయింది. చెప్పలేనంత కోపంగా అక్కడ కూర్చున్న వైజయంతికి వేలెత్తి ఆ దృశ్యాన్ని చూపిస్తూ "ఏమిటది మమ్మీ" అన డిగింది.

"ఏముంది వాళ్లంతా క్రికెట్ ఆడుతున్నారు" అన్నది వైజయంతి.

"అది నాకూ తెలుసు మయూర్ నీ పిఎస్‌గా అపాయింట్ కావడం, అతడు మనింటికి రావడం గురించి అడుగుతున్నాను" అంది.

"ఓ అదా, రామ్మూర్తి వెళ్తుంటే నాకు వర్క్ చేసి పెట్టేందుకు ఎవరైనా ఉంటే చూడమన్నాను. మయూర్‌ని తీసుకొచ్చాడు. తెలిసిన వాడే కదా అని సరే అన్నాను. నాకీ రోజు ఇంట్లో అర్జెంట్‌గా కొన్ని ఫైల్స్ చూసి పెట్టేది ఉన్నందువల్ల మయూర్‌ని ఇంటికి రమ్మన్నాను" అంది నిర్లక్ష్యంగా.

ఆ నిర్లక్ష్యపు సమాధానం విని అపూర్వ ఘాటుగా ఏదో అనబోయేటంతలో మమ్మీ అంటూ తనను చూసిన అనురాగ్ ఇటు వస్తున్నాడు. ఆమె ఇక ఏం అనలేక అక్కడే వైజయంతి ఎదురుగా కుర్చీలో కూర్చుండిపోయింది.

"మమ్మీ మయూర్ అంకుల్ ఈ రోజు నాకు ఎన్నో కొత్త టిప్స్ నేర్పాడు తెలుసా" అని సంతోషంగా వచ్చి ఆమె ఒళ్లో కూర్చున్నాడు. ఆదిత్యా మయూర్ కూడా వాళ్లకి దగ్గరగా వచ్చారు.

ఇంతలో గిరిజమ్మ కాఫీ తీసుకొని వచ్చింది. ఆదిత్య మయూర్‌ని కూడా కూర్చోమని తనూ కూర్చున్నాడు.

అపూర్వ కక్కడ ముళ్లమీద కూర్చున్నట్లుగా కంపరంగా ఉంది.



గిరిజమ్మ అందరికీ కాఫీ ఇచ్చింది. మయూర్ కాఫీ వద్దని సున్నితంగా తిరస్కరించి వైజయంతితో "మేడమ్ రేపు ఆఫీసులో కలుస్తాను" అని ఆదిత్యకూ అనురాగ్‌కూ బై చెప్పి అపూర్వను చూడనట్లుగానే వెళ్లిపోయాడు.

అతడు వెళ్లిన కాసేపటికి అపూర్వ గిరిజమ్మతో అనురాగ్‌కి స్నానం చేయించమని చెప్పి పైకి వెళ్లిపోయింది. ఆమెకు ఏదో అసంతృప్తిగా ఉంది.

మయూర్ అక్కడికి రావడం తనకిష్టం లేదు నిజమే కానీ అతడు తనకు చెప్పకుండా వెళ్లడం ఆమెకు మరీ నచ్చలేదు. ఇలా ద్వైదీభావంతో కొట్టుమిట్టాడుతున్న అపూర్వకు రోజూ ఆఫీసులో, ఇంట్లోనూ అడపాదడపా మయూర్ తన కళ్ల బడటం తనకు ఆ రోజంతా మూడ్ పాడయిపోయి ఏదోలా ఉండటం ఇక భరించడం కష్టమైపోయింది. ఇక ఆ రోజు అపూర్వ ఖచ్చితంగా నిశ్చయించుకుంది. మమ్మీని గట్టిగా నిలదీసి, ఇంట్లోనూ, ఆఫీసులోను ఇలాగే మయూర్ కనబడితే తను వెంటనే తను ఇంట్లో నుండి వెళ్లి వేరేగా కంపెనీ గెస్ట్ హవుజ్‌కెళ్లిపోతానని బెదిరించాలనే దృఢనిశ్చయంతో ఆఫీసునుండి ఇంటికి వచ్చింది. కానీ ఈ రోజు అపూర్వ వచ్చేసరికి రోజూ కనబడే దృశ్యాలేవీ లేవు. వైజయంతి బయట పూలకుండీలకు నీళ్లు పోయిస్తోంది. ఆదిత్య ఇంట్లో లేనట్లున్నాడు. మయూర్ కనబడలేదు.

హమ్మయ్య అనుకుంటూ పైకి వెళ్లింది అపూర్వ. కానీ అక్కడ ఆమె కళ్లబడిన దృశ్యం అరికాలిమంట నెత్తికెక్కించేట్లుగా ఉంది. అక్కడ మయూర్ ఒళ్లో కూర్చొని అనురాగ్ కంప్యూటర్ గేమ్ ఎలా ఆడాలో నేర్చుకుంటున్నాడు.

ఆమె కొకందుకు కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి. అక్కడ అదే ప్లేస్‌లో తనూ తన తండ్రీ అలాగే కూర్చొనే వాళ్లు. ఒక్కసారి ఆ దృశ్యాలు ఆమె కళ్లముందు సినిమా

రీలులా తిరిగాయి. ఒకవైపు కోపం, ఒక వైపు బాధ ఆమెను కుదిపి వేస్తుండగా అనురాగ్ ఇలారా అని అరిచింది.

సీరియస్‌గా గేమ్ ఆడటంలో మునిగిపోయిన ఆ ఇద్దరూ ఒక్కసారిగా వినబడ్డ ఆ అరుపులాంటి పిలుపుతో ఇటువైపు తిరిగారు.

"హాయ్ మమ్మీ" అని పలకరించి తనను సరిగ్గా చూడనైనా చూడకుండా మళ్ళీ కంప్యూటర్ వైపు తిరిగాడు అనురాగ్.

అపూర్వ మళ్ళీ పిలిచింది.

"అనురాగ్ మనం షాపింగ్ వెళ్దాంరా. నీకీరోజు చాలా బొమ్మలూ, బుక్స్ కొనిస్తాను" అంది.

"వద్దు మమ్మీ. అయినా డోన్ట్ డిస్టర్బ్ మీ. గేమ్ చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది"

ఇక తట్టుకోలేక పోయింది. అపూర్వ కోపంగా వెళ్ళి వాణ్ణి మయూర్ వళ్ళో నుండి బయటికి లాగి "బుద్ధిలేదా పిలుస్తుంటే రావేంటి" అంటూ చెంపపైన ఒక్కటిచ్చింది. మళ్ళీ ఇంకో దెబ్బపడేదేగానీ మయూర్ వెంటనే అది గ్రహించి ఆమె చెయ్యి పట్టుకొని ఆపుతూ "అప్పూ నీకసలు బుద్ధుందా పిల్లాడిని పట్టుకొని అలా కొడతావా. వీడేం చేశాడని" అన్నాడు కోపంగా.

"కాల్‌మీ అపూర్వా మేడమ్" అని.

"అయినా నువ్వెవరు నన్ను సంజాయిషీ అడగడానికి. వాడు నా కొడుకు నా ఇష్టం. కొట్టుకుంటాను చంపుకుంటాను. నాకు వాడి మీద సర్వహక్కులూ ఉన్నాయి" అంది అపూర్వ.

ఆ మాటలు విన్న మయూర్ కళ్ళు ఎంత కోపాన్ని సంతరించుకున్నాయంటే అపూర్వ కాస్త జంకింది. కానీ మయూర్ అంతలోనే తననుతాను నిగ్రహించుకొని అనురాగ్ వైపు తిరిగి మృదువైన గొంతుకతో "నువ్వు కింద అమ్మమ్మ దగ్గరకు వెళ్ళు నాన్నా, నేనిప్పుడే వస్తాను" అని వాణ్ణి పంపించి

అప్పుడు అపూర్వ దగ్గరగా వచ్చాడు. "ఊ ఇప్పుడు చెప్పు నువ్వు వాడి తల్లివీ నీకు సర్వహక్కులు ఎలా ఉంటాయో, నేను వాడి తండ్రిని వాడికేదన్నా అన్యాయం జరిగితే నిలదీసే హక్కు నాక్కూడా ఉంటుంది. పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగుతూ లోకమంతా గుడ్డిది అనుకుంటుందట, నీ ప్రవర్తన అలాగే ఉంది.

నేను వాడి పక్కన నిలబడితే మమ్మల్ని చూసిన ప్రతి వాడూ నేను వాడి తండ్రినని చెబుతారు కానీ నువ్వు చెప్పుకుంటే గానీ వాడు నీ కొడుకని ఎవ్వరికీ తెలియదు" అలా అంటున్నప్పుడు అతడి కళ్ళలో కదలాడిన గర్వపుఛాయలు అపూర్వ దృష్టిని దాటిపోలేదు.

చిన్నప్పుడు అపూర్వను చూసి ప్రతి వాళ్ళూ చౌదరిగారితో మీ అమ్మాయి అచ్చం మీ పోలికేనండీ అన్నప్పుడు తండ్రి కళ్ళల్లో కనబడే ఫీలింగ్ తనకింకా గుర్తే.

ఇప్పుడు మయూర్ కళ్ళల్లో అదే ఫీలింగ్ ఛ దేవుడు తనను ఇక్కడా చిన్న చూపే చూశాడు. ఆమె కళ్ళనుండి ఉబికి వచ్చే నీళ్ళను మయూర్ కంట బడకుండా ముఖం పక్కకు తిప్పుకుంది.

"చూడండి అపూర్వా మేడమ్" ఒత్తి పలికాడు అతడు.

"నేనేదో మీ అందానికి భ్రమతో మీ వెంటపడుతున్నానని అనుకోవద్దు. మీరు నా జీవితంలోంచి నిష్క్రమించిన తరువాత నా ఇంటి ముందు కొన్ని వందల మంది నీకంటే ఎన్నోరెట్లు అందమైన వాళ్ళు నన్ను పెళ్ళి చేసుకుంటామని క్యూ కట్టారు. నేను బిజినెస్‌లో సక్సెస్ అయ్యాక ఎంతోమంది డబ్బున్న ఆడపిల్లల తండ్రులు నాలాంటి ఎఫీషియంట్ అల్లుడు కావాలని ప్రయత్నించారు. కానీ నేనెవర్నీ నా జీవితంలోకి ఆహ్వానించలేదు.

"నేనెప్పుడూ నీ ప్రేమని తిరస్కరించలేదు. ఇన్నేళ్ళుగా నీ ప్రేమని నేను గుర్తుపెట్టుకున్నాను కాబట్టే ఇప్పటికీ ఆ జ్ఞాపకా

లతో ఒంటరిగా ఉన్నాను. లేకపోతే ఈపాటికి పెళ్లి చేసుకొని అనురాగ్‌లాంటి ముగ్గురు పిల్లకు తండ్రినయ్యేవాణ్ణి. చూడు ఆత్మాభిమానం నీ ఒక్క దాని సొత్తేకాదు. ఎదుటివాళ్లకి కూడా కాస్తంత ఉంటుందని అర్థం చేసుకో. అయినా మూర్ఖత్వంతో కరుడు గట్టిన నీ మనసును మార్చాలనుకోవడం నాదే బుద్ధి తక్కువ.

"అయినా నేనేం గతిలేక బిచ్చగాడిలా నీ ఇంటికి రాలేదు. అనురాగ్ నా కొడుకని ఆ విషయం నీతో చెప్పించాలనీ నీ ఆఫీసులో, ఇంట్లో కాలుపెట్టాను. మైండ్ ఇట్"

అంటూ ఆమెవైపు తిరస్కారంగా చూసి అక్కడినుండి వెళ్లిపోయాడు మయూర్. అతని మాటలు విన్న అపూర్వ అతడు వెళ్లిన తర్వాత చాలా సేపటివరకు స్థాణువులా నిలబడిపోయింది. చీకటిపడింది కూడా చూసుకోలేదు. వైజయంతి వచ్చి అక్కడ లైటు వేస్తూ శిల్పంలా నిలబడ్డ అపూర్వని చూసి "అప్పూ అలా నిలబడ్డావేం ఏం జరిగింది" అంటూ దగ్గరకు వచ్చింది.

"వద్దు నా దగ్గరకు రావద్దు. అసలు దీనికంతటికీ మూలకారణం నువ్వే. నువ్వే నా జీవితాన్ని నాశనం చేశావు. అసలు నాకు ఈ ఇంట్లో ఉండాలంటేనే అసహ్యం వేస్తోంది" అంటూ అక్కడే ఉన్న ఆమె పర్స్ తీసుకొని చకచకా బయటకు నడిచింది. డ్రైవరు వద్ద నుండి కారు తాళాలు తీసుకొని తనే నడుపుకుంటూ వెళ్లిపోయింది. అలా ఆమె పిచ్చిగా రోడ్ల వెంబడి తిరుగుతూ కారు ఒక చోట ఆపింది. తననుతాను నిగ్రహించుకోవడానికి ఆమె 100 నుండి 1 వరకు కౌంట్‌డౌన్ స్టార్ట్ చేసింది. కాసేపటికి ఆమె కొంచెంగా కుదుటపడింది. ఆఖరికి ఈ కౌంటింగ్ ఐడియా మయూర్‌దే కదా. తను అతని జ్ఞాపకాల నుండి ఎందుకు బయటికి రాలేకపోతోంది. ఆమె ఇలా ఆలోచిస్తూండగానే హాండ్‌బ్యాగ్‌లో ఉన్న సెల్‌ఫోన్ రింగయ్యింది. ఆమె నంబర్ చూసింది ఆదిత్య నంబరది. ఒక క్షణం ఆలోచించి కాల్ రిసీవ్ చేసుకుంది.

"అక్కయ్యా మమ్మీని కేర్‌హాస్పిటల్‌లో చేర్చాం. నువ్వెక్కడున్నా వెంటనే రా" అని కంగారుగా అంటూ పెట్టేశాడు.

అపూర్వ కాసేపట్లోనే హాస్పిటల్‌కి వెళ్లి రిసెప్షన్‌లో ఎంక్వయిరీ చేసి ఇంటెన్సివ్ కేర్ యూనిట్ వైపు వెళ్లింది. అక్కడ ఆదిత్య బయటే నిలబడి ఉన్నాడు. అతని వదనం విషాదంగా ఉంది.

"ఆదీ మమ్మీకేమయింది" అనడిగింది.

"మమ్మీ స్లీపింగ్‌పిల్స్ చాలా మింగేసింది. స్టమక్ వాష్ చేస్తుంటే ఆమెకు సివియర్‌గా హార్ట్ ఎటాక్ వచ్చింది. 48 గంటల వరకూ ఏమీ చెప్పలేమంటున్నారు" అన్నాడు.

ఆ మాటలు విన్న ఆమె మెదడు మొద్దుబారి పోయినట్లుగా తన ఒంట్లోని శక్తినంతా ఎవరో లాగేసుకున్నట్లుగా అన్పించింది. అది గమనించిన అతను ఆమె చెయ్యి పట్టుకొని తీసుకు వచ్చి అక్కడే ఉన్న కుర్చీలో కూర్చోబెట్టాడు.

ఇంతలో ఐసియూ డోర్ తెరుచుకొని నర్స్ వచ్చి "ఇక్కడ అపూర్వ ఎవరు. పేషెంట్‌కి తెలివి వచ్చింది. అపూర్వని పిలుచుకొని రమ్మన్నారు" అంది.

అపూర్వ వెంటనే లేచి పరుగున లోపలికి వెళ్లింది.

అక్కడ బెడ్‌పైన ఆక్సిజన్ మాస్క్‌తో ఇంకా చుట్టుపక్కల ఏవేవో మెడికల్ ఎక్విప్‌మెంట్స్ మధ్యన నీరసంగా శ్వాస తీసుకోవడమే కష్టమన్నట్లుగా పడుకొని ఉన్న వైజయంతిని చూసి కళ్లనీళ్ల పర్యంతమైంది అపూర్వకి.

ఆమెకు అపూర్వను చూడగానే పాలిపోయిన ముఖంలోకి కాంతి వచ్చినట్లు అయింది. తనను దగ్గరగా రమ్మని సైగ చేసింది. అపూర్వ ఆమెకు బాగా దగ్గరగా వెళ్లి వంగి ఆమె ముఖంలోకి చూస్తూ "మమ్మీ ఇప్పుడెలా ఉంది" అస్పష్టంగా దుఃఖంతో

గొంతు పూడుకుపోతుండగా అడిగింది.

వైజయంతి అక్కడే ఉన్న డాక్టర్‌ని ముఖానికి ఉన్న ఆక్సిజన్ మాస్క్ తొలగించమని సైగ చేసింది. అతను ఏమనుకున్నాడో ఏమో దగ్గరగా వచ్చి దాన్ని పక్కకు జరిపి పెట్టాడు.

ఆమె అపూర్వ చెయ్యి పట్టుకొని "అప్పూ నాకిక బతకాలని ఆశ లేదు. కానీ నువ్విలా ఉండగా నా ఆత్మకు శాంతి ఉండదు కన్నా. నా మాట విను, నువ్వు మయూర్‌ని పెళ్లి చేసుకో. ఆనాడు నువ్వూ, మయూర్ శారీరకంగా దగ్గరయ్యారు అన్న విషయం నాకు చెప్పి ఉంటే నేనెటువంటి నిర్ణయం తీసుకునేదాన్నో. నువ్వు అనురాగ్‌కి జన్మనిచ్చిన మరుక్షణమే నాకు పరిస్థితి అర్థమయింది. కాని అప్పటికే నేను చేయడానికేం మిగల లేదు. నేను చేసిన పొరపాటుకు పశ్చాత్తాప పడని క్షణంలేదు. కానీ ఆ దేవుడు దయామయుడు. నేను చేసిన తప్పును సరిదిద్దుకునే అవకాశాన్నిచ్చాడు. ఈ నా చివరి కోరిక తీర్చు అప్పూ. నా పాపాన్ని ప్రక్షాళన చేసుకోనివ్వు" అతి దీనంగా ఆమె అంటున్న మాటలు విని చలించిపోయింది అపూర్వ.

ఇంతలో వైజయంతికి శ్వాస తీసుకోవడం కష్టమైంది. ఆమె కళ్లు మూసుకుపోతున్నట్లుగా అవసాగాయి. అది చూసి డాక్టరు కంగారుపడుతూ మళ్లీ ఆమె ముఖానికి మాస్క్ పెట్టి "మేడమ్ ఆమె పరిస్థితి బాగా దిగజారసాగింది. మీరు బయటకు వెళ్లండి ప్లీజ్" అన్నాడు.

అపూర్వ వైజయంతి చెయ్యి గట్టిగా పట్టుకొని "మమ్మీ నువ్వనుకున్నట్లే జరుగుతుంది. నేను నీ కోర్కె తీరుస్తాను" అని చెప్పి త్వరగా బయటికి వచ్చి బయట నిలబడి ఉన్న ఆదిత్యతో "ఆదీ మయూర్ ఇల్లెక్కడ అడ్రస్ చెప్పు" ఒకసారి వాచ్ వంక చూస్తూ అడిగింది. అప్పుడు సమయం రాత్రి 10 గంటలవుతుంది. అతడిప్పుడింట్లోనే ఉంటుండవచ్చు అనుకుంది ఆమె.

"ఎందుకక్కయ్యా"

"ప్లీజ్ ఆదీ నువ్వు ముందు చెప్పు"

"నా డ్రైవర్‌కి తెలుసు. నువ్వు వాణ్ణి తీసుకెళ్లు. బయటే కారు దగ్గర ఉంటాడు" ఆ మాట అనగానే ఆమె రివ్వున పరుగుతో బయటకు వెళ్లడం క్షణాలలో కార్లో కూర్చోవడం జరిగింది.

"నిరాలీ వాళ్ల ఇల్లు తెలుసుకదా అక్కడికి వెళ్లనివ్వు" అంది.

20 నిమిషాల్లో కారు మహేంద్రాహిల్స్ లోని ఇంటిముందు ఆగింది. అపూర్వ వాళ్ల కారు చూసి వాచ్‌మెన్ గేటు తలుపులు తెరిచాడు. ఆమె కారు దిగి డోర్ ముందు నిల్చొని బెల్ నొక్కింది.

ఆమె మనసంతా ఒక వైపు దుఃఖం, ఓ వైపు ఉద్వేగంలో నిండి ఉంది. ఉదయం నుండీ తిండీ తిప్పలు లేకుండా పిచ్చిదానిలా తిరగడం వల్ల ఆమె ముఖం కాస్త వాడినట్లుగా ఉంది. ఏడ్చి ఏడ్చి కళ్లు ఎర్రబారి ఉబ్బి ఉన్నాయి. వదులుకున్న ఆ సిల్కులాంటి జుట్టు బాగా రేగి ఉంది. నల్లటి షిఫాన్ దుస్తులు వేసుకున్న ఆమె ఆ స్థితిలో శోకదేవతలా ఉంది.

ఎవరో డోర్ తెరుస్తున్నట్లుగా చప్పుడయ్యింది. మయూరేమోనని అపూర్వ ఊపిరి బిగపట్టి చూడసాగింది.

కానీ డోర్ తెరిచింది ఆయమ్మ. ఆమెను చూస్తూనే "మయూర్‌బాబు ఉన్నాడా" అంది.

ఆమె అపూర్వని గుర్తుపట్టింది. ఆమె ఉన్నాడన్నట్లుగా తల ఊపి పక్కన ఉన్న గదివైపు చెయ్యిపెట్టి చూపించింది. అపూర్వ తడబడే అడుగులతో ఆ గదిలోకి వెళ్లింది. అది లైబ్రరీ రూమ్‌లా ఉంది. అందులో ఒక పక్కగా అన్నీ బుక్‌రాక్‌లూ, ఒక పక్క మ్యూజిక్ సిస్టమ్, రాక్స్‌లల్లో కాసెట్లూ, సీడీలూ ఉన్నాయి.

మయూర్ ఒక కార్నర్‌లో పెట్టి ఉన్న కంప్యూటర్ ముందు కూర్చొని ఏదో

వర్క్‌లో నిమగ్నమై ఉన్నాడు.

మ్యూజిక్ సిస్టమ్‌లో నుండి సన్నగా "జానే కహాఁగయే ఓ దిన్, కహె తేత్తె తెరీ రాహమే నజరోకొ హమ్ బిచాయెంగే" అంటూ గాయకుడు ముఖేష్ గొంతు అతి విషాదంగా, వినబడుతోంది.

ఆమెకు తను వచ్చినట్లుగా ఎలా తెలపాలో అర్థం కాలేదు. రెండు క్షణాలు ఆగి 'మయూర్" అని పిలవబోయింది. ఆమె గొంతు పెగలలేదు. మళ్లీ ప్రయత్నించింది.

ఈసారి "మయూర్" కాస్త లోవాయిస్‌లో అనగల్గింది.

అతడు వెనక్కు తిరిగి చూశాడు. ఆమెను చూస్తూనే చివ్వున లేచి నిల





బడి "ఓ అపూర్వా మేడమ్ ఇలా వచ్చారేమిటీ" అతని గొంతులో కాస్త హేళన వినబడింది.

"మయూర్ ప్లీజ్ అవహేళనలకు ఇది సమయం కాదు. నువ్వు నాతో వెంటనే హాస్పిటల్‌కి రావాలి. మమ్మీకి చాలా సీరియస్‌గా ఉంది. మనిద్దరం కలిసి వెళ్లి

మమ్మీకి కనబడి మనం పెళ్లి చేసుకుం టున్నాం అని చెప్పాలి" అంది.

"ఏమిటీ మనం పెళ్లి చేసుకోవాలా. ఓ మీ మమ్మీకోసం నీ ఆత్మాభిమానాన్ని చంపు కొని నన్ను ఇప్పుడు నువ్వు పెళ్లి చేసుకున్నా జీవితాంతం నేను మా మమ్మీకోసం నిన్ను చేసుకున్నాను అని వేధిస్తే భరించేశక్తి నాకు లేదు. ప్లీజ్ నన్నిలా బతకనియ్యి నాలో మళ్లీ ఆశలు రేపవద్దు. వెళ్లిపో. కొన ఊపిరితో ఉన్న మనిషికోసం ఆనాడే ఒక సారి నేను నా జీవితాన్ని కోల్పోయాను. ఇప్పుడిప్పుడే కుదురుకుంటున్నాను. మళ్లీ నన్ను ఊబిలోకి లాగకు" అన్నాడు.

అపూర్వ అతనికి దగ్గరగా వచ్చి "మయూర్ ప్లీజ్ కాదనకు నేను నిన్ను ఇప్ప టికీ మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను. కానీ ఆ విషయం చెప్పడానికి నా అహం అడ్డువ చ్చింది. అదీగాక నువ్వు అనురాగ్‌కి దగ్గర య్యేకొద్దీ వాడు నాకు దూరమవుతాడన్న ఇన్ సెక్యూర్డ్ ఫీలింగ్‌తో నీతో అలా ప్రవర్తిం చాను. ఇప్పుడు మా మమ్మీ నన్నీ కోరిక కోరి నప్పుడు ఆనాటి నీ పరిస్థితి నాకు పూర్తిగా అర్థమయ్యింది. నువ్వెలాంటి పరిస్థితిలో ఆ నిర్ణయం తీసుకున్నావో అర్థం చేసుకున్న నాకు ఇప్పుడు నీపై ఎటువంటి కోపమూ లేదు. మయూర్ ప్లీజ్ టైమ్ ఎక్కువ లేదు. మనిద్దరినీ కలిసి చూస్తే చివరి క్షణాల్లో ఉన్న మా మమ్మీ బతుకుతుందేమో" అతనికి అతి దగ్గరలో ఉన్న ఆమె ఇక ఆమాత్రం దూరం కూడా భరించలేనట్లుగా అతనికి హత్తుకుపోయి ఏడవసాగింది.

ఈసారి అతడు ఆమె ముఖాన్ని రెండు చేతులతో సున్నితంగా కొంచెం దూరం జరిపి కళ్లలోకి చూస్తూ "అయితే నువ్వు నన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడే పెళ్లికి సిద్ధమ య్యావన్నమాట"

ఆమె.. అతని వైపు చూస్తూ అవునన్న ట్లుగా తల వూపింది.

"అలా మూగగా చెప్తే నాకర్థం కాదు. నోటితో చెప్పు" ఈసారి అతనలా అంటున్న ప్పుడు అతని పెదాల పైనా, కళ్లలోనూ దాచు కోవాలన్నా దాగని నవ్వు కనబడుతోంది.

ఈసారి ఆమె కాస్త రోషంగా చూసింద తని వైపు. 'నాకు ప్రాణసంకటంగా ఉంటే నువ్వు నవ్వుతున్నావా" అన్నట్లుగా. అతను ఆమెవైపు సమాధానం కోసం చూశాడు.

"అవును నువ్వంటే నాకిష్టం. ఐ లవ్యూ సరేనా" అంది గబగబా.

అప్పుడే అపూర్వను వెతుక్కుంటూ అక్క డికి వచ్చిన ఆదిత్య, ఇంట్లో ఉన్న నిరాలీ గదిలోకి రాబోయి వాళ్లని ఆ స్థితిలో చూసి అక్కడే ఆగిపోయారు.

"ఆదిత్యా మీ అక్కయ్య మాటలు విన్నా వుగా దీనికి నువ్వే సాక్ష్యం" అన్నాడు మయూర్ నవ్వుతూ.

ఆ తర్వాత మర్నాడే అపూర్వ, మయూ ర్‌ల వివాహం హైదరాబాద్‌లో తిరుపతి దేవస్థానం వారి చేత నిర్మింపబడ్డ పెళ్లిమం డపంలో ఆదిత్య, నిరాలీ, ఆయమ్మ కొద్ది మంది ముఖ్య బంధువులు, ఆఫీస్‌స్టాఫ్‌ల మధ్య చాలా నిరాడంబరంగా జరిగింది.

వారం రోజుల తర్వాత వైజయంతి పూర్తిగా కోలుకొని ఇంటికి వచ్చింది.

ఆ తర్వాత ఆదిత్య మయూర్, అపూర్వ లకు యూరప్ ట్రిప్ పాకేజి టిక్కెట్స్ గిఫ్ట్ చేసి అనురాగ్ సంరక్షణ తాము చూసుకుం టామని నచ్చజెప్పి వాళ్లని హనీమూన్‌కి పంపించారు.

★ ★ ★

20 రోజుల తర్వాత పారిస్‌లోని ఒక రెస్టారెంట్‌లో కాండిల్‌లైట్‌లో డిన్నర్ చేస్తున్నారు. ఈ ఇరవై రోజుల్లో అపూర్వకి ఒకనాడు కూడా గడిచిన 10 ఏళ్ల ఒంటరి జీవితం గుర్తు తెచ్చుకోనంతగా కంపెనీ ఇచ్చాడు మయూర్. ఆమె ముఖం చెప్పలే నంత ఆనందంతో వర్ణించలేనంత దీప్తివం తంగా వెలిగిపోతూ ఉంది. మయూర్ తన ముందర టేబుల్‌పైన ఉన్న సెల్ తీసుకొని

ఇండియాలోని తన ఇంటికి డయల్ చేశాడు. అవతల నుండి హలో అని నిరాలీ గొంతు వినబడింది.

"నీరూ హౌఆర్‌యూ, అనురాగ్ ఎలా ఉన్నాడు" అడిగాడు.

రేపు సాయంత్రం ఫ్లైట్‌కి హైదరాబాద్‌కి రీచ్ అవుతున్నామనీ ఫ్లయిట్ నంబరు, టైము చెప్పి ఫోన్ పెట్టేశాడు.

ఎయిర్‌పోర్ట్‌కి ఆదిత్య, నిరాలీ అనురాగ్‌ని తీసుకొని వచ్చారు. అక్కడ్నించి మయూర్, అపూర్వ అనురాగ్‌ని తీసుకొని నిరాలీతో మహేంద్రహిల్స్‌లోని తమ ఇంటికి వచ్చారు.

ఆదిత్య ఒక్కడూ శక్తివిల్లాకు వెళ్లాడు.

★ ★ ★

ఒకరోజు రాత్రి అపూర్వ తన ఇంట్లో డైనింగ్ టేబుల్‌పై ఆయమ్మ సహాయంతో రాత్రి భోజనానికని అన్నీ అమర్చి పెడు తోంది. మయూర్, అనురాగ్ టీవీలో డే అండ్ నైట్ క్రికెట్ మాచ్ చూస్తున్నారు. లోపల తన గదిలో నిరాలీకి ఫోన్ వచ్చిన ట్లుంది మాట్లాడుతూ అలాగే బయటికి వచ్చి మయూర్‌తో

"ఆదిత్య మాట్లాడుతున్నాడు భయ్యా! టెన్ డవునింగ్ పబ్‌కి ఇన్వయిట్ చేస్తు న్నాడు. వెళ్లనా" అనడిగింది గారాబంగా.

"నో, నీరూ ఇంక వారంలో నీ ఫైనల్ ఎగ్జామ్స్ దగ్గరకొస్తున్నాయి. శ్రద్ధగా చదు వుకో" అన్నాడు మయూర్.

అతనలా అనడంలో నిరాలీ ముఖం చిన్నబోయింది. "ఆదీ నేను రాను" అని పొడిగా చెప్పి ఫోన్ పెట్టేసింది.

మయూర్ మాటలు విన్న అపూర్వ ఆశ్చ ర్యంగా "అలా ఎందుకన్నావు మయూర్ నిరాలీ వెళ్తానన్నది ఆదిత్యతోనేకదా" అంది.

"నిజమే కానీ ఆ పబ్‌లలో వాతావరణం చాలా రెచ్చగొట్టే విధంగా ఉంటుంది. వీళ్ల ఆవిధంగా తిరగడం నాకిష్టంలేదు" అన్నాడు.

"అంటే నీకు ఆదిత్య మీద నమ్మకం లేదా" రోషంగా అడిగింది.

"అపూ్వా నువ్వెప్పుడూ ఇంతే. ఏదీ సరిగ్గా అర్థం చేసుకోవు. అనుకున్నవి అనుకున్న ట్లుగా జరగడానికి ఇది కథ కాదు జీవితం. జీవితంలో ఏ నిమిషానికి ఏం జరుగు తుందో ఎవరూ చెప్పలేరు. మన జీవితాన్నే ఉదాహరణకి తీసుకో ఆనాడు మా ఇంట్లో మనిద్దరి మధ్యా ఆ సంఘటన జరుగుతుం దనీ, నీ బర్త్‌డే రోజు చౌదరి గారికి ఆక్సి డెంట్ జరుగుతుందనీ నువ్వేనాడయినా ఊహించావా. అందుకే ఒక బాధ్యతగల ఆడపిల్ల అన్నయ్యగా నేను జాగ్రత్త పడుతు న్నాను. అపూ్వా! నీరూ వాళ్ల ఎగ్జామ్స్ కాగానే మంచి రోజు చూసి ముహూర్తాలు పెట్టిం చమని మన రెండు కుటుంబాలకూ పెద్ద దిక్కుగా ఉన్న వైజయంతీ ఆంటీకి రేపు వెళ్లి చెప్పి వద్దాం సరేనా" అన్నాడు మయూర్.

ఈ మాటలన్నీ గదిలోకి కోపంగా వెళ్లిన నిరాలీ కూడా వింది.

వెంటనే గదిలోనుండి పరుగున వచ్చి "ఐ యామ్ సారీ భయ్యా నేను నిన్ను అర్థం చేసుకోలేకపోయాను. నేను రానన్నానని ఆదిత్యకు కూడా కోపం వచ్చింది. నేనతనికి ఫోన్ చేసి కన్విన్స్ చేస్తాను" అంటూ మయూర్ పక్కన వచ్చి కూర్చొని ఫోన్ డయల్ చెయ్యసాగింది.

అవును ఇది జీవితం. తను ఈ పదేళ్లుగా కలలో కూడా ఎన్నడూ ఊహించలేదు, తనిలా తన ఇంట్లో తన భర్తతో, కొడుకుతో, ఆడపడుచుతో నిండైన సంసార జీవితాన్ని గడపగల్గుతుందని. ఆమె ఆ ఇంటినీ, ఇంట్లోని మనుషులనూ కళ్ల నిండుగా చూసు కుంటూ మళ్లీ ఒకసారి అవును "ఇట్స్‌లైఫ్" అని అనుకుంటున్న అపూర్వకు ఒక్క విషయం మాత్రం ఎప్పటికీ తెలియదు. తను మయూర్‌ని పెళ్లి చేసుకోవడానికి ఒప్పించేం దుకు ఆడిన నాటకంలో తను తప్ప అందరూ పాత్రధారులేనని.



# చతుర ప్రపంచం

## పెన్నీపోస్టల్ సిస్టమ్

**1836**లో ఒకావిడకి ఆవిడ భర్తనుంచి ఓ ఉత్తరం వచ్చింది. పోస్ట్‌మాన్‌కి దాన్నావిడ తిరిగి ఇచ్చేసింది. ఎందుకంటే ఆ రోజుల్లో ఉత్తరం స్వీకరించేవారే దాని పోస్టేజి ఖర్చు చెల్లించాలనే నియమం వుండేది. ఆమె దగ్గర ఆ డబ్బులేక ఆ ఉత్తరాన్ని తీసుకోలేదు. ఆ అమ్మాయి పేరు చరిత్రలో నమోదు కాలేదు కానీ ఈ సంఘటనని గమనించి, దాన్నించి ప్రేరణ పొందిన రోలెండ్‌హిల్ అనే వ్యక్తి తపాలా వ్యవస్థలోని ఈ లోపాన్ని సరిదిద్దాలనుకున్నాడు.

బీదవాళ్లేకాక డబ్బున్న వాళ్లు కూడా ఉత్తరాల్ని అంగీకరించకపోవడం ఆ రోజుల్లో జరిగేది. కారణం ఉత్తరం రాసేవాళ్లు దాన్ని అందుకునేవారు అందులోని సమాచారాన్ని కవరుమీద చిరునామా రాసే విధానంలోనే ముందుగా ఏర్పాటు చేసుకున్న కోడ్ ప్రకారం పంపుకునేవారు. ఉదాహరణకి కవర్‌మీద ఒక కొట్టివేత వుంటే తను క్షేమంగా చేరానని; రెండు వుంటే అనుకున్న రోజుకి తిరిగి వస్తానని, పేరు పూర్తిగా రాస్తే వెళ్లిన పని అయిందనీ ఇలా తెలివిగా ఉత్తరం ద్వారా తెలియచేయాల్సిన సమాచారాన్ని చిరునామా ద్వారా తెలియచేస్తుండేవారు.




ఇందుకు కారణం ఉత్తరాలు ఇప్పటిలా అప్పుడు చవకకాదు. పదిహేను మైళ్ల దూరానికి ఒక పెన్ను, అదే 700 మైళ్ల దూరంలోని వారయితే ఎనిమిది పెన్నులు... ఇలా దూరాన్ని బట్టి ఉత్తరం రుసుము నిర్ణయింపబడేది.

దాంతో రోలెండ్‌హిల్ ఈ విషయం మీద తీవ్రంగా ఆలోచించి ఓ కొత్త పద్ధతిని కనుగొన్నాడు. ఉత్తరాలు రాసుకోవడం అందరికీ ఆర్థికంగా అందుబాటులో వుంటే పోస్టల్‌శాఖని ఉపయోగించుకునే ప్రజల శాతం ఎంతో పెరిగి చివరికి అందరూ ఉపయోగించుకోగలుగుతారనీ దూరంతో సంబంధం లేకుండా ఒక్కో ఉత్తరానికి ఒక పెన్నీ వసూలు చేస్తే చాలనీ, దాన్ని మిస్‌యూజ్ చెయ్యకుండా ఉత్తరం పంపేవారే ఆ రుసుము చెల్లించాలన్న పద్ధతిని ఆయన రూపొందించాడు.

దానికి 'పెన్నీ పోస్టల్‌సిస్టమ్'* అని పేరుపెట్టాడు. దాంతో పోస్టల్‌శాఖని ప్రజలంతా

ఉపయోగించడంతో ఆదాయం గణనీయంగా పెరుగుతుందని రాజకీయ నాయకులకు వివరించాడు. ఓ మంచి పద్ధతి అమలులోకి రావాలంటే అనుమానాలు, అభ్యంతరాలూ తప్పవన్నట్టుగా దీనికీ అలానే వచ్చాయి. పార్లమెంట్‌లో పెన్నీపోస్టల్ సిస్టమ్ మీద చర్చలు జరిగాక దాన్ని పార్లమెంట్ ఆమోదించి బిల్‌పాస్ చేసింది. దాంతో ఇంగ్లండ్‌లో ఉత్తరాల వాడకం అధికంగా పెరిగింది. దాన్ని గమనించిన అన్ని దేశాలు కూడా ఇదే పద్ధతిని అనుసరించడంతో 1840కల్లా ప్రపంచంలోని అన్ని దేశాల్లో, ఆ దేశంలోని మారక ద్రవ్యంలో అతి తక్కువ స్థాయి నాణెంకు (మన దేశంలో అప్పట్లోని దమ్మిడి) ఉత్తరాల బట్వాడా ఆరంభమయింది. వాడకందారులు పెరగడంతో తపాలా బిళ్లను ప్రవేశపెట్టారు. ఒకదేశం నుంచి ఇంకో దేశానికి ఉత్తరాలను పంపే పద్ధతి ఈ నేపథ్యంలో చోటుచేసుకుంది.

రోలెండ్‌హిల్ మరణానంతరం అతని భౌతికకాయాన్ని వెస్ట్ మినిస్టర్ హబ్బేలో సమాధి చేశారు.

---

## ఇంటర్వ్యూ

విరూపాక్షరావు జీవితంలో అనేక ఒడిదుడుకులు ఎదుర్కొన్నాడు. నిరంతరం శ్రమించాడు. ప్రతిభ, ధైర్యం, పట్టుదల అనే పెట్టుబడితో చిన్న వ్యాపారాన్ని ప్రారంభించాడు. అతని నిర్వహణా ప్రతిభతో ఆ వ్యాపారం మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఎంతో అభివృద్ధి చెందింది. కొద్దికాలంలోనే విరూపాక్షరావు ఒక పరిశ్రమ పెట్టి ఒక పారిశ్రామికవేత్త అయ్యాడు.

స్వశక్తితో పైకి వచ్చిన అతను వ్యాపారానికి సంబంధించిన అన్ని విషయాలూ స్వయంగా చూడసాగాడు. తన వ్యాపారం మరింత పెరిగేసరికి విరూపాక్షరావుకి అప్పటికే తన వద్ద పని చేస్తున్న సేల్స్‌మాన్‌లు సరిపడక మరి కొందరు సేల్స్‌మాన్‌ల అవసరం ఏర్పడింది. అతను తన అవసరాన్ని గురించి పత్రికలో ప్రకటన ఇచ్చాడు.

అనేక మంది నిరుద్యోగులు విరూపాక్షరావు ఏర్పాటు చేసిన ఇంటర్వ్యూకి వెళ్లారు. ఒక పెద్ద హాలులో వారంతా బుద్ధిగా కూర్చున్నారు విరూపాక్షరావు స్వయంగా ఇంటర్వ్యూ చేశాడు. ఆ హాల్లోని గోడకు ఒక పెద్ద తెల్లటి అట్ట అంటించబడి ఉంది. ఆయన తన వ్యాపారాన్ని గురించి కొంతసేపు ముచ్చటించాడు. పిమ్మట గోడకు వున్న తెల్లటి అట్టవద్దకు వెళ్లి దానిపై ఒక చిన్న నల్ల చుక్కను పెట్టాడు. కొద్దిసేపు గంభీరంగా హాల్లోని అందరి వంకా చూశాడు. నిశ్శబ్దం గడ్డకట్టింది అక్కడ. ఆ నిశ్శబ్దంలో తీవ్రమైన సస్పెన్స్ ఏర్పడింది. హఠాత్తుగా ఆ వ్యాపారవేత్త అడిగాడు.

"మీరిక్కడ ఏం చూస్తున్నారు"

"ఒక నల్లటి చుక్క" చెప్పారు యువకులంతా ముక్త కంఠంతో.

"మరొకసారి చూడండి" విరూపాక్షుడు అన్నాడు. అందరూ కళ్లు బాగా నలుపుకొని మరీ ఆ అట్టను చూశారు. వాళ్లకు కనిపించింది నల్లచుక్క ఒక్కటే.

"ఒక నల్లచుక్క మాత్రమే మాకు కనపడుతోంది" అభ్యర్థులు కోరస్‌తో అన్నారు.

"చూడండి అబ్బాయిలూ, మీరు కేవలం ఒకే చోట దృష్టి కేంద్రీకరించారు. అయితే మీరు జీవితంలో విజయం సాధించాలంటే ఇతరులకన్నా మీరు విభిన్నంగా అన్నిటినీ చూడగలగడం నేర్చుకోవాలి. అలా చెయ్యలేకపోతే మీరొక అవకాశాన్ని పోగొట్టుకొన్నవారు అవుతారు. ప్రతీ విషయానికీ ఎంతో పరిశీలన అవసరం. అతి చిన్నదైనా అతి పెద్దదైనా" చెప్పాడు.

కొంతసేపు మౌనం పిమ్మట "కళ్లముందు స్పష్టంగా కనిపించే ఏదైనా నిశితంగా చూసి ఒక నిర్ణయానికి రావాలి. మీరంతా నల్లచు




క్కను మాత్రమే చూశారు. అయితే మీరు మీ కళ్లముందు వేలాడుతున్న తెల్లటి అట్టను చూడలేకపోయారు. కేవలం అక్కడ ఒక నల్ల చుక్క మాత్రమే ఉందని చెప్పారు" అన్నాడు విరూపాక్షుడు.

అది విని యువకులంతా తెల్లబోయారు. పిమ్మట ఆ బిజినెస్ టైకూన్ తన ఇంటర్వ్యూ సంగ్రామాన్ని ఒక గంటసేపు హోరాహోరీగా సాగించి చివరికి అక్కడ హాజరైన 75 మంది క్యాండిడేట్లలో 15 మందిని సేల్స్ మాన్‌లుగా ఎన్నుకొన్నాడు. ప్రకటనలో అభ్యర్థులెవ్వరికీ రానూపోనూ ఛార్జీలు వగైరాలు ఇవ్వబడవు అని ప్రకటించినప్పటికీ, కష్టసుఖాలు తెలిసిన విరూపాక్షుడు ఉద్యోగాలు రాని 60 మంది నిరుద్యోగులకు ఛార్జీలు, ఇతర ఖర్చులు ఇచ్చి పంపాడు.

---

## కాంటాక్ట్ బటన్

**జ**ర్మనీకి వెళ్లే అమెరికన్ యాత్రికులలో చాలా మందికి జర్మన్ భాషరాదు. జర్మన్స్‌కి ఇంగ్లీషు రాదు. దాంతో అమెరికన్స్ ఎవరితో మాట్లాడలేక ఒంటరిగా ఫీలవుతుంటారక్కడ. ఇంగ్లీషు తెలిసినా జర్మన్స్ ఇంగ్లీషు భాషలో మాట్లాడ్డానికి ఇష్టపడరు.

ఫ్రాంక్‌ఫర్ట్‌లోని జర్మన్ టూరిస్ట్ అధికారి హోస్ట్ ఇగీన్‌స్కాజ్ ఈ సమస్య మీద ఆలోచించాడు. చివరికి జర్మన్ భాషరాని ప్రతి యాత్రికుడికీ ఉపయోగించే ఓ పరిష్కారాన్ని కనుగొన్నాడు.

'కాంటాక్ట్‌బటన్' ఆ పరిష్కారం. జర్మనీకి వచ్చే ప్రతి విదేశీ యాత్రికుడికి ఓ కాంటాక్ట్ బటన్‌ని చొక్కాకి తగిలించుకోడానికి టూరిస్ట్ ఆఫీసువారు ఇస్తారు. దానిమీద 'అంతర్జాతీయ యాత్రికుడు' అని ఇంగ్లీషు భాషలో వుంటుంది. దాన్ని ధరించే వ్యక్తి పేరు, ఏ దేశానికి చెందినవాడు, అతను మాట్లాడగలిగే భాషల వివరాలు, ఆయా భాషలు, మాట్లాడే దేశాల జెండాలు ఆ బటన్ల మీద వుంటాయి.

ఇందువల్ల రెండు విషయాలు ఇతరులకి స్పష్టం అవుతాయి. ఒకటి ఇతను ఇతరులతో కాంటాక్ట్‌కి కుతూహలంగా వున్నాడని, అతను ఏఏ భాషలు మాట్లాడగలడు అన్న విషయం ఆ కాంటాక్ట్ బటన్ ద్వారా పరులకి విశదం అవుతుంది. దాంతో జర్మనీకి ఇతర దేశాలనుంచి వచ్చిన టూరిస్టులు ఒకరితో మరొకరికి ఎలాంటి ఇబ్బంది లేకుండా తమ భాషను మాట్లాడుకో గలరు. నాలుగు నెలల పాటు ఈ కాంటాక్ట్ బటన్స్‌ని వాడాక జర్మనీలోకి వచ్చే యాత్రికుల సంఖ్య పెరిగింది. ఆ కాంటాక్ట్ బటన్స్‌ని ఇళ్లకి తీసుకెళ్లి డ్రాయింగ్ రూమ్స్‌లో




వుంచుకోవడంతో వాళ్లింటికి వచ్చినవారు దానిని గురించి ప్రశ్నించి తెలుసుకోవడం జర్మన్ టూరిజానికి ప్రకటనగా మారడంతో పెరుగుదల కనిపించింది.

ఈ పద్ధతి విజయవంతం అవడంతో ఇప్పుడు బ్రిటన్, ఫ్రాన్స్, స్పెయిన్, గ్రీస్, సింగపూర్‌లలో కూడా కాంటాక్ట్ బటన్ పద్ధతిని అమలులోకి తెచ్చారు.

## లేసర్‌గన్

ప్రపంచంలో టెర్రరిజంతో కూడిన హింస రోజురోజుకీ అధికం అయిపోతోంది. టెర్రరిజానికి బాధితులు కాని దేశం నేడు భూగోళంలో లేదంటే అతిశయోక్తి కాదు. టెర్రరిస్టులని ప్రాణాలతో పట్టుకుంటే వారి నుంచి విలువైన సమాచారం పోలీసులకి లభిస్తుంది కానీ ఎదురుకాల్పుల్లో వీరు మరణించడం అధికంగా జరుగుతోంది. ఆయుధాలతో ప్రతిఘటన చేయకుండా ఏ ఉగ్రవాదీ తేలికగా లొంగడు కదా!

ఈ సమస్యని పరిష్కరించడానికి జర్మన్ పోలీస్ విభాగానికి చెందిన శాస్త్రజ్ఞులు ఇటీవల ఓ కొత్తరకం ఆయుధాన్ని కనిపెట్టారు. దాని పేరు లేసర్‌గన్. ఆ తుపాకిని ఉపయోగిస్తే ఇనపగుండు బదులు రాగితో చేసిన అంగుళం వ్యాసం గల చిన్న నాణెంలాంటిది వెలువడుతుంది. దాంట్లో విద్యుత్‌శక్తి ప్రవహిస్తూ వుంటుంది. అది తాకిన మనిషి శరీరంలోకి విద్యుత్ ప్రవహిస్తుంది. విద్యుత్ ఘాతంతో మనిషికి షాక్ తగిలి అయిదారు నిమిషాలపాటు బుర్ర పనిచేయదు. అయితే స్పృహ తప్పదు. ఈలోగా పోలీసులు వెళ్లి నిరపాయకరమైన ఆ ఉగ్రవాదిని తమ ఆధీనంలోకి తీసుకోవచ్చు.

ఈ తుపాకిని ముందుగా ఛార్జ్ చెయ్యాలి. అందుకు అనువుగా ఆ తుపాకికి వుండే వైరు చివర వుండే ప్లగ్‌ని విద్యుత్ సాకెట్‌లో నలభైనిమిషాలసేపు వుంచాలి. ఒకసారి రెండు రాగి బుల్లెట్లు ఛార్జ్ అవుతాయి. అంటే కేవలం రెండు బుల్లెట్లనే ఈ తుపాకీ (ఛార్జి అయ్యాక) ప్రయోగించగలదన్నమాట. ఉపయోగించాక తిరిగి ఆ బుల్లెట్లను సేకరించి మరోసారి ఛార్జ్‌చేసి ఉపయోగించవచ్చు. ఇలా ఒక్కో బుల్లెట్‌ని అయిదారుసార్లు మళ్లీ మళ్లీ ఉపయోగించవచ్చు. ఆ తర్వాత అది నిరుపయోగం అవుతుంది.

2001 నుంచి జర్మన్ పోలీసులు ఈ తుపాకిని ఇంతదాకా అయిదుసార్లే ఉపయోగించారు. అదీ టెర్రరిస్టులమీద కాదు. ప్రాణాలని కాపాడ్డానికి లేదా దొంగలని పట్టుకోవడా

నికీ మాత్రమే.

బెర్లిన్‌లో ఓ ఎత్తయిన భవంతిమీంచి దూకి ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించిన ఓ 37 ఏళ్ళతన్ని రక్షించడానికి పోలీసులు లేసర్‌గన్‌ని తొలిసారిగా ఉపయోగించారు. షాక్ తగిలి నిశ్చేష్టుడైన అతని దగ్గరకి పోలీసులు పరుగెత్తికెళ్ళి అతని ప్రయత్నాన్ని వమ్ముచేసి కిందకి దించారు.

మరో సందర్భంలో మెడకి కత్తిని ఆనించుకుని, తనతల్లి తనకి ఆస్తి ఇవ్వకపోతే మరణిస్తానని బెదిరించిన ఇంకొకతన్ని ఈ తుపాకి ద్వారా జర్మన్ పోలీసులు రక్షించారు. ఖిగిలిన మూడు సందర్భాల్లో దొంగతనం చేసి పారిపోతున్న దొంగలని పట్టుకోడానికి లేసర్‌గన్‌లని ఉపయోగించారు.

ఓ జేమ్స్‌బాండ్ తరహా సినిమాలోని ఓ దృశ్యం ఈ గన్ రూపకల్పనకి ప్రేరణ అయింది. ఆ సినిమాలో హీరో విలన్‌మీద ఇలాంటి గన్‌ని ఉపయోగిస్తాడు. ఆ సినిమా జర్మన్ భాషలోకి డబ్బింగ్ అయింది. దాన్ని చూసిన ఓ పోలీస్ కానిస్టేబుల్ తన నగర కమిషనర్‌కి దాని గురించి సూచించాడు. (ఇలాంటి సూచనలు ఆమోదయోగ్యమైతే ఆ సూచన చేసిన వారికి ప్రమోషన్‌కి ఓ మార్క్ కలుస్తుంది) దాన్ని చదివిన నగర్ కమిషనర్‌కి అది రుచించలేదు. ఓరోజు ఆయన ఓ మందు పార్టీలో ఈ సూచనను తాను నిరాకరించానని ఓ శాస్త్రజ్ఞుడితో చెపితే అతను ఆ ఐడియాను డెవలప్ చేసి అయిదునెలల పద్నాలుగు రోజుల్లో లేసర్‌గన్‌ని తోటి శాస్త్రజ్ఞుల సహకారంతో రూపొందించాడు. దాన్ని పోలీసు కమిషనర్ వద్ద ప్రదర్శించి చూపించాడు




జర్మనీనుంచి ఈ గన్స్ ఇటలీ, ఇంగ్లండ్, ఫ్రాన్స్ లాంటి యూరోపియన్ దేశాలేకాక చైనా, కొరియా లాంటి ఆసియా దేశాలు కూడా కొన్నాయి.

జర్మన్ శాస్త్రజ్ఞులు ఈ తుపాకీలను అభివృద్ధి చేయడానికి ప్రస్తుతం కృషిచేస్తున్నారు. ఎందుకంటే ఇవి బాగా బరువైనవి. ఒకరు అతికష్టంమీద దీన్ని మొయ్యగలరు. ఆ బరువును తగ్గించేందుకు కూడా కృషి జరుగుతోంది.

అయినా కమిషనర్‌కి లేసర్‌గన్ రుచించలేదు. కానీ మర్నాడే అమెరికాలోని న్యూయార్క్ ట్విన్ టవర్స్‌మీద ఉగ్రవాదులు దాడి చేశారు. అది ప్రపంచంలో ఎంతోమందిని భయభ్రాంతులని చేసింది. కమిషనర్ మారుమాట్లాడకుండా లేసర్‌గన్ ఉత్పత్తికి అనుమతినిచ్చాడు.

*

# చతుర కతలు

## నైజం

"అబ్బ, ఒకసారి అటు చూడండి, ఆ అమ్మాయి ఎంత అందంగా ఉందో? "

"ఎటు? " మా అమ్మాయి ఐస్‌క్రీమ్ తిన డానికి సహాయపడుతున్న నేను తల ఎత్త కుండానే ప్రశ్నించాను మా ఆవిడను.

"ఆ గుండ్రటి కళ్ళు..." మా ఆవిడ వర్ణన మొదలుపెట్టింది.

"ఆc"

"అందంగా కొనతేలిన ముక్కు..."

"ఊc"

"పోకచెక్కంత నోరు..."

"ఆహాc!"

"నల్లటి ఒత్తయిన జుట్టు..."

"ఓహో!"

"ఆ వంటిరంగు..."

"ఊహూc"

"ఆ విశాలమైన ముఖం. అబ్బ! దేవుడు కొంతమందిని అంత అందంగా ఎందుకు పుట్టిస్తాడో? ఆడదాన్నైన నాకే ఆ అమ్మాయిని ఇంకా ఇంకా చూడాలనిపిస్తున్నది, ఇక మగవాళ్ళకు ఏమనిపిస్తుందో!"

నేనిక ఆగలేకపోయాను. "ఎక్కడ ఆ అమ్మాయి? " అటూ ఇటూ చూస్తూ ప్రశ్నించాను మా ఆవిడను.

"అదిగో, మీ వెనుకవైపు కుర్చీలో" తదేకంగా అటే ఆరాధనగా చూస్తూ అంది మా ఆవిడ.

మరీ తల తిప్పి చూస్తే బాగుండదని, పేపర్ న్యాప్‌కిన్ తెచ్చుకునే నెపంతో లేచి వెళ్ళి ఈసారి మా ఆవిడ పక్కనే ఉన్న కుర్చీలో కూర్చొని తను చూస్తేవైపే చూశాను.

నలుగురు స్నేహితులతో కలిసి కూర్చొని ఐస్‌క్రీమ్ తింటున్న ఒక అమ్మాయి అదే సమయంలో నావైపు చూసేసరికి నాకు వెంటనే తెలిసిపోయింది, మా ఆవిడ మాట్లాడింది ఆ అమ్మాయి గురించేనని. నిజంగానే ఆ అమ్మాయి చాలా అందంగా ఉంది. అది కళ్ళు జిగేలుమనిపించే అందం కాదు. మనసును ఎంతో ఆహ్లాదపరిచే అందం. ఎంతమందిలోనైనా ప్రత్యేకంగా కనిపించే ముగ్ధత్వం. దేవుడు కొంతమంది విషయంలో ఎంతో పక్షపాతం కనబరుస్తాడనిపించింది, ఆ అమ్మాయిని చూడగానే.

"నిజమే, చాలా బాగుంది" ఆ అమ్మాయి వైపే చూస్తూ అన్నాను.

"ఊ? !" సాలోచనగా చూసింది నావైపు మా ఆవిడ.

"అదే, ఆ అమ్మాయి చాలా బాగుంది" మళ్ళీ అన్నాను. "ఆ గుండ్రటి కళ్ళు..."

"కానీ ఆ కళ్ళకింద గీతలే బాగా లేవు" చటుక్కున అంది మా ఆవిడ.

"ఆ కొనతేలిన ముక్కు..." తన మాటలు వినిపించుకోకుండా ముందుకు సాగాను.

"కానీ ఆ ముక్కు పక్కనుంచి చూస్తే అసలు బాగా లేదు" అడ్డు తగిలింది మా ఆవిడ.

"ఆ పోకచెక్కంత నోరు..." తన మాటలు సరిగా అర్థంకాక వర్ణన కొనసాగించాను.

"కానీ నవ్వితే ఎంత వంకరపోతున్నదో చూశారా ఆ నోరు? " తేలికగా కొట్టిపారేసింది తను.

నాకెక్కడో అపశృతి వినిపించింది. "ఆ నల్లటి జుట్టు..." అయినా ఆగలేక ముందుకు సాగాను.

"కానీ అది రంగనుకుంటా, చాలా అసహజంగా ఉంది" నిరసనగా అంది.

నాకు కొద్దికొద్దిగా అర్థం కాసాగింది. "ఆ



వంటిరంగు..." సందేహిస్తూనే అన్నాను.

"కానీ ఆ వంటిమీద అక్కడక్కడున్న మచ్చలు చూశారా, ఎంత అసహ్యంగా ఉన్నాయో?" మొహం ఎలానో పెట్టి అంది మా ఆవిడ.

"ఆ విశాలమైన..." అంటూన్న నాకు హఠాత్తుగా జ్ఞానోదయం అయింది.

నేను ఆగిపోయినా మా ఆవిడ ఆగలేదు. "మరీ అంత పెద్ద మొహమేమిటి బాబూ!" అంటూ ముఖం చిట్లించింది. "ఈపాటి అందం ఉన్నవాళ్లు కోకొల్లలు. తనేదో పెద్ద అతిలోకసుందరి అయినట్లు చూడండి ఆ వేషాలు..."

తరువాత తను మాట్లాడిన మాటలు వినలేదు నేను.

ఆ అమ్మాయిమీద కలిగిన జాలి బయటకు కనబరచకుండా, మా అమ్మాయి తన చేతులకు పట్టించుకున్న ఐస్‌క్రీమ్ తుడవసాగాను, 'నైజం' అనుకొంటూ.

– డా. కొండపల్లి రామారావు

## ఎంతమంది

ఏవో వస్తువులు కొనాలని బజారుకి వెళ్ళిన అనంతం అప్పుడే తిరిగివచ్చింది. వీధిగేటులోకి అడుగు పెట్టేసరికి ఇంట్లో ఏదో యుద్ధం జరుగుతున్న ఛాయలు కన్పించాయి. 'ఇంట్లో ఉన్నది ఆయన ఒక్కరే. రఘురాం వచ్చే సమయం కాలేదు. వంటవాణ్ణి పచారీ సామన్లు తెమ్మని తనే పంపించింది. మరి ఇంకెవరబ్బా ఆయనతో పోట్లాట వేసుకున్నది' అనుకుంటూనే గడపలో కాలు పెట్టేసరికి కన్పించిన దృశ్యం చూసి అలానే మ్రాన్పడిపోయింది.

పట్టుమని పాతికేళ్ళన్నా ఉండవు ఆ పిల్లకి. ఊరికే ఎగిరెగిరిపడుతోంది. "పెద్దోరు. సదువుకున్నోరు. పెద్ద ఉద్యోగం చేస్తున్నారు. మీలాంటోళ్ళు అనవల్సిన మాటేనా. మేం మిలాంటోళ్ళ కాళ్ళకాడ బతికేటోళ్ళమే. అయితే మాత్రం మీ ఇట్టవొచ్చినట్టు మాటలంటే పడతామనుకున్నారా..." అంటూ ఏమేమో అనేస్తోంది, అడ్డూ, ఆపూ, అలుపూ సొలుపు లేకుండా.

పాపం ప్రొఫెసర్ పరశురాం బిక్కచచ్చిపోయి సోఫాలో ఓ మూలగా ఒదిగికూర్చున్నాడు బిక్కుబిక్కుమని దిక్కులు చూస్తూ, తెల్లవార్లూ మంచులో తడిసిన కుక్కపిల్లలా వణికిపోతూ. లోపలికి వచ్చిన భార్య అనంతాన్ని చూడగానే ముఖంలోకి కళాకాంతులొచ్చాయి. ధైర్యంగా సోఫాలోంచి లేచి ఆమెకెదురెళ్ళాడు. "చూడు స్వరాజ్యం" అంటూ.

గుడ్లురుముతూ చూసింది భర్తవంక

అనంతం.

"అదె... అ...అనంతం. ఈ అమ్మాయెవరో ఇందాకట్నుంచి ఒకటే ధారగా తిట్టిపోస్తోంది. ఎందుకో మరి. నేనేమన్నానని" భయం భయంగా ఆ పిల్లవంక చూస్తూ అనంతం వెనక్కిజేరాడు. "ఏంటమ్మాయ్. ఎవర్నువ్వు? ఎందుకని అంత పెద్ద మనిషిని పట్టుకొని అంతలేసి మాటలంటున్నావ్" గదమాయింపుగా అంది అనంతం.

అంతే. గయ్యిమని పడింది అనంతం మీద ఆ పిల్ల.

"సాల్సాల్లేవమ్మా. పెద్ద సెప్పొచ్చావు. ఆయన పెద్దమనిషేంటి అనరాని మాటలన్నావోడు. ఇంతకీ తవరెవరు తల్లా" అంది సాగదీసుకుంటూ ఆ పిల్ల.

"నేను ఆయన భార్యనేగానీ, ఆయన్నిలా అల్లరి పెట్టడం ఏమన్నా బాగుందా? అసలు నువ్వెందుకొచ్చినట్టు మా ఇంటికి?" గట్టిగా అడిగింది అనంతం.

"బలేటోణ్ణి కట్టుకున్నావు లేవమ్మా. ఏదో ఆ శేషబాబుగారు పంపారని వొచ్చానుగాని ఇలాంటి మనుషలని తెలిస్తే అసలు వొచ్చేదాన్నే కాను" అంది ఆ అమ్మాయి.

"ఏమిటీ... శేషబాబుగారు పంపారా! అంటే పనిమనిషివి కాదుగదా" కంగారుపడింది అనంతం. అసలే పనిమనుషులు దొరక్క ఇబ్బంది పడుతుంటే, ఇంటికొచ్చిన పిల్లని పట్టుకొని ఏమన్నాడో ఈ మతిమరుపు మొగుడు అనుకుంటూ "అయ్యో... నువ్వా అమ్మాయి... పెద్దాయన ఏదో అనుంటార్లే పొరపాటున. ఇంతకీ నీ పేరేమిటన్నావు?" సర్దిచెప్తూ అనునయంగా అంది అనంతం.

ఆ పిల్ల మాత్రం ఏమాత్రం తగ్గకుండా "సాల్సాల్లేవొమ్మా సెప్పొచ్చావ్. ఆయనేవన్నా 'సిన్నమాట... సితకమాటా అన్నాడా. అంత ముతకమాట అన్నావోణ్ణి ఊరకనే వదులుతానా" అంటూ రెచ్చిపోబోయింది.

"నువ్వుండమ్మాయ్. నేను కనుక్కుంటానుగా! ఏమండీ ఆ పిల్లనేమన్నారూ..." అంటూ పరశురాం వంక తిరిగింది.

"అబ్బే... నేనేమన్నానూ, ఎవరమ్మాయ్ అనడిగాను. శేషబాబుగారు పంపారండి. పనిమనిషి కావాలంటగదా"అంది.

"అవును. పాపా నీ పేరేమిటి?" అన్నాను. "గౌరీ" అంది.

"అంతేకదమ్మాయ్" అంటూ ఆ అమ్మాయివంక చూశాడు.

"ఆఁ అంతే. ఆ తర్వాతేమన్నావో అది సెప్పు" మింగేసేలా చూస్తూ అంది ఆ అమ్మాయి.

"ఇంతకీ ఏమన్నారండి" విసుగ్గా అడిగింది అనంతం.

"అదే ప్రసన్నా...న్నా" భార్య అనంతం తీవ్రంగా చూడ్డంతో మాటల్ని మధ్యలోనే



మింగేసి మళ్ళా చెప్పాడు. "పెళ్ళయిందా" అన్నాను. "లేదు" అంది. ఇంకా ఏదో చెప్ప బోతున్నాడు.

"అదే... ఆ తర్వాతే ఏమన్నావో సెప్పు" మండిపడింది గౌరి.

"పిల్లలెంతమందీ... అన్నాను. అంతే. అప్పటినుంచి ఒకటే తిట్లదండకం. ఇందులో తప్పుమాటేముంది. పిల్లలెందరూ అనడం కూడా తప్పేనా? " విస్తుపోతూ అన్నాడు ప్రొఫెసర్.

"తప్పా... తప్పున్నరా..." ఒంటికాలిమీద లేచి రెచ్చిపోబోతున్న గౌరిని ప్రసన్నం చేసుకోవడం మొదలుపెట్టింది అనంతం.

– సూరిపండు

---

## పాపం సావిత్రి!!?

మార్కెట్ నుండి కూరగాయలు తెస్తున్న సావిత్రి ఉరఫ్ లౌడ్‌స్పీకర్ (ఇది ఆమె గొంతును బట్టి ఆమెకు ఆ కాలనీ వాళ్ళు పెట్టిన పేరు. అది తనకు పెట్టారని ఆమెకు తెలీదు. మీరు కూడా చెప్పకండేం!) పార్క్‌లోంచి వస్తున్న ఆ జంటవేపు చూసి ఉలిక్కిపడింది. తను చూస్తూన్నది నిజమేనా! అని కళ్ళు చికిలించి మరీ చూసింది. నిజమేనని ఖరారు చేసింది. ఈ విషయం ఎప్పుడెప్పుడు తన పక్కింటి రేఖకు చెబుదామా అని ఆత్రంగా, స్పీడ్‌గా తన ఇంటికి చేరుకుంది.

వెంటనే పెరటిగోడ దగ్గరికెళ్ళి పక్కింటి రేఖను పిలిచింది. ఆమె రాగానే "రేఖా! మన కాలనీలో ఆ చివరి ఇంట్లో కొత్తగా దిగారే ఇంజనీరుగారు, వాళ్ళ అమ్మాయి విమల ఎవరితోనో పార్కుల వెంబడి తిరుగుతోంది. ఈరోజు మార్కెట్ పక్కనే ఉన్న పార్కునుండి ఆ అమ్మాయీ, ఇంకొకతనూ కలిసి బయటకు రావడం నేను కళ్ళారా చూశాను" అని చెప్పింది.

'ఔనా!' అని ఆశ్చర్యంతో చూసింది రేఖ.

అదీ ఇదీ మాట్లాడిన తర్వాత 'వస్తానా దినా! కొంచెం పనుంది' అని అర్జెంటుగా లోపలికెళ్ళింది రేఖ. ఆ అర్జెంటు పనేంటో సావిత్రికి తెలుసు. ఇక రేఖా వాళ్ళింట్లో ఫోనుకూ, రేఖ నోటికీ అలుపూ, అదుపే ఉండదు. తనకు తెల్సిన విషయం కాలనీలో ఉన్నవాళ్ళకీ, లేనివాళ్ళకీ, మహిళా మండలి ఫ్రెండ్స్‌కూ, వారికీ, వీరికీ, అందరికీ చెప్పేస్తుంది- ఫోను ద్వారా.

అందుకే రేఖకు సావిత్రి పెట్టుకున్న పేరు 'ఎయిర్'. 'ఎయిర్' అంటే గాలి. అనీ వస్తుంది. AIR తీసుకుంటే All India Radio అని వస్తుంది. గాలి ఒకచోట కాక అంతటా వ్యాపించి ఉంటుంది. అలాగే రేఖ నోట్లో మాట (రహస్యం) అంతటా చేరుకుంటుంది ఆమె ద్వారా. అలాగే రేడియోల్లో వార్తల్లాగా ఆ ఊర్లో ఉన్న రేఖ ఫ్రెండ్స్ అందరికీ ఏ సమాచారమైనా ఆమె ద్వారా క్షణాల్లో చేరిపోతుంది. అందుకే ఆమెకు 'ఎయిర్' అని పేరు పెట్టిన తన తెలివితేటలకి తానే మురిసిపోతూంటుంది సావిత్రి, పాపం తనకూ తన కాలనీవాళ్ళే ఒక పేరు పెట్టారని తెలీక.

ఆ కాలనీలో రెండు, మూడు నెలలుగా విమల గురించే వార్తలు- 'విమల ఎవరితోనో బాగా తిరుగుతోందట'

విమల ఒకరితో కాదు, చాలామందితో చెట్టపట్టాలేసుకుని తిరుగుతోంది.

'ఆమెను బాయ్‌ఫ్రెండ్‌తో సినిమాలో చూశాము' ఇలా... ఇలా... ఈ వార్తలు ఎంతవరకూ నిజమో ఆ దేవుడికే తెలియాలి. కానీ ఆ కాలనీవాళ్ళకు మాత్రం మాంచి టాపిక్ దొరికింది- రోజూ మాట్లాడుకోవడానికి.

ఆ తర్వాత కొద్దిరోజులకు, ఒక శనివారం సాయంత్రం సావిత్రి మహిళామండలికి వెళ్ళింది. శనివారం సాయంత్రాలు అక్కడ



అందరూ కలుస్తుంటారు. అక్కడికెళ్ళిన తర్వాత సావిత్రి ఫ్రెండ్ గిరిజ సావిత్రిని పక్కకు పిలిచి అడిగింది "ఏమిటే, నేవిన్నది నిజమేనా? " అని.

విమల గురించే అడుగుతోందనుకుని పెద్దగా నవ్వుతూ "నిజమే" అని తలాడించింది.

"ఈ విషయం తెల్సిన తర్వాత కూడా అలా ఎలా నవ్వగల్గుతున్నావే? !" అని ఆశ్చర్యంగా అడిగింది గిరిజ, ఒకింత బాధతో.

ఆమె ఏమంటోందో సావిత్రికి అర్థం కాలేదు.

ఆమే మళ్ళీ అడిగింది "ఎన్నో నెల కమలకు? ఏంచేస్తున్నావ్? అబార్షన్ చేయిస్తున్నావా? లేక ఆ అబ్బాయితోనే పెళ్ళి చేయిస్తున్నావా? " అని.

"కమలేంటి? ఆ అమ్మాయి పేరు విమల. మా కాలనీలో చివరింట్లో ఉంటుంది. ఆ అమ్మాయే ప్రెగ్నెంటంట. కమల కాదు" అని చెప్పింది సావిత్రి ఒకింత అయోమయంతో.

"లేదే, కమల ఎవరితోనో తిరిగి కడుపు తెచ్చుకుందని సావిత్రికి ఎంత కష్టమొచ్చిందని ఇంతకుముందే మేమంతా మాట్లాడుకున్నాం" అంది గిరిజ.

"ఓరి దేవుడో! విమల పేరు అందరి నోట్లో నానీ, నానీ అది చివరకు కమలగా తేలింది. కమల నా కూతుర్రా. పాపం, ఆ పిల్లకే పాపం తెలీదు" అని నెత్తీనోరూ మొత్తుకుంది సావిత్రి.

మరోసారి ఆమెవైపు జాలిగా చూసి అక్కడినుండి వెళ్ళిపోయింది గిరిజ.

తాను వ్యాపింపచేసిన వార్త తన కూతురుకే ఎసరు పెట్టిందని తెలుసుకున్న సావిత్రి మ్రాన్పడిపోయింది. పాపం! సావిత్రి!!?

– బి. నరహరి

---

## 'పూజ'

"ఈ చేమంతిపూలు మూర ఎలాగ? " పూలని చేత్తో పట్టుకు చూస్తూ అడిగింది భానుమతి.

"మూర అయిదు రూపాయిలమ్మా"

భానుమతి వింతగా చూసింది వాడివైపు.

"ఏంటీ మూర అయిదా... ఎక్కడా లేదు ఈ రేటు. సరిగ్గా చెప్పు. ఇచ్చేమాట"

"ఒక్క రూపాయి కూడా తగ్గదు. వీళ్లందరికీ అలాగే ఇస్తున్నాను. మీ కిష్టమైతే తీసుకోండి. లేకపోతే లేదు" అన్నాడు పూలమ్మేవాడు నిక్కచ్చిగా. అప్పటికే నలుగురైదుగురు ఆడవాళ్లు అక్కడ వున్నారు. వాళ్ళు

బేరమాడకుండానే పువ్వులు పొట్లాలు కట్టిం చేసుకుని, డబ్బులిచ్చి వెళ్లిపోతున్నారు.

"ఈ మాత్రం దానికి ఈ పూల మార్కె ట్టుదాకా రావాలా? సీతంపేటలోనే దొరుకు తాయి" అంది భానుమతి అటు ఇటు చూస్తూ.

"అయితే అక్కడే తీసుకోవాల్సింది" అన్నాడు వాడు. మబ్బులు కమ్ముకొస్తు న్నాయి ఆకాశంలో వర్షం వచ్చేటట్టుగా వుంది. మారుమాట్లాడకుండా రెండు మూరలు చేమంతిపూలు తీసుకుంది. తర్వాత కొబ్బరికాయలవాడి దగ్గర బేరంచేసి కొబ్బరికాయ, అరటిపళ్లు బేరంచేసి వాడిచేత



తిట్లుతిని, మరొకడి దగ్గర అదే రేటుకి అర టిపళ్లు తీసుకుంది. ఆటోవాడితో బేరాలు మొదలెట్టింది. నెత్తిమీద చినుకులు పడ్డంతో ఆటోలోకి ఎక్కికూర్చుంది. మర్నాడు శ్రావణ శుక్రవారం.

రాత్రి మడిబట్ట ఆరేసుకుంది. పొద్దుటే లేచి తలంటుస్నానం చేసి మడిబట్ట కట్టు కుని జారుముడి వేసుకుంది. వెడల్పు ముఖంమీద పావలా కాసంత బొట్టు, కళ్లకి కాటుక, రెండు చేతులకి ఎర్రటి మట్టిగా జులు, మెడలో మంగళసూత్రంతోపాటు వెండికట్టుతో వున్న వంటిపేట ముత్యాల హారం, నల్లపూసలు వున్నాయి.

వంటిల్లు దేవుడిగది ఒకటే. గదంతా శుభ్రంచేసి ముగ్గులు పెట్టింది. దేవుడి పటాలన్నిటికీ కుంకుమబొట్లు పెట్టి ఒక్కొక్క పువ్వు పెట్టింది. వెండికుందుల్లో నెయ్యివేసి దీపాలు వెలిగించింది. స్టౌ వెలి గించి గిన్నెలో పాలుపోసి పెట్టింది. పసుపు విఘ్నేశ్వరుడ్ని, పసుపు మహాలక్ష్మిని చేసి వేర్వేరు తమలపాకులమీద పెట్టింది. అక్షిం తలు కలిపి వుంచుకుంది. పువ్వులు, కొబ్బ రికాయ, అరటిపళ్లు అన్నీ పక్కన పెట్టు కుంది. పూజ మొదలుపెట్టింది.

"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతు ర్భుజం..." అంటూ ముందుగా గణపతి పూజ చేసింది. తర్వాత లక్ష్మి అష్టోత్తరం చదవసాగింది. భానుమతి చదువుతూంటే అక్కడక్కడ తప్పులు దొర్లుతున్నాయి. కాని అవి తప్పులని తనకి తెలీదు.

"...దేవ్యువాచ దేవదేవ మహాదేవత్రి కాలజ్ఞ మహేశ్వర..." స్టౌమీద పాలు పెట్టిన సంగతి పూర్తిగా మర్చిపోయింది. పాలు... ప్రవాహంలా గట్టుమీదనించి కిందకు పడుతూ వుంటే ఆ శబ్దానికి ఉలి క్కిపడింది భానుమతి. వెంటనే "అయ్యో! అయ్యో! పాలు" అరుస్తూ భర్తని గట్టిగా కేకేసి పిల్చింది. మంచి నిద్రమత్తులో వున్న ఆనందరావు కంగారుగా లేచాడు.

"ఏమండీ పాలన్నీ పొంగిపోయాయి. అదంతా చీమలు పట్టకముందే శుభ్రం చేసే యండి" ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంది ఆమె.

కళ్లు నులుపుకుంటూనే "ఏమిటీ గోల. అంత చూసుకోలేనిదానివి పాలు ఎందుకు పెట్టావు స్టౌమీద?"

ఉరిమినట్టుగా చూసింది భర్తవైపు.

"పాలన్నీ నేలపాలయిపోయాయి. ముందు గుడ్డ తెచ్చి శుభ్రం చెయ్యండి. ఊc. అలా నించుని తెల్లమొహం వేసుకు చూస్తారేం. తొందరగా కానీయండి"

"అదికాదే..." ఏదో అనబోతుంటే "నేను పూజ చేసుకుంటున్నాను. మధ్యలో మాట్లా డించకండి" ఒక్క కసురు కసిరింది.

"ప్రకృతిం... వికృతిం... విద్యాం... సర్వ భూత హిత ప్రదాం శ్రద్ధాం..." గ్యాసు వాసన వంటిల్లంతా వ్యాపించింది.

"ముందా గ్యాసు కట్టేయండి" గ్యాసు కట్టేసి బద్ధకంగా నడుస్తూ వెళ్ళిపోతున్న భర్తని మళ్ళీ కేకేసి పిల్చింది.

"ఏమిటి అప్పుడే వెళ్ళిపోతున్నారు. అదంతా గుడ్డ తెచ్చి శుభ్రం చెయ్యమ న్నానా లేదా? ఊc కానీండి" కయ్యిమంది.

"అబ్బ నేనిప్పుడు చెయ్యలేనే. నాకు నిద్ర వస్తోంది"

"అదుగో అక్కడే నాకు వళ్లు మండిపో తుంది. చెప్పిన పని చెయ్యడం నేర్చుకోండి. ఇంత పొద్దున్నే లేచి కష్టపడి నేను పూజ చేసి ఇంత పుణ్యం సంపాదిస్తున్నానంటే... అది ఎవరికోసం అనుకున్నారు. మీ కోసమే. నన్ను చూసి బుద్ధి తెచ్చుకోండి. మీరూ వున్నారు ఎందుకూ! ఒక్కరోజైనా నాలాగ పూజ చేశారా? ఊc... ముందా పనిచూడండి"

"లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం... శ్రీరంగ ధామేశ్వరీం... దాసీభూత సమస్త దేవవనితాం... లోకైక దీపాంకురాం..."

పాపం ఆనందరావు భార్య నోటికి భయ పడి అదంతా శుభ్రం చేశాడు.

"ఏమండీ! అప్పుడే ఎనిమిదయిపోయింది. కుక్కర్‌లో బియ్యం, పప్పు పడేయండి. అటువైపు స్టౌమీద బంగాళదుంపలు వేపండి. ఈ పనిమనిషేమిటి ఇంకా వచ్చి చావలేదు. ఇవాళ పూజ చేసుకుంటాను. తొందరగా వచ్చి తగలడు అని మరీ మరీ చెప్పాను నిన్న... శ్రీమన్మంద కటాక్ష లబ్ధి విభవత్ బ్రహ్మేంద్ర గంగాధరాం... త్రైలోక్య కుటుంబినీం సరసిజాం... వందే ముకుందప్రియాం..."

వీధి తలుపు చప్పుడయింది. ఆనంద రావు వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా వెంకమ్మ చింపిరి తలేసుకుని నించుంది. తడిసిపోయిన చీరకుచ్చెళ్లని బొడ్లో దోపుకుంటూ లోపలికి వచ్చింది.

"ఆలీసం అయిపోనాది బాబూ...!" దాని గొంతు విన్న భానుమతి చేస్తున్న పూజ ఆపేసి.

"ఏవేc! ఇప్పటిదాకా ఎక్కడ చచ్చేవు? ఎన్నిసార్లు చెప్పాలే నీకు? పూజ వున్నరో జున తొందరగా వచ్చి చావు అని! ఒకసారి చెప్తే బుద్ధిరాదా నీకు! ఎన్నిసార్లు చెప్పించు కుంటావు? పండగపూట పాచి ఇల్లు వది లేస్తే ఎంత పాపం తెలుసా!"

"ఏటమ్మోవ్! మాటలు తిన్నగా రానీ. మీకేనేటి పండగ. అందరూ పూజలు సేసుకుంటారు. అందరికీ బేగిరావాలి. పన్లు తెమల్చుకుని వచ్చేసరికి ఆలీసమయి నాది. నోరు పారేసుకుంటే బాగోదు. నోరు మీకే కాదు నాకూ వుంది. వల్ల కోండి" వెంకమ్మ రుసరుసలాడుతూ నాలుగు తిరిగి వల్లించింది.

భానుమతి 'పూజ' చేస్తున్నదల్లా తారాజు వ్వలా లేచి దాని దగ్గరకు వెళ్ళి, "ఏంటే! వూరుకుంటూంటే రెచ్చిపోతున్నావు. చిన్నా పెద్దా లేకుండా పండగ పూటా నోటికొచ్చి నట్టు వాగుతున్నావు. ముదనష్టపుదానా! మిగతావాళ్ళ సంగతి నాకనవసరం. నా

ఇంటికి ముందు వస్తానన్నావు. రాలేదు. నీకీమధ్య పొయ్యేకాలం ఎక్కువైంది. చెప్పే దొకటి. చేసేదొకటి. నీలాంటివాళ్లు చస్తే నరకానికి పోతారు తెలుసా...!"

వెంకమ్మ గిన్నెలు తోముతూ మధ్యలో భద్రకాళిలా లేచింది. "నా సంగతేమో కాని మీరు ఛస్తే తప్పకుండా నరకానికే పోతారు. పాపం అమాయకపు మొగుడ్ని సాధించుకుతింటావుంటే కనబడ్డవాళ్ళందర్నీ ఆడిపోకుంటావుంటే ఆ యమధర్మరాజు వూరుకోడు!"

"ఏంటి నోటికొచ్చినట్టు పేలుతున్నావు... నేనేం చేస్తానో తెలుసా?" మీదమీదకు వస్తూ అరిచింది భానుమతి. ఆమె 'పూజ' మధ్యలో ఆగిపోయింది.

ఆనందరావుకి భయం వేసింది. భానుమతికి నోటి దురుసుతనం ఎక్కువ. తను తాళికట్టిన భర్త కాబట్టి భరిస్తున్నాడు. అందరూ భరించాలని ఎక్కడుంది?

"భానూ! వూరుకో. ఎందుకొచ్చిన గొడవ పండగపూట పొద్దున్నే" నచ్చచెప్పాలని చూశాడు.

"మీరు నోర్ముయ్యండి. మధ్యలో కలుగజేసుకుంటే మర్యాదగా వుండదు. దీనికీ మధ్య బుర్ర తిరుగుడెక్కువైంది. కొత్తగా రెండు ఇళ్లు వప్పేసుకుంది. అందుకే అలా పేట్రేగిపోతోంది"

చుట్టుపక్కల ఇళ్లల్లోని వాళ్లకి తమ ఇంటి భాగోతమంతా స్పష్టంగా కనిపిస్తుంది. ఎవరైనా చూసి నవ్వుకుంటారేమోనని భయం పట్టుకుంది ఆనందరావుకి. బితుకు బితుకుమంటూ నించున్నాడు.

"అమ్మా! మీకో దండం. మీ పనికో దండం. నా నెల్తన్నాను. మీ ఇంటిపని సెయ్యడం ఇక నావల్లకాదు..." ఎక్కడపని అక్కడ వదిలేసి లేచి వెళ్ళిపోయింది వెంకమ్మ. భానుమతి కోపంతో వూగిపోతోంది. "నాలాంటి భక్తురాలితో పెట్టుకున్నావు. కుక్కచావు ఛస్తావు. నాశనమైపోతావు. నా శాపం నీకు తగుల్తుంది జాగ్రత్త..." కుడిచేతిని ఎత్తి చాపి నిజంగానే శపించడానికి సిద్ధంగా వున్నట్టుగా పోజు పెట్టి అంది భానుమతి.

"ఎల్లెల్లెమ్మా! నీతో నాకేటి" నిర్లక్ష్యంగా విసవిసా వెళ్లిపోయింది వెంకమ్మ. ఆనందరావు తలపట్టుక్కూర్చున్నాడు. ఏ పనిమనిషీ భానుమతి దగ్గర రెండు నెలలకంటె ఎక్కువ పనిచెయ్యదు. ఈ ఊహించని సంఘటనకి భానుమతి కూడా ఖంగుతింది. అయినా తమాయించుకుని భర్తతో అంది, "ఏమండీ! నా 'పూజ' ఇంకా పూర్తవలేదు. పూజ మధ్యలో ఈ అవాంతరం ఒకటి వచ్చిపడింది. నేను ఇంకా పూజ చేసుకోవాలి. ఈ పూటకి ఆ గిన్నెలన్నీ తోమేయండి" ఆమె ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ. ఎదురుచెప్పే ధైర్యం ఆనందరావుకి లేదు.

భానుమతి తిరిగి పూజ ప్రారంభించింది. "లక్ష్మీః ప్రసీదసతతం నమతాం శరణ్యే..." ఈలోగా పిల్లలు లేచి పోయారు. గిన్నెలు తోమి, వంటచేసి, పిల్లలిద్దరికీ స్నానాలు చేయించి, అన్నం తినిపించి, బ్యాగ్‌లు సర్ది స్కూలుకి పంపించేసరికి తాతలు దిగొచ్చారు ఆనందరావుకి. అప్పటికింకా భానుమతి పూజ పూర్తికాలేదు. నోరు నొప్పిపుట్టేలా, దవడలు పీక్కుపోయేలా అపశృతులతో శ్లోకాలు చదువుతూ 'దేవుణ్ణి' ఇంకా హింస పెడుతూనే వుంది ఆమె!

అయితే ఈ హడావిడిలో 9-30కి తను ఠంచనుగా చూసే టీవీ సీరియల్ ప్రారంభమయ్యే ముహూర్తం ముంచుకొచ్చింది. అంతే "ఛీ...ఛీ... స్థిమితంగా పూజ చేసుకుందుకే వుండదు ఈ కొంపలో. ఆ టీవీ సీరియల్ టైము మరొక అరగంట తరవాత పెట్టి చావచ్చుగదా!" అనుకుంటూ గబాగబా హారతిచ్చి గంటకొట్టి పరుగున వచ్చి టీ.వీ. ముందు చతికిలబడింది. రోజూ ఏదో కాస్త కంచంలో అన్నమయినా పెట్టే భార్య

ఆరోజు స్పెషల్ పూజ కారణంగా ఆ పని చెయ్యలేకపోతోందని తెలుసుకున్న భర్త ఆఫీసు టైమయిన హడావిడిలో రెండు మెతుకులు తనే వడ్డించుకుని తిని వెళ్ళిపోయాడు.

– న్యాయపతి కమలారాంజీ

## బేతాళకథ

బేతాళుడికి బాగా వయసు మీద పడింది. విక్రమార్కుడి భుజంమీద వూరికే అలా వేలాట్టం, అతగాడికి మౌనభంగం కాగానే మళ్లీ చెట్టుమీదికి ఎగబాకటం చాలా కష్టంగా వుంటోందిప్పుడు. అందుకని జూనియర్స్‌కి ట్రయినింగిస్తున్నాడు.

ఇద్దరూ టాంక్‌బండ్ మీది రైలింగ్ దగ్గర కాపు కాశారోరోజు సాయంత్రం. రోడ్డు వాహనాలతో, మనుషులతో యమ రద్దీగా వుంది. దూరంగా సైకిల్ మీద రొప్పుకుంటూ వస్తున్న శాల్తీని చూసి బేతాళుడు ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

"అడుగో విక్రమార్కుడు. రోజూ ఈవేళప్పుడు ఇటే రొప్పుకుంటూ పోతుంటాడు. ఒక పట్టుపట్టు" అంటూ జూనియర్ని ముందుకు తోశాడు.

జూనియర్ సైకిలాయనతో మాటలు కలిపాడు మెల్లగా "రోజూ ఇటే పోతుంటావు ఎక్కడికని? "

సైకిల్ మనిషి మాట్లాడలేదు.

"ఫర్వాలేదులే చెప్పు, మౌనభంగమయినా నేనెక్కడికీ ఎగిరిపోను. ఇది నాకు ట్రయినింగ్ పిరియడ్. ప్రాక్టీసుకోసం వూరికే నీ వెంటపడ్డానంతే. ఎక్కడికి పోతున్నావో చెప్పు ముందు? "

"చిక్కడపల్లిలో సినిమా హాలుకి"

"ఏ సినిమాకి? "

"కలిసి చద్దాం రా!"

"అవ్వ ఎన్నిసార్లు చూస్తావా చెత్త సినిమా! సూపర్‌డూపర్ ఫ్లాపంటున్నారే అందరూ! నీకా సినిమాలో అంతగా నచ్చిందేంటి గురూ... కథా!"

"అసలుంటేగా!"

"కథనమా? "

"జీళ్లపాకం"

"కామెడీయా? "

"కాకిగోల"

"పాటలా? సంగీతమా? "

"చప్పగా వున్నాయి"

"సెంటిమెంటా? "

"అమృతాంజనం ఆయింటుమెంటు రాసుకోవాలి బ్రదరూ!"

జూనియర్ భేతాళుడు బేరుమనటానికి రడీగా వున్నాడు. పరువు కోసం సీనియర్ రంగంలోకి దూకాడు "విక్రమార్కుడి ముందు మనమంత తొందరగా తేలిపోకూడదురా బేటా! చూడు నేనెలా డీల్ చేస్తానో!"

సినిమాహాలు దగ్గరికొచ్చేసిందప్పటికే.

"సైకిల్ విక్రమార్కా! సినిమా పరమ ఛండాలంగా వున్నా నువ్వీ థియేటర్‌కు రోజూ ఇదే టైముకెందుకు పరుగెత్తుకుంటూ వస్తున్నావో... నేను చెప్పనా? "

"చెప్పుకో" అన్నాడు విక్రమార్కుడు రొప్పుకుంటూ సైకిల్ తొక్కుతూనే.

"నేనూ ఈ సినిమా గురించి విన్నాను లేవయ్యా! ఇందులో ఒక స్నానాల సీనుంటుంది కదా! వూరి బయట చెరువులో హీరోయిన్ జలకాలాడటానికి వంటిమీది బట్టలన్నీ ఒక్కొక్కటే విప్పుకుంటుంది అటు తిరిగి. తీరా నీళ్ళల్లో దూకటానికిటు తిరిగే సమయానికి తక్కున గేదెలేవో అడ్డొస్తాయటకదా... మనకీ సీనుకీ మధ్య అవునా? "

"అర్థమయింది. ఆ పాడు గేదెలెప్పటికైనా అడ్డు రాకుండా వుంటాయేమోనని కదూ మన గురుడు రోజూ ఆ రోత సిని

మాకి పోతున్నదీ" అన్నాడు జూనియర్ బేతాళుడుత్సాహంగా.

సీనియర్ మెచ్చుకోలుగా జూనియర్ భుజం తడుతుంటే "తెలుగు పత్రికల్లో, జోకులు బాగా చదువుతారులాగుందే. హీరోయిన్ని చూట్టానికి నేనింత దూరం రొప్పుకుంటూ రావడమెందుకూ? పిలిస్తే తనే వస్తుందెప్పుడైనా" అన్నాడు సీరియస్‌గా విక్రమార్కుడు.

సైకిల్ స్టాండులో పెట్టి రొప్పుకుంటూ టిక్కెట్టు కౌంటర్‌వైపుకు పోతున్న అతని సైకిల్ విక్రమార్కుడే సినిమా ప్రొడ్యూసరూ... హాలుముందు వాడే కూర్చుని టిక్కెట్లమ్ముకోవటం. అసంబద్ధతకైనా ఒక హద్దుండాలి పైగా వాతావరణ దినోత్సవం సందర్భంగా పెట్టిన పోటీకీ, ఈకథకీ... ఏవిధమయిన సంబంధం వుందీ? " అంతెత్తున ఎగిరాడొక విమర్శక శిఖామణి పత్రిక ఎడిటర్ టేబుల్ మీదకు విసిరేసి మరీ.

"వాతావరణ నేపథ్యంలో అత్యంత సహజ వాతావరణంలో రాసినందుకే ఈ కథకి ప్రథమ బహుమతినిచ్చాము"



వంక అక్కడే అంటించున్న పోస్టర్ వంక మార్చి మార్చి చూస్తూ "ఈ బొమ్మకు హీరో... ప్రొడ్యూసరూ కూడా వీడేలాగుంది బాస్. టిక్కెట్టు కొసేవాడేకాదు... అమ్మేవాడు కూడా లేనట్లుంది. వీడే కౌంటర్లో కూర్చొని ఆడియన్సు కోసం ఎదురు చూస్తున్నాడు చూడు" అన్నాడు జూనియర్ భేతాళుడు. సీనియర్‌కి తన మొకమెక్కడ దాచుకోవాలో తెలీక దాక్కోనేందుకక్కడ చెట్టేమీలేక బిత్తరపోయాడు.

వాతావరణ దినోత్సవ సందర్భంగా ఒక బుల్లి పత్రిక పెట్టిన కథల పోటీలో ప్రథమ బహుమతొచ్చిందీ కథకు.

"భేతాళుడు... సీనియర్... జూనియర్... అన్నారు ఎడిటర్‌గారు తాపీగా.

"అదెలా? " ఆశ్చర్యపోవటం విమర్శకుడివంతయింది.

"చూడండి... బేతాళుడు టాంకుబండ్‌మీది రెయిలింగ్ దగ్గర విక్రమార్కుడి కోసం కాపు కాస్తాడు మొదట్లో. అలాగే చివర్లో కూడా సీనియర్ బేతాళుడు సిగ్గుతో మొహం దాచుకోవటానికి చెట్టు ఏమీ కనబడక బిత్తరపోతాడు. నగర వాతావరణంలో చెట్లెక్కడా లేవని ఎంత చక్కగా చెప్పాడండీ రచయిత!" విమర్శకుడి నోరు మూతబడింది.

అసలీపోటీ కొచ్చిన కథ ఒకటే, పరువు కోసం బహుమతి ప్రకటించాల్సి వచ్చింది మరి. అదే అసలైన కథ.

– కర్లపాలెం హనుమంతరావు

# ది సిలికాన్ ఫ్యామిలీ పై సమీక్షలు

మే 'చతుర'లో ప్రచురితమైన సరోజా సింధూరి నవల
'ది సిలికాన్ ఫ్యామిలీ' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## నా భార్య నాకే సొంతం

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)




సరోజా సింధూరి గారి మే నెల చతుర నవల 'ది సిలికాన్ ఫ్యామిలీ' అతిసున్నిత విషయాన్ని అతిసునిశితంగా సున్నిత హాస్యాన్ని జోడించి చక్కగా నడిచింది. అందుకు ముందుగా వారికి అభినందనలు. నేడు సమాజంలో భాస్కరరావు, మధుకర్‌లాంటి మనస్తత్వం కల మగాళ్లెందరో ఉన్నారు. వాళ్ళు పరాయి ఆడవాళ్ళతో చెట్టాపట్టాలేసుకొని తిరగొచ్చుగాని తమ భార్యలు మరో మగాడితో పన్నెత్తి మాట్లాడినా, కన్నెత్తి చూసినా సహించలేరు. అలాంటివారికి శ్యామలగౌరి, విజ్జీలు తగిన రీతిలో 'ట్రీట్‌మెంట్' ఇవ్వడం బాగుంది. హనుమాయమ్మ, సీతలాంటివారి భర్తలు తమ భార్యలను చులకనగా చూస్తూ పెట్టే బాధలనుంచి కాపాడుకో

వడం కోసం పురుషోత్తంవంటి డాక్టర్ అవసరం ఈ సమాజానికి ఎంతైనా ఉంది. ఒక భార్యని భర్త ఎలా చూసుకోవాలో అన్న అంశంతో ప్రోగ్రాం సెట్ చేసిన మైక్రోచిప్ అవసరం చాలామంది ప్రబుద్ధులకు అవసరం. విజయ, శ్యామల ఇద్దరూ తమ భర్తలతో గొడవపడి విడిపోకుండా వాళ్ళతోనే వుంటూ ఆటపట్టించి ఏడ్పిస్తూ... తామెలాంటి 'మానసిక హింస' ననుభవించారో అంత బాధా వాళ్ళకి అనుభవంలోకి వచ్చేలా చేస్తూ వాళ్ళలో మార్పు రావడానికి ఆడిన నాటకం అభినందనీయంగా వుంది.

"నా భార్య నాకే సొంతం" కావాలని మగాడు ఎలా అనుకుంటాడో ఆడది కూడా తన భర్త ప్రేమ తనకొక్కతికే సొంతం కావాలనుకుంటుందని ఈ మగవాళ్ళు ఎందుకనుకోరో! భర్తమీద అనుమానంతో పలురకాలుగా మాటలతో, చేతలతో భర్తలను హింసించే ఆడవాళ్ళు సమాజంలో లేకపోలేదు. అయితే అది ఎక్కువ శాతం రచయిత్రి చెప్పినట్లు ఆత్మన్యూనతాభావంతోనో కాకుంటే మన భర్త మనకు దూరమైపోతున్నాడనో, కాకుండాపోతున్నాడనో, అభిమానంతో నిండిన అనుమానంతోనో మాత్రమే!

ఏదిఏమైనా ఈ సిలికాన్ ప్రేమలకన్నా సహజసిద్ధంగా భార్యాభర్తల మధ్య అవగాహనతో, అనురాగంతో ఏర్పడిన ప్రేమలే ఆహ్వానించతగినవి. అలాంటి ప్రేమ లోపిస్తున్న తరుణంలో కృత్రిమంగానైనా అలాంటి అనుభూతిని ఆహ్వానించడంలో తప్పు లేదు.

అందుకే 'సిలికాన్ ఫ్యామిలీ' జిందాబాద్!

– సువర్చలా జ్యోతి
తణుకు

## హ్రస్వదృష్టి

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

'సిలికాన్ ఫ్యామిలీ' చతుర నవల 'హ్యూమనరిజం'తో కూడి కామెడీని రంగరించుకుంది. "తన భార్య పతివ్రత కావాలి, పక్కవాడి భార్య తనక్కావాలి" అనేతత్త్వం చాలామంది మగవాళ్ళలో వున్న దౌర్బల్యం. తను పక్కవాడి భార్యను నిలువుగుడ్లేసు చూడొచ్చు. కాని తన భార్యపై చచ్చేంత అనుమానం. ఇలాంటివాళ్ళు సమాజంలో కోకొల్లలు. అందని స్త్రీలను కలల్లో, సొంత భార్యలా అనుభవించేవారు మరికొందరు. ఇలాంటి వారికి బుద్ధి చెప్పడానికి రచయిత్రి సృష్టించిన 'మైక్రోచిప్' మగవాడి పుర్రెలో పెట్టి, అతని ఆలోచనా విధానాన్ని మార్చడం ప్రకృతిసిద్ధంగా సాధ్యం కాకపోయినా రచయిత్రి ఆలోచన బాగుంది. హనుమాయమ్మ తన భర్తను మార్చుకుని, మిగతా వాళ్ళందరికీ ఆదర్శంగా మారింది.

ఒకనాడు స్త్రీని వంటింటి కుందేలుగా మార్చి పడకటింటికే పరిమితం చేసిన మగవాడి హ్రస్వదృష్టి, స్వార్థబుద్ధి ఇప్పటికీ చాలామందిలో అలాగే వుంది. సమాజంలో పరిస్థితులు, వాతావరణం మారినా మగవాడిలో మార్పు రావటంలేదు. స్త్రీలు ఇంటా బయటా జయకేతనాలు ఎగరేస్తుంటే మగవారు 'బావిలో కప్ప'లా ఆలోచిస్తున్నారు. తన అహంభావాన్ని సంతృప్తి పరచుకోవడానికి స్త్రీలపై శారీరక, మానసిక దాడులకు పూనుకొంటున్నారు.

సమాజంలో మార్పుకు సిలికాన్ ఫ్యామిలీలు చాలా అవసరం.

చివరివరకు కథను రసవత్తరంగా నడిపించినా చివరలో సాగదీసినట్లు కనిపిస్తుంది. సంభాషణలు కామెడీతో కూడి

బాగున్నాయి. అభినందనలు.

– డి. శ్రీధరాచార్య
అదిలాబాద్

## వెరయిటీ దాంపత్యాలు- వినూత్న సలహాలు

**(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

మే నెల చతుర సంచికలో వచ్చిన సరోజా సింధూరిగారి నవల 'సిలికాన్ ఫ్యామిలీ' చక్కగా వుంది. దాంపత్య జీవితంలోని సరిగమలను యథాతథంగా వివరిస్తూ, చక్కని హాస్యంతో, అడుగడుగునా నవ్విస్తూ, ఆద్యంతమూ విడిచిపెట్టకుండా ప్రతీవారినీ చదివింపచేసింది.

భార్యను అదుపులో వుంచామనుకుంటూ కాలరెగరేసి, ఫోజుకొట్టే భర్తలకు చెంపపెట్టుగా వుందీ నవల.

ఏపని చేసినా నోరు మూసుకుని పడి వుంటుందిలే... అనుకునే భర్తలను భార్యలు మనసులో ఎలా తిట్టుకుంటారో చెప్పారు సరోజాసింధూరి. 'నేనంటే మా ఆవిడకు చచ్చేంత భయం. ఉద్యోగం చేస్తున్నా నా మాట వింటుంది. ఎదురింటావిడకు లైనేసినా పడివుంటుంది. ఆవిడను అదుపులో వుంచానంటే అదంతా నా ప్రజ్ఞే' అనుకునే అమాయక భర్తలకు బుద్ధి చెప్పిందీ నవల.

మొగుళ్ళ మనసులు పరాయి ఆడదాన్ని చూసి గంగవెర్రులెత్తి, మాయదారి రోగం కొనితెచ్చుకుంటే ఎలా ట్రీట్ చేయాలో తెలియచెప్పే మెడిసిన్ ఈ నవల. అద్భుతమైన శైలి, కథ చెప్పడంలో నైపుణ్యం, ఆలోచనా ధోరణిలో వైవిధ్యం... మొత్తం మీద నవీన ప్రయోగం ఈ నవల.

ప్రతీవారినీ చదివించే చాకచక్యంతో రచయిత్రి కలం పరుగులు తీసింది. ఈ నవల మగాళ్ళు... మొగుళ్ళు చదివితే వారి ప్రవర్తనను పరిశీలించుకుని అర్థాంగిని ఆదరించగల అవకాశాన్నిస్తుంది. నవల అంటే కాలక్షేపానికి కాకుండా ఒక సందేశాన్నీ, ఒక మంచి సలహాను, ఇచ్చేలా రచయిత్రి రాశారు. మంచి నవల చదివామనే తృప్తిని మిగిల్చిందీ నవల. వెరైటీ దాంపత్యాలకు వినూత్న సలహాలను అందించినందుకు రచయిత్రికి అభినందనలు.

– ఎన్. కృష్ణకుమారి
హైదరాబాదు

## అందమైన మేళవింపు

**(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

కొంచెం హాస్యం, కొంచెం వ్యంగ్యం, కొంచెం ఆలోచన, కొంచెం సైన్స్ అన్నింటినీ మేళవించి అందంగా తీర్చిదిద్దిన నవల 'ది సిలికాన్ ఫ్యామిలీ'. ఓ పక్కన నవ్విస్తూనే మరోపక్క ఆలోచింపచెయ్యడం మరీ వన్ సైడెడ్‌గా కాకుండా ఆండాళ్ల పాత్ర ప్రవేశపెట్టి భావాలను సమతుల్యం చెయ్యడం అభినందించకుండా ఉండలేం.

రచయిత్రి కథను 'ఫస్ట్‌పర్సన్'లో నడిపించడం కథకు సహజత్వాన్ని, వాస్తవికతను అందించింది. మానసిక విశ్లేషణకు అంతగా తావులేకపోయినా విజయ పాత్ర ఊహ కథనానికి ప్రాణం పోసింది. ఆరంభంలో ఆడవాళ్లను సపోర్ట్ చేస్తున్నట్టనిపించినా కథ నడిచేకొద్దీ మానసిక వికృతిని స్త్రీ పురుష భేదాలు లేకుండా చిత్రించటం నవలకు గట్టి పునాదిని వేసింది.

నిజానికి రెండు మూడు కుటుంబాల కథే అయినా జాతిమత భేదాల్లేకుండా,

ప్రాంతీయ తేడాలు రాకుండా జీవన విధానాల్ని, ఆలోచనాసరళిని మధ్యతరగతి మనస్తత్వాలను తూర్పారబట్టడమే కాకుండా సున్నితంగా చీల్చి చెండాడారు రచయిత్రి సరోజా సింధూరిగారు.

ఒక చిన్న ఆశతో ప్రస్తుతం మనం జీవిస్తున్న కంప్యూటర్ యుగంలో మన అభివృద్ధి మరీ మెటీరియలిస్టిక్‌గా కాకూడదని మానసికానందమూ జీవితాలకు ముఖ్యమేనని చెప్పారు రచయిత్రి. ఓ మంచి నవల చాలా రోజులకు చదివామనిపించింది.

– శ్రీపాద లక్ష్మీదేవి
హైదరాబాద్

## టుడే మోస్ట్ వాంటెడ్

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

సరోజాసింధూరిగారి నవల 'ది సిలికాన్ ఫ్యామిలీ' చాలా చక్కటి విషయాన్ని చర్చిస్తూ భార్యభర్తల మధ్య ఉండే సంబంధబాంధవ్యాలు, పూర్వకాలంనుంచి ఆడా, మగలమధ్య వున్న సంబంధాలను, వాటిని నిలబెట్టుకోటానికి అనుసరిస్తూ వస్తున్న నియమాల్లో కూడిన పద్ధతులను చక్కగా వివరించారు. మంచి మాటల హాస్యంతో పాఠకులను చదివిస్తూ ఆలోచింపచేసే నవల 'ది సిలికాన్ ఫ్యామిలీ'. విజయ, మధుకర్, శ్యామలగౌరి, భాస్కరరావులేకాదు ఈ సమాజంలో అటువంటి మధుకర్, భాస్కరరావులు బోలెడుమంది వున్నారు. వాళ్ల దృష్టిలో తన పెళ్లాం కాకి, పక్కవాడి పెళ్లాం రంభలాగుంటుంది. అట్లాంటి వాళ్లు చేసే పనులకు విసుగెత్తి గొడవపడి కాపురాలు కూలదీసుకునే వాళ్లు ఎంతోమంది వున్నారు. డాక్టర్ పురుషోత్తమ్‌రావుగారు అద్భుత, అపూర్వ సృష్టి అయిన భార్యను లేదా భర్తను ప్రేమించండి అనే మైక్రోచిప్ అమర్చే బ్రెయిన్ ఆపరేషన్ ప్రస్తుతం ఎంతైనా అవసరం.

ఒకరి ప్రేరణవల్లకానీ, ప్రోత్సాహం వల్లకానీ ఆడవాళ్లు మగవాళ్లనుకానీ, మగవాళ్లు ఆడవాళ్లనుకానీ పెళ్లికాకముందు ప్రేమిస్తారేమోకానీ పెళ్లయ్యాక మాత్రం ఒకరి ప్రమేయం, ప్రోత్సాహం, ప్రేరణ ఏమాత్రం పనిచేయవ్ సరికదా ఇట్లాంటి ఆపరేషన్‌లు కూడా ఏమీ చేయలేవ్. అందుకే హనుమాయమ్మ పిన్నితో బాబాయ్‌కు ఆపరేషన్ చేయించినంత తేలిగ్గా విజయ మధుకర్‌కు చేయించలేకపోయింది. పరిస్థితులకు తట్టుకొని కొంతకాలం, తప్పుకొని కొంతకాలం గడపిన మీదట సహజమైన ప్రేమ పుట్టుకొచ్చిన భర్తలు ఆపరేషన్ చేయించుకొని ఇంకా తమ భార్యలను ఎక్కువ ప్రేమించాలంటూ చక్కని ముగింపునిచ్చిన సరోజా సింధూరిగారు ఎంతైనా అభినందనీయురాలు. ఈ మైక్రోచిప్ అమరిక ఆపరేషన్ ఈ రోజుల్లో తప్పనిసరి అవసరం.

– తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి
అర్ధవరం

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044-2314980; Bangalore: 080- 3503498

